# భూమిక

(కథలు, కవితలు, వ్యాసాలు)



సంగ్రామ్

జాబిలి ప్రచురణలు
గుంటూరు

15 జూలై 2023
సంగ్రామ్ జన్మదినోత్సవమ్

ప్రతులకు:
జాస్తి. దాక్షాయణి
కమలేష్ రెసిడెన్సీ,
7/1 చంద్రమౌళి నగర్,
గుంటూరు.

వెల : పాఠకుల అభిమానం

Bhumika - Samgram

సంగ్రామ్ గారి కవితలు వినటానికి పైన కనబడుతన్న QR code ను ఫోనులో Google lens లో scan చేస్తే, ఇప్పుడు మీకు ఒక లింక్ కనడుతుంది. దానిపై క్లిక్ చేస్తే ఈ కవితలను మీరు వీనులవిందుగా వినవచ్చు.

**విషయ సూచిక**


**I. భూమికోసం (కథలు)**

జీవిత శకలాలు: సంగ్రామ్ కథలు: చలసాని ప్రసాద్ 9
మూడు కథల బంగారం: వరవరరావు 11
ఎందుకు రాయాలి?సరైన జవాబు కథలు – జి. కళ్యాణరావు 13
1. కరువుదాడి 26
2. భూమికోసం 33
3. అభ్యుదయం 45
4. రైతు ప్రస్థానం 50

**II. పోరాటమె దారి (కవితలు)**

1. మేలుకొలుపు 60
2. పెట్టరా చిచ్చు 62
3. లేచిరండి 63
4. పొంగింది రక్తం 64
5. విప్లవరథం 65
6. పోరులేక సమము లేదు 66
7. జోహారు 68
8. గోముఖ వ్యాఘ్రం 69
9. లేస్తున్నారు జనం 70
10. రారోరి పోదాం 71
11. మా మార్గం – పోరాటం 72
12. విజయం – తథ్యం 73
13. కదలి రండన్నా 75
14. మార్పుగాలి 76
15. అరుణ మార్గం 77
16. ఏరువాక 78
17. విప్లవకారుని ఉత్తరం 79

**III. ఉదయగానం** (కవితలు)

1. బిడ్డవా నీవంది 90
2. కరిగిన కలలు 92
3. పేక జీవితం 93

| | |
|---|---|
| 4. కరువు | 94 |
| 5. పావలా | 95 |
| 6. నిరుద్యోగి ఉద్యోగం | 97 |
| 7. కొత్త మెరుగులు | 98 |
| 8. ఉదయగానం | 100 |
| 9. కదలిరండి – కలసి రండి..... | 102 |
| 10. బ్రతుకు | 104 |
| 11. చాగంటి భాస్కరా! | 105 |
| 12. అరుణతారలు | 107 |
| 13. లంగ రొదులుము | 108 |
| 14. ఆరని మంటలు | 109 |
| 15. అమర సుధానిధి | 110 |
| 16. మేడే! | 112 |
| 17. ఏమి రాజ్యం? | 113 |
| 18. జనపథం | 115 |
| 19. పోరుదారి | 116 |
| 20. కబోదికి జవాబు | 118 |
| 21. చుక్కాని | 119 |
| 22. చెరగని చెర | 121 |
| 23. చందమామయ్య | 122 |
| 24. ఉగాది | 126 |
| 25. ఓ పేద రైతా... ఓ కూలి రైతా | 131 |
| 26. స్వగతం | 132 |
| 27. బ్రతకాలిగా | 133 |
| 28. తల్లి భాష | 134 |
| 29. తెలుగు వెలుగు | 136 |
| 30. చిన్నతనమే | 137 |
| 31. అదృష్టవంతులు | 139 |
| 32. నిరీక్షణ | 140 |
| 33. వస్తున్నా! వస్తున్నా !! | 142 |
| 34. సోదర భారత వీరా! | 144 |

35. పాపాయి 145
36. పాప 146
37. కాంక్ష 147
38. ఓ చెలీ! రా చెలీ!! 148
39. మాటాడ బోకే 149
40. బాల 150
41. సఖియ 151
42. నా చెలియ 152
43. చిన్నదానా! హై చిన్నదానా! 153
44. వనితా లోకం 154
45. ఇదే నా భరతదేశం 155
46. ఎందుకు ఈశ్వరా! ఎందుకు? 156
47. వద్దు ప్రభూ 157
48. ప్రభూ ఈశ్వరా! 158
49. ప్రియ ఈశ్వరా! 159
50. ఈశ్వరా! 160
51. దయామయుడా 161
52. ఆరని జ్యోతి 162
53. ఇంద్రజాలము 163
54. ఎలా ఈశ్వరా? 164
55. ఎన్నాళ్లు బ్రతుకు 165
56. రారా మురళీధరా! 166
57. అశక్తత 167
58. మహాత్ములు 168
59. చెలీ ఈశ్వరుడు 169
60. చెలి 170
61. ఆనాడు – ఈనాడు 171
62. రారా మువ్వగోపాలా ! 172
63. సత్యనారాయణా 173
64. అరుకులు 175
65. జీవిత సమీక్ష 176

66. ఆదివారం స్వర్గం 179
67. పిలుపు 181
68. ఈశ్వరా! 182
69. కరిగిపోనా ప్రభూ 182
70. వాన వెలసిన రాత్రి 183

**IV. వ్యాసాలు**

1. విప్లవ నవల – వస్తువు – శైలి – అవగాహన 187
2. కొలిమంటుకున్నది 195
3. ఇన్‌క్రెడిబుల్ గాడెస్ 201
4. కళలు – సాహిత్యం – ఎవరి కోసం? 212
5. ప్రజా పోరాట సాధనాలుగా కథ, నవల 214
6. మహిళలు లేకుండా నిజమైన ప్రజాఉద్యమం లేదు 217
7. వలసవాద నీడలో గైనెస్ 220
8. రైతు కవిత 223
9. రవీంద్రుడు 227
10. వీరగాథలు 232
11. రాహుల్ సాంకృత్యాయన్ 242
12. సంస్కృతి 247
13. విమర్శ 250



ముందుమాట



*చలసాని ప్రసాద్ గారితో సంగ్రామ్*

## జీవిత శకలాలు: సంగ్రామ్ కథలు - చలసాని ప్రసాద్

“......... సాహిత్యానికి చిన్న కథ చేసిన సేవ అపారమైనదని కళ్లకు కట్టినట్లు కనిపిస్తుంది. చిన్నకథ అనేదే లేకపోతే, సంఘంలో జరిగే అనేక సంఘటనలకీ, మానవ మనస్తత్వంలోని కొన్ని పట్టులకీ, జీవితంలోని కొన్ని విరుపులకీ సాహిత్యంలో చోటు వుండేది కాదు. వాటిని జొప్పించటానికి మార్గమే దొరికేది కాదు. ఇవన్నీ పుట్టినవి పుట్టినట్లే యింకిపోవలసి వచ్చేది. సాహిత్యాన్ని ఈ అపాయాన్నుంచి రక్షించింది చిన్న కథ". ఇవి గోపీచంద్ మాటలు (1956).

కథ ‘అగ్ని’ పురాణంలో తొలిగా మనకి కనిపిస్తుంది అంటారు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు ‘కథానిక’ అనే వ్యాసంలో (1937). అగ్ని పురాణం చెప్పిన ప్రకారం గద్య రచనలు అయిదు రకాలు. ఆఖ్యాయిక, కథ, ఖండకథ, పరికథ, కథానిక. ఇవ్వాల్టి తెలుగు కథ అన్నా, కథానిక అన్నా ఇంచుమించు ఒకటే.

ఆధునిక కథకు బీజాలు ఏదో ఒక మేరకైనా అగ్ని పురాణంలో చెప్పిన లక్షణాలు కథానికలో వున్నాయి. ఈ కథానికలో సంక్షిప్తత, ఏకాగ్రత, సమగ్రత వుంటే బాగుంటుంది.

ఆధునిక కథ సమకాలీన జీవితాన్ని చిత్రిస్తుంది. ఈ లెక్కన తొలి తెలుగు కథ గురజాడ 'దిద్దుబాటు' (1910). ఈ సంగతిని కథా నిలయం నిర్ధారించినా, దీనిని గురించిన వాదోపవాదాలు ఇంకా ఒక కొలిక్కి రాలేదు. ఇంద్రధనస్సులో ఏడు రంగుల్లాగా తొలి తెలుగు కథగా ఏడు కథలు ముగ్గులోకి వచ్చాయి, సారం ఇంకా తేలవలసే వుంది.

ఈ 'భూమికోసం కథలు' జాస్తి పుల్లయ్య ఉరఫ్ సంగ్రామ్ రాసినవి. ఇవి అనగా అనగా కథలు కావు. కబుర్లు అంతకంటే కావు, కాలక్షేపం బఠానీలు అసలే కావు. వీటిని జీవిత శకలాలు అనవచ్చు. సూర్యుడిచుట్టూ భూమి తిరిగినట్లు భూమిచుట్టూ సాహిత్యం తిరుగుతుంది. కారా మాస్టారు 'యజ్ఞం' రాసిన నాటి నుంచి నేలబారు జనం గురించిన కథలకి గిరాకి పెరిగింది. సంగ్రామ్ కథలన్నీ వీటికి తార్కాణాలుగా కనిపిస్తాయి. ఏ చైతన్యం అయినా జీవితం నుంచే రావాలి. జీవితం మీద ఆసక్తి, వాస్తవికత మీద పట్టు లేకపోతే సంగ్రామ్ కలం నుంచి ఈ కథలు వెలువడేవి కావు. ఈ కథలు చదివితే, కథలు రాయడం కష్టమనేది ఎంత తెలివి తక్కువతనమో అర్థమవుతుంది. కొత్తగా కథలు రాసేవాళ్లు సంగ్రామ్ నుంచి ఊపును, ఉత్సాహాన్ని అందిపుచ్చుకోవచ్చు.

**విశాఖపట్నం**

**5- 12- 2009**

# మూడు కథల బంగారం: వరవరరావు



జాష్టి పుల్లయ్య గారు 'సంగ్రామ్' అని తన విప్లవావగాహన వల్ల పేరు పెట్టుకొని ఉంటారు. కాకపోతే ఆయన ఎంత నెమ్మదస్తుడో, ఎంత సౌమ్యుడో, ఎంత సహనశీలో. విరసంలోకి వచ్చినప్పటినుంచి ఆయన నాకు సంగ్రామనే తెలుసు. విప్లవ సాహిత్య సంగ్రామ్. విప్లవ సాంస్కృతికోద్యమ సంగ్రామ్. విప్లవ ప్రజా ఉద్యమ సంగ్రామ్. కాని ఈ అన్ని కార్యకలాపాల్లో కూడా ఆయన ఒక కార్యకర్త. ఒక నేపథ్యం. ఒక అంతస్స్రవంతి. ఇతడు సంగ్రామా–ఇతనేనా సంగ్రామ్ అనిపించేంత జాష్టి పుల్లయ్య.

అందుకే చుండూరు మారణకాండ జరిగినపుడు నేను నాగార్జునసాగర్ రెసిడెన్షియల్ కాలేజికి వెళ్లినపుడు అక్కడ నా ప్రసంగం వినడానికివచ్చి తాను వెంటనే నాతో చుండూరు రావడానికి సంసిద్ధత తెలిపిన సందర్భం నాకు మనసు మీద ముద్ర వేసింది. అప్పటికాయన ఉద్యోగి.

ఉద్యోగ విధిలోనే ఆరోజు ఆయన సాగర్ కు వచ్చాడు. చుండూరుకు వెళ్లి మేం కేవలం దళితుల మీద అమానుష దాడిని ఖండించడమే కాదు, నిందితుల భూములు స్వాధీనం చేసుకొని బాధితులకు పంచాలని డిమాండ్ చేసినది.

ఇప్పుడు 'కరువుదాడి', 'భూమికోసం', 'రైతు ప్రస్థానం' కథలు చదువుతుంటే ఈ మౌలిక పరిష్కారంవైపు ఎప్పటినుంచి సంగ్రామ్ మనస్సు సంఘర్షణ పడుతుందో స్పష్టమవుతున్నది.అంత మాగిన మానసిక సంసిద్ధత అది.



సృజనలో నలభై ఏళ్ల క్రితం కొత్తగూడెం దగ్గర జరిగిన ఒక కరువు దాడి గురించి ఆనంద్ అనే అపరిచిత రచయిత ఒక అద్భుతమైన కథ రాసాడు. ఆ కథ నిజంగా జరిగిన సంఘటన. ఆ దాడి వెనుక ఒక నిర్మాణం ఉన్నది. అది ఆ ప్రాంతంలో ఆ రోజుల్లో చంద్ర పుల్లారెడ్డి నాయకత్వంలో బత్తుల వెంకటేశ్వరరావు, ఆయన సహచర కామ్రేడ్స్ చేసారు. ఇప్పుడు నాకు సంగ్రామ్ రాసిన కరువుదాడి కథ చదువుతుంటే ఆ కథ చదివిన వాక్యాల వెంట మనస్సు పరుగెత్తింది. ఇది అక్షరాలా జరిగిన సంఘటన. ఆ సంగతి సంగ్రామ్‌గారే చెప్పారు. ఈ రచన 1968లో చేసాడు. కథాకాలం కూడా అదే. అప్పటికింకా విరసం ఏర్పడలేదు. నక్సల్బరీ జరిగింది.

శ్రీకాకుళం గరుడ భద్రాపురం చర్య జరిగిందో లేదో కాని శ్రీకాకుళ ఆదివాసీ ఉద్యమాన్ని వెంపటాపు సత్యం, కైలాసాలు నిర్మాణం చేస్తున్నారు. గిరిజన సంఘర్షణ సమితులు ఏర్పాటు చేసారు.

మైదాన ప్రాంతాలనుంచి వచ్చి ఆదివాసులు సాగుచేసిన పోడుభూముల నాక్రమించుకున్న భూస్వాములు, వడ్డీ వ్యాపారులకు వ్యతిరేకంగా వాళ్ల పోడు భూముల్లో వాళ్లే కంబారులుగా మారిన ఆదివాసులను పోరాటపథంలో కదిలించారు. అక్టోబర్ 31న మొండెంఖల్లులో శ్రీకాకుళం జిల్లా గిరిజన రైతు కూలీ సంఘం మహాసభల నాటికి బహుశా సంప్రదాయ ఆయుధాలతో ప్రతిఘటించే స్థాయికి వచ్చారు. ఆ సభకు వచ్చే ఆదివాసుల మీద మేడిద సత్యనారాయణ అనే గోదావరి జిల్లాకు చెందిన భూస్వామి కాల్చిన కాల్పుల్లో కోరన్న, మంగన్న అనే ఆదివాసీలు అమరులు అయ్యారు.



ఆత్మరక్షణ కోసమైనా సరే ఆయుధం పట్టక తప్పదని సత్యం ఆ సభలో ప్రకటించారు. అదే చరిత్రాత్మకమైన అక్టోబర్ 31.

ఖమ్మం, వరంగల్, కరీంనగర్ అడవుల్లో అప్పటికే విప్లవం పురిటి నొప్పులు అనుభవిస్తున్నది. శ్రీకాకుళంలో ఏజెన్సీ ఏరియాలతోపాటు ఈ మూడు జిల్లాల్లోని అటవీ తాలూకాలు (ఇల్లెందు, కొత్తగూడెం, మానుకోట, నర్సంపేట, ములుగు, ఏటూరు నాగారం, మంథెన, మహదేవపూర్) 'కల్లోలిత ప్రాంతాలు'గా ప్రకటించబడినాయి.

నక్సల్బరీ ఉద్యమంతో తన విప్లవ స్వప్న సాక్షాత్కారానికి నడుం కట్టిన విప్లవ స్వాప్నికుడు కామ్రేడ్ ఎస్.ఎ.రవూఫ్. ఆయనది అనంతపురం జిల్లా కదిరి. కమ్యూనిస్టు పార్టీ వర్గ పోరాటానికి హామీపడినపుడల్లా అటువైపు కదిలాడు. భ్రమలు వీడగానే ఆ లేబిల్ వదులుకొని ముందుకు కదిలాడు. అందుకోసం న్యాయవాద వృత్తిని, పబ్లిక్ ప్రాసిక్యూటర్ పదవిని వదులుకున్నాడు. స్వయంగా కామ్రేడ్ చారుమజుందార్ను కలిసాడు. నక్సల్బరీ పంథాను ఎంచుకున్నాడు. శ్రీకాకుళంలో వలె సంప్రదాయ ఆయుధాలతో కరువు దాడులూ చేయవచ్చు. అడ్డం వచ్చిన వర్గ శత్రువునూ నిర్మూలించ వచ్చునని ఎంచుకున్నాడు.




1968లో 'ఆయుధాలతో కమ్యూనిస్టుల కరువుదాడి' వార్త చదివి, ఆ దాడి వెనుక కా॥ ఎస్.ఎ. రవూఫ్ నిర్మాణం చేస్తున్న పార్టీ ఉన్నదని అక్కడి ప్రజలు చెప్పుకోవడం విని సంగ్రామ్ రాసిన కథకు నేపథ్యం ఇది.

ఈ కరువుదాడి డబ్బు తప్ప లోకంలేని డాక్టరును మనిషిని చేసింది. అంటే కథకునికి నిమిత్తం ఆ డబ్బు మనిషి డాక్టరే.

ఆ డాక్టర్ జలగవలె పీలుస్తున్న, కరువు జిల్లా ప్రజలే. తన సానుభూతి ఆ ప్రజలపట్ల. ఆసహ్యం ఆ డబ్బు డాక్టర్ పట్ల. ఆ కృత్రిమ కరువులోకి విప్లవ వసంత ఋతువు ప్రవేశించింది. కరువును గుణాత్మకంగా ఎదుర్కొన్నది, ఒక స్వార్థపరుణ్ని మనిషిని చేసింది, ఒక సహృదయుణ్ని సాహిత్య నిబద్ధతకు గురిచేసింది. అది సంఘటనైనా, కథగా రికార్డయినా అంతకన్నా కావల్సిందేమిటి?




శ్రీశ్రీకి ఎమర్జెన్సీ చీకటి రోజుల్లో ఎందుకనిపించిందో, తపాల్పూర్ సంఘటన గురించి విన్నాడో, అలీపూర్ (కలకత్తా) జైలు నుంచి నక్సలైట్లు తప్పించుకొని పోయారన్నది విన్నాడో, ఆంధ్రప్రదేశ్ జైళ్లలో తన విరసం సహచరుల పట్టుదల చూసాడో, తెలంగాణాలో చాపకింద నీటివలె ఊటలూరుతున్న జగిత్యాల, సిరిసిల్లలను ఊహించుకున్నాడోగానీ, 'మెల్ల మెల్లగా జోరుజోరుగా' అని ఒక అద్భుతమైన కవిత 1976 నవంబర్ 19న రాసాడు.

"మెల్లమెల్లగా వస్తోంది, చిట్టి పొట్టి అడుగుల చీమల నడకలు సాగిస్తూ వస్తోంది నింపాదిగా – విత్తనంలోంచి ఎదుగుతున్న వృక్షంలాగ...."

అని మొదలై "నెత్తురు నాలుకలు చాస్తూ ఒక జీవితాన్ని మరో జీవితానికి పెనవేస్తూ వస్తోంది వస్తోంది విప్లవం".



అంతే నింపాదిగా సంగ్రామ్ ఎస్.ఎ.రవూఫ్ గురించిన వినికిడి జ్ఞానం నుంచి, 'కరువుదాడి' వార్త నుంచి 1968 నుంచి 1980ల కామ్రేడ్ శేషప్రసాద్ విప్లవాచరణ జీవితంతో పెనవేసుకున్నాడు. అది కారంచేడు, వేంపెంట దళిత ఉద్యమాలను విప్లవాచరణలోకి తెచ్చిన జీవితం. ప్రకాశం, గుంటూరు జిల్లాల నుంచి రాయలసీమ వరకు దళిత ఆత్మగౌరవాన్ని విప్లవ చైతన్యంలోకి మళ్లించిన జీవితం. భూమిలేని నిరుపేదల, వ్యవసాయ కూలీల భూ పోరాటంలో, విముక్తి పోరాటంలో సంలీనమై అమరత్వాన్ని పొందిన జీవితం 1980లలో కళాశాలలో ఒక రాడికల్ విద్యార్థిగా ప్రారంభమై, గ్రామాలకు తరలివెళ్లి రైతు కూలీ సంఘాలు కట్టి, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటంలో అమరులైన వాళ్ల బాటలను స్మరించుకొని ఉద్యమ నిర్మాణం చేసిన విప్లవ రచయిత శేషప్రసాద్. ఎమర్జెన్సీ ప్రకటించి ఇరవై సూత్రాలు ప్రకటించిన ఇందిరాగాంధీ భూమి లేని వారికి భూమి, నీడ లేని వారికి ఇల్లు

ఇస్తానన్నది. దళిత, ఆదివాసీ ప్రజలు నమ్మారు. కాని ఆ భూమి నిజంగా దున్నేవారికే చెందటానికి ఎమర్జెన్సీ ఎత్తివేయగానే రాడికల్ విద్యార్థులు, యువజనులు గ్రామాలకు తరలి చేసిన పోరాటాల గురించి వివరించే కథే 'భూమి కోసం'. ఈ విద్యార్థి, యువకులు జగిత్యాల, ఇంద్రవెల్లి పోరాట చైతన్యాన్ని ప్రకాశం, గుంటూరు జిల్లాలకు తమ భుజాలమీద ఎర్రజెండాలవలె మోసుకొచ్చారు. 'ఊరు మనదిరా' అని ప్రకటించారు.




ఇంద్రవెల్లిలో ఆదివాసుల అమరత్వాన్ని గానం చేసారు. ఆ యువజన నాయకుడే ప్రసాద్‌గా పరిచయమైన శేషప్రసాద్. కలెక్టరాఫీసుల దగ్గర కాదు, స్వాధీనం చేసుకోవాల్సిన భూమి దగ్గర సభ పెట్టాడు. శ్రీకాకుళ పోరాటం వల్లనే 1972 లో భూ సంస్కరణల చట్టమైనా వచ్చిందని చెప్పాడు. ఆదివాసీలకు అడవిపై హక్కునిచ్చే 1/70 చట్టం వచ్చిందన్నాడు. నేల విడిచిన సాముతో కాదు, భూమి మీద నిలబడిచేసే పోరాటంతోనే భూమి దక్కుతుందన్నాడు. అప్పటికి ఆ సభను భగ్నంచేసి పోలీసులు వాళ్లను అరెస్టు చేయవచ్చు. కాని ఆ అగ్ని చల్లారలేదు. 'ఆ చల్లారని అగ్ని' కథ భూమి కోసం పోరాడుతున్న భూమి హీనులకు ప్రసాద్ 'రక్తం ఉడికిపోయేలా చెప్పాడు.

ఈ రక్తం చేసిన రాగాలాపనే 'భూమికోసం'. రచయిత మాటల్లోనే ''రంగు బంగారం, మనసు బంగారం, మాట బంగారం, పోరు బంగారం' గా ఈ కథలో కామ్రేడ్ శేషప్రసాద్ మెరిసాడు. కనుకనే ఈ కథలో ఇంత వెలుగు పరుచుకున్నది.



విప్లవోద్యమంలోను, సంగ్రామ్ రచనలోను పరిణతికి నిదర్శనమైన కథ 'రైతు ప్రస్థానం'. ముఖ్యంగా విప్లవోద్యమం కేవలం భూస్వాములకు, భూమి లేని నిరుపేదలకు (Haves and havenots) మధ్యలో పోరాటమే కాదు, ఇది నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని కార్మికవర్గ నాయకత్వంలో నిర్వహించే ఐక్య సంఘటన. అయితే దీని దిశ, లక్ష్యం మాత్రం రాజ్యాధికారం ద్వారా నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని నెలకొల్పడం కావాలి. ఈ కథ కారంచేడు కథ. కారంచేడు మన రాష్ట్రంలో పెట్టుబడి భూస్వామ్య సంబంధాల్లో ప్రవేశించి సామ్రాజ్యవాదంతో మిలాఖత్ అయిన తీరుకు మంచి దాఖలా.

ఇక్కడి కమ్మ భూస్వాములు వరి, పొగాకు పండించి సంపన్నులయి, అదనపు సంపదను అనుత్పాదక సినిమా పరిశ్రమ రంగంలో పెట్టి, సినిమా ద్వారా రాజకీయాల్లోకి వచ్చి అచ్చం కొత్త పెత్తందార్లవలె మారిన గ్రామం. బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం నుంచి చాలా దశలు దాటివచ్చి దళారీలుగా మారేనాటికి పూర్తిగా బ్రాహ్మణీయ సంస్కృతిని పుణికి పుచ్చుకున్న గ్రామం. ఈ గ్రామ పెత్తందారు, పొగాకు వ్యాపారి. రైతులవద్ద పొగాకు కొని డబ్బు ఇవ్వకపోతే రెండేళ్లు పోరాడి, ఓపికపట్టి రకరకాల పోరాటబాట ఎంచుకొని సంఘటితమై ప్రతిఘటించి అతని గిడ్డంగులనుండి పొగాకు లారీలు కదలకుండా అడ్డుకొని విజయం సాధించిన కథ. నిజంగా జరిగిన కథ. ఇది పొలిటికల్ కథకూడా. ఇందులో రివిజనిస్టులు మొదలు, విప్లవ దశలు మాట్లాడే విప్లవ పార్టీల వరకు మనకు దర్శనమిస్తారు. చిన్న పోరాటాన్నయినా, ఆర్థిక పోరాటాన్నయినా విప్లవావగాహనతో మిలిటెంటుగా నిర్వహించే వైఖరి సరియైన దిశలో నడపడం చూస్తాం. విద్యాలయాల్లో విద్యార్థి సంఘాలకు ఎన్నికలు జరపాలనే రాడికల్స్ డిమాండును కూడా సాయుధ పోరాటమంత తీవ్రంగా రాజ్యం పరిగణించడం ఆ పోరాటంలో ఇమిడిఉన్న వర్గ పోరాట దృక్పథాన్ని చూసి భయపడటమే. మరోవైపు పాలకపక్ష పార్టీలు బహిరంగంగా తుపాకులు పట్టుకొని తిరగడం, ఘర్షణ పడడం, నిరాహారదీక్షలు కూడా సాయుధంగా చేయడం చూసాం. చూస్తున్నాం. వీటికి రాజ్యం భయపడటం లేదు.



పొగాకు పండించే రైతులకు, పొగాకు వ్యాపారికి మధ్యన వచ్చిన ఘర్షణలో రైతుల న్యాయమైన డిమాండ్‌కు అండగా రాడికల్స్ నిలిచారు. మామూలుగా భూమిలేని నిరుపేదల పక్షం వస్తారనుకునే విప్లవకారులు ఐక్య సంఘటనలోనూ కార్మికవర్గం నాయకత్వం వహిస్తే రాజ్యం వణికిపోతుంది.★



# ఎందుకు రాయాలి అనే ప్రశ్నకు సరైన జవాబు ఈ నాలుగు కథలు

జి.కళ్యాణరావు

తన కథలకు ముందుమాట రాయమన్నాడు సంగ్రామ్. రాస్తా నన్నాను. కథలు ఎన్నో కాదు కేవలం నాలుగు.

నిజానికి, కథ ఎందుకు రాయాలి అనేదానికన్నా ఎలా రాయాలి అనే దానిమీదే బోలెడు చర్చ జరిగింది కథావిమర్శనా ప్రపంచంలో.

మన విమర్శకులు మంచి కథకు కొన్ని లక్షణాలు చెప్పారు. కథాకథన పద్ధతులు చెప్పారు. కథకు వుండాల్సిన అంగాలు విభజించి, వివరించారు. తెలుగు నేల పల్లె బతుకులో అందంగా, సహజంగా పుట్టిన తెలుగుకథకి తొడగాల్సిన తొడుగులన్నీ తొడిగి, వెయ్యాల్సిన సంకెళ్లన్నీ వేసీ ఇదిగో యిదీ కథని తేల్చిచెప్పారు. యిట్లా రాస్తేనే మంచి కథ అని కితాబులిచ్చారు.

అన్నిటికన్నా విచిత్రం తెలుగుకథకు వందేళ్లొచ్చాయని పుట్టిన సంవత్సరంతో సహా యిచ్చి వందేళ్ల తెలుగుకథ పండగకూడా జరుపు తున్నారు. ఈ తెలుగు నేలమీది పల్లె జీవితానికి వేల ఏళ్ల వయస్సున్నప్పుడు తెలుగు కథకు కేవలం వందేళ్ల ఎందుకు వుండి వుంటాయి అనేది యిప్పటికీ అర్థంకాని అంశం. ఇది పామరుడి ప్రశ్న అని కొట్టిపారెయ్యొచ్చు. కాని నాగరికత పామరుడి పాదాల తడిలో మొలిచింది. నాగరికతే కాదు, దాని తాలూకూ సాహిత్యం, సంస్కృతి, సమస్తమూ. సాహిత్యానికి 'ప్రతిభ'ని అంటకట్టడం జాన్సన్ దృష్టిలో గొప్ప మానవ తప్పిదం.

ఈ మాటలన్న సామూయేల్ జాన్సన్ ARTS POETICA లో కవుల జీవితాల్ని సంకలనంచేసిన వాడు మాత్రమే కాదు జీవితాన్ని ప్రేమించినవాడు, గౌరవించినవాడు.

మరో దుర్మార్గం ఏమిటంటే నవలని ఐరోపాకి, కథని పారిశ్రామిక నాగరికతకి ధారాదత్తం చేయడం. నవలని ఐరోపా నుండి అరువు

తెచ్చుకొన్నామని, కథ అనేది పారిశ్రామిక నాగరికత ప్రపంచానికిచ్చిన మహత్తర కానుక అని మాటాడే విమర్శకులున్నారు. "వలస పాలన పోయినా మనకి భావదాస్యం పోలేదు.' అని అన్న చలసాని ప్రసాద్ మాటలు ఈ సందర్భాల్లో నూటికి నూరుపాళ్లు నిజమనిపిస్తాయి. ఏ సాహిత్య రూపానికైనా మనం పాశ్చాత్య మూలాలే వెతుకుతాం. ఇది ఒక "అలవాటు బలిమి" అంటాడు చలసాని.



సంగ్రామ్ నాలుగు కథలమీద నాలుగు మాటలు రాయాల్సింది పోయి ఏదో రాస్తున్నావేంటని అనుకోవద్దు. అక్కడికే వస్తున్నా. ముందు అనుకున్న ఎందుకు రాయాలి? ఎలా రాయాలి? అనే ప్రశ్నల్లో ఎందుకు రాయాలి అనే దానికి సరైన జవాబు ఈ నాలుగు కథలు. ఎలా రాయాలి అనేది పక్కకు నెట్టే అంశం కాదు కాని అదే కథకి అర్థం, పరమార్థం కాదని నా నమ్మకం.

ఈ విషయంలో మీ నమ్మకానికి నేను దగ్గరగా వుండొచ్చు. దూరంగా వుండొచ్చు. అది వేరే సంగతి.

ఈ నాలుగు కథల్లో ఒకటి 'కరువుదాడి'. రెండోది 'భూమి కోసం'. మూడోది 'అభ్యుదయం'. నాలుగోది 'రైతు ప్రస్థానం'.



మొదటి కథ అనంతపురం జిల్లా కదిరి తాలూకాలో జరిగింది. ఆకలి చావులు తట్టుకోలేని బట్రేపల్లి యువకులు తిండి గింజల కోసం లారీలను ఆపే క్రమంలో ఓ జీపును అడ్డుకున్నారు. కదిరిలో లారీలకు లారీల తిండి గింజల్ని అక్రమంగా బ్లాక్ మార్కెట్టుకు తరలిస్తున్న రోజులు. అనంతపురం జిల్లా పేదలు ఆకలి చావులు చూస్తున్న రోజులు. ఈ దాడి తిండి కోసం. తిండి గింజలకోసం. జీపుల్లో కేవలం ముప్పయి రూపాయలు ఇవ్వలేదని వైద్యం చెయ్యడం నిరాకరించి ఓ పిల్లవాడి ప్రాణాన్ని బలిగొన్న డాక్టర్ వున్నాడు.

జీపు ఆపిన వాళ్లలో ఆ పిల్లవాడి తండ్రి వున్నాడు. ఆ తండ్రిని చూసి డాక్టర్ వణికిపోయాడు. ప్రాణం ఎంత విలువైందో, మానవత్వం డబ్బుకన్నా ఎంత గొప్పదో చదువురాని ఆ తండ్రి చదువుకొన్న డాక్టరుకు చెప్పాడు. అనంతపురం కరువు, తిండి గింజల కోసం అక్రమ రవాణా లారీలపై దాడి శ్రీకాకుళ పోరాటం రోజుల్లో జరిగిన సందర్భం. ఈ ఘటనకు ప్రత్యక్షసాక్షి ఈ కథా రచయితే. ఆ రోజు జీపులో డాక్టర్ ప్రక్కన వున్న వ్యక్తి రచయితే.



రెండోకథ 'భూమికోసం'. ఇంకొల్లు, చీరాల, పర్చూరు ప్రాంతాలలో జరిగిన కథ యిది. సబ్ జైలులో ఓ ఖైదీ చెప్పిన కథ యిది. జైలుకొచ్చి పది రోజులైంది. ఆరేళ్లుగా సాగుతున్న కథంతా ముందు నిల్చింది.

కథలో ప్రధాన పాత్ర భూమి. ఆ భూమి కోసమే ఈ జైలు. కథ దగ్గుబాడు ఆరోగ్య కేంద్రం దగ్గర మొదలైంది. పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేసుకుంటే తలా యాభై సెంట్లు చొప్పున ఎనభై మంది పేదలకు 40 ఎకరాల భూమి పంచి యిస్తామని ప్రకటిస్తారు ప్రభుత్వంవారు.

ఇందిరాగాంధీ పుట్టిన రోజు సందర్భంగా భూస్వామి గోపాలస్వామి తన 40 ఎకరాల భూమి ఇవ్వటానికి ముందుకు వచ్చాడు. ఆపరేషన్లు జరిగాయి. భూమి పంపిణీ జరిగింది. పేదలు భూమిని సాగుచేశారు. అసలు కథ యిక్కడే మొదలైంది. భూమి బాగా సాగయ్యాక ఆ భూమిని నాకు అమ్మాదంటూ వెంకట సుబ్బమ్మ అనే ఆమె రంగంలోకి వచ్చింది. పేదల పక్షాన దళిత సంఘ నాయకులు, గ్రామీణ పేదల సంఘ నాయకులు, యువజన సంఘ నాయకులు ముందుకొచ్చారు. పేదల సంఘనాయకుడు అందరికీ తెలిసిన విప్లవ కమ్యూనిస్టు కొల్లా వెంకయ్య. ఆఖరి రోజుల్లో గ్రామీణ పేదల సంఘనిర్మాణం చేశాడు. నిర్మాణంలో పీటర్, పంతులు, అంకమ్మ, వీరయ్య లాంటి దాదాపు వయస్సు పైబడ్డ కామ్రేడ్స్ ఉండేవారు. యింకొల్లు, పరుచూరు, చీరాల, నాగలుప్పలపాడు ఆ ప్రాంతాల్లో వీళ్ళ కార్యకలాపాలెక్కువగా ఉండేవి. యువజన సంఘ నాయకుడు ప్రసాద్ ప్రకాశం జిల్లా, గుంటూరు జిల్లాలకు బాగా పరిచయమైన కామ్రేడ్. ఈ కథలు రాసిన సంగ్రామ్‌కు, వీటికి ముందుమాట రాస్తున్న నాకు మాత్రమే కాదు, భూమి కోసం పోరాడే పేదలందరికీ ప్రియమైనవాడు. శ్రీధర్ అంటే తెలియని ప్రకాశంజిల్లా పేదవాడలు ఉండవు. రాష్ట్ర విప్లవోద్యమాల నాయకుడుగా ఎదిగి 2003లో బూటకపు ఎన్‌కౌంటర్‌లో అమరుడైన కా॥ శేష ప్రసాద్ అలియాస్ ఎర్ర ప్రసాద్ అలియాస్ శ్రీధర్ పీపుల్స్‌వార్ నాయకుడు, పేదల ముద్దుబిడ్డ. సంగ్రామ్ కథలో రాసినట్టు ప్రసాద్... ఎర్ర బంగారు ఛాయ... మొహంలో చెరగని చిరునవ్వు.... ఎప్పుడనుకున్నా అదే రూపు... అదే నవ్వు.

మూడో కథ 'అభ్యుదయం'. అభ్యుదయం నారాయణ రచయిత మిత్రుడు. అతని బాబాయి కూతురు "రమ్య". ఆమె నర్సు కోర్సు చేస్తోంది తిరుపతిలో. అక్కడే డా॥ ఆనందరావుతో ఆమెకు పరిచయమైంది. పరిచయం ప్రేమగా మారింది. రమ్య కమ్మ కులానికి చెందినది. ఆనందరావుది మాదిగ కులం. మిత్రుడు నారాయణ అభ్యుదయ భావాలు కలవాడు. ఆ యిద్దరి పెళ్లిబాధ్యతలు తీసుకొంటాడు.

తిరుపతిలో పెళ్లి. కాసేపట్లో పెళ్లి జరుగు తుందనగా "ఈ పెళ్లి వర్ణసంకర మైనా గొప్ప ఆదర్శ వివాహమని, తన చెల్లెలు యిటువంటి వివాహం చేసుకోవడం చాలా సంతోషంగా ఉంది" అని నారాయణ అనడం రచయితకు నచ్చదు.

రమ్య, ఆనందరావుల పెళ్లి జరిగింది. అసలు ట్విస్టు కథలో చివరి పేరాలోని రచయిత మాటల్లో ఉంది. "రమ్య తల్లిదండ్రులు కట్నకానుకలు యిచ్చుకోలేరు.

ఆ విషయం రమ్యకు తెలియందేం కాదు. అందుకే సంపాదన పరుడైన డాక్టరును చేసుకోవడానికి నిర్ణయించుకొందన్న విషయం అర్థమౌతూనే వుంది" అని అంటాడు. యిక్కడ రచయిత రమ్యలో ఆదర్శం కన్నా ఆమె అవకాశవాదం చూశాడు. అయితే రమ్య విషయంలో అది నిజం కావచ్చునేమోగాని – "ఈ దేశంలో అగ్రవర్ణాల స్త్రీలు కూడా అట్టడుగు వర్గాల వారిని యిలా కూడా దోపిడీ చెయ్యో విషయం ఈ పెళ్లి చూసిన తరువాత నాకు తెలిసింది" అని రచయిత జనరలైజ్ చేసి చెప్పడం నాకు నచ్చని అంశం. అది న్యాయంకూడా కాదు. అయితే ఒక విధంగా కొంత చర్చకు తలుపులు తెరచిన కథ అభ్యుదయం.

ఇక నాలుగోది 'రైతు ప్రస్థానం'. నారాయణ చౌదరి ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ తరుపున 1952లో ఎన్నికల్లో గెలిచాడు. ఆ తర్వాత పొగాకు వ్యాపారస్తు డయ్యాడు. రష్యా ఎగుమతుల్తో బాగా ఆర్జించాడు. అతని తర్వాత అతని కొడుకు చక్రపాణి పొగాకు వ్యాపారాన్ని పతాకస్థాయికి తెచ్చాడు. ఊరు కారంచేడు. రైతుల దగ్గర పొగాకు చెక్కులుకొని డబ్బులు ఎగ్గొట్టడం పొగాకు వ్యాపారుల అలవాటు. ఆ ఆలవాటులో చక్రపాణి అందెవేసిన చెయ్యి. అట్టా చక్రపాణి డబ్బులు ఎగ్గొట్టిన చాలామంది బాధితుల్లో దాచేపల్లి దగ్గర తంగెడ గ్రామస్తులున్నారు. ఆ సమస్యని సంఘటితంగా రైతులు ఎలా పరిష్కరించు కున్నారన్నది అసలు కథ. వాస్తవ కథకు 'రైతు ప్రస్థానం' చక్కటి ఉదాహరణ. పొగాకుపంట, ఆరుగాలం శ్రమించే రైతు, పొగాకు వ్యాపారి, దళారీల దోపిడి, రైతుల కష్టాలు, ప్రకాశం జిల్లా రైతుల గిట్టుబాటు ధరలకై పోరాటం, పోలీసు కాల్పులు, కాల్పుల్లో ఓ రైతు మరణం, అనేక మందికి గాయాలు.....

**"ఈ నేలపైన జరుగుతున్న వర్తమాన చరిత్ర రైతు ప్రస్థానం."**

సంగ్రామ్ అలా చెప్పాడు తన నాలుగు కథల్ని. కథ చెప్పటంలో ఎన్నో పద్ధతులు ఉండొచ్చు. పద్ధతికో శిల్పం ఉంటుంది. సంగ్రామ్ కథ చెప్పటంలో ఏ ఒక్కర్నీ అనుసరించలేదు. తన పద్ధతిలో తాను చెప్పుకుపోయాడు. సూటిగా సరళంగా తెలిసిన సంగతి చెబుతున్నట్టు. నిజానికి అలా చెప్పటమే కథకి ఉండాల్సిన మంచి లక్షణం. ★

# 1. కరువు దాడి

డాక్టరు ముకుందరావు గారు రోగులను చూస్తూ లోపలి గదిలో కూర్చుని ఉన్నారు. పది సంవత్సరాల పిల్లవాడ్ని భుజంపై పరుండ బెట్టుకొని ఓ ఆరడుగుల మనిషి లోనికి ప్రవేశించాడు. గడ్డం పెరిగి మాసి ఉంది. గుడ్డలు మాసి అక్కడక్కడా చినిగిపోయి బీదరికాన్ని స్వచ్ఛంగా తెలియపరుస్తున్నాయి. పిల్లవాడు నీరసించి జ్వరపు బాధతో మూల్గుతున్నాడు. భుజంపైనున్న పిల్లవాణ్ణి క్రిందికి దింపి "నమస్కారం, డాక్టరు గారూ! దయుంచాలి. పిల్లవాడు వారం రోజుల నుంచి జ్వరంతో బాధపడుతున్నాడు బాబూ! ఎలాగయినా వీడికి బాగుచేసి పుణ్యం కట్టుకోండి బాబూ!" అని లోతుకు పీక్కుపోయిన కళ్లతో జాలిగా అర్థించాడు. ఊ అని ఒక మూలుగు మూలిగి, పిల్లవాణ్ణి దగ్గరకు తీసుకరమ్మని సైగ చేశాడు డాక్టరుగారు. పిల్లవాణ్ణి కొంచెం సేపు పరీక్షించి ముప్పై రూపాయలు ఫీజు ఇచ్చుకుంటే బాగుచేస్తానన్నాడు డాక్టరు ముకుందరావు. రూపాయలనేటప్పటికి గతుక్కుమన్నాడు ఆరడుగుల మనిషి కూడా! రూపాయి ముఖం చూసి ఎన్ని రోజులయిందో. పైసా డబ్బు సంపాదించే మార్గం లేదు. పనులు లేవు. వర్షాలు లేక పైర్లన్నీ ఎండి పోయినవి. ముప్పై రూపాయలు ఎక్కడ నుంచి తీసుకురాగలడు. ముప్పై పైసలు కూడా చేతిలో లేక పిల్లవాణ్ణి భుజం మీద వేసుకొని అయిదు మైళ్లు నడచి వచ్చాడు, బస్సు తిరిగే మార్గమే అయినా. ఈ బీదల పాట్లన్నీ ఉద్యోగులకేమి తెలుస్తవి. నెలనెలా జీతాలు గవర్నమెంటు వారు ఇస్తారు. హాయిగా బతుకుతారు. అంతా అలాగే బతుకు తున్నారనుకుంటారు. పసికర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగానే ఉంటుంది మరి. "ముప్పై రూపాయలెక్కడ తీసుకరాను బాబు! కరువొచ్చి చేతిలో పైసాలేక భార్యబిడ్డలతో పస్తులుంటున్నాము దొరగారు!

తాగటానికి ముంతెడు గంజి కూడా దొరకటం లేదు. దయుంచాలి" అని దీనంగా ప్రాధేయ పడి కాళ్లు పట్టుకున్నాడు ఆ ఆరడుగుల మనిషి. కించిత్తు కూడా ఆలోచన చేయకుండా. డబ్బు ఇవ్వలేకపోతే వల్ల కాదన్నాడు డాక్టరు ముకుందరావు. అర్ధగంటసేపు బ్రతిమిలాడినా ఆ రాతిగుండె కరగలేదు. చేసేదిలేక కుర్రవాణ్ణి భుజంపై వేసుకొని తిరిగి ఇంటికి తీసుకవెళ్లాడు. మూడు దినాలుండి కన్ను మూశాడు పిల్లవాడు. ముప్పై రూపాయలు చేతిలో లేక తన కొడుకు ప్రాణాలు పోయాయే అనుకున్నాడు రామయ్య.



డాక్టరు ముకుందరావు గారంటే ఆ ప్రాంతాలలో తెలియని వారు చాలా తక్కువ. ఆ ఊరి హెల్త్ సెంటర్లో పనిచేసే డాక్టరు కావటం మూలంగాన అయితేనేమి, ధనిక, పేద అనే తారతమ్యం లేకుండా రోగుల దగ్గర జలగలా డబ్బులు గుంజుకొని నీళ్ల ఇంజక్షన్లు ఉపయోగించటంలో మేటి అయిన డాక్టరని అయితేనేమి, భార్య మాట జవదాటని పురుషోత్తములలో అగ్ర గణ్యుడని గొప్ప పేరు తెచ్చుకోవడం వల్ల అయితేనేమి, గవర్నమెంటువారు ఇచ్చిన జీపుపై ఆ చివర ఇంటి నుంచి ఈ చివర ఆస్పత్రి వరకు ఊళ్ళో తిరిగేటప్పుడు చూస్తేనేమి – దాదాపు ఆ గ్రామ ప్రజలందరికి తెలుసు.

స్వగ్రామంలో బాబాయిగారి కుటుంబము, తల్లి గారు ఉన్నారని, వాళ్లు కూలి నాలి చేసుకొని బ్రతుకుతారని, తల్లిని తెచ్చి తన వద్ద ఉంచుకొనటానికి భార్యతో వేగలేక నానా కష్టాలపాలు చేస్తున్నాడని, తన బిడ్డల భవిష్యత్తు కూడా ఆలోచించకుండా పగలనక, రేయనక కష్టపడి తన రక్తాన్నంతా డబ్బుగా మార్చి డాక్టరీ చదివించిన బాబాయిగారి బిడ్డల్ని చదివించితే డబ్బు ఖర్చువుతుందని ఊరుకున్నాడని, అక్రమంగా సంపాదించిన డబ్బునంతా (పాలపొడి, మందులు, వగైరా అమ్మగా వచ్చిన డబ్బు, రోగుల వద్ద పీడించి సంపాదించిన డబ్బు) బ్యాంకులో దాచి కదిరిలో డాబాలు, భూములు కొన్నాడని, ఆ గ్రామం, చుట్టుపక్కల పది పదిహేను గ్రామాల ప్రజలకు తెలుసు. అందుకే డాక్టరు గారంటే ఆ గ్రామంలో కించిత్తు గౌరవమూ లేదు. వీసమెత్తు విలువా లేదు. డాక్టరు గారికి కావలసింది డబ్బు, డబ్బు సంపాదనే ఆతని ధ్యేయం. రెండు చేతులా సంపాదించ గలుగుతున్నాడు. ఇంక అతనికి కావలసిన దేముంది. పైగా అతనికి బిడ్డలు లేరు. ఆ దిగులు లేదు.

ఆ రోజు రాత్రి 9 గంటలయింది కదిరిలో డాక్టరు గారి జీపు బయలు దేరేటప్పటికి. అమావాస్య చీకటి కాలం. కదిరి నుంచి 'తలుపుల' పోవలసిన చివరి బస్సు కూడా వెళ్ళిపోయింది. ఆ ప్రక్క 'పులివెందుల' నుంచి రావలసిన బస్సులు కూడా వచ్చేశాయి. ఈ రోజు కేంపులోనే చాలా ఆలస్యమయి పోయింది. మామూలుగా 8 గంటలకే ఇంటికి చేరుతూవుండేవారు. డ్రైవరు, సేవకుడు, డాక్టరు గారు కాసిని టీ నీళ్లు సేవించి "తలుపుల'కు బయలు దేరారు. రోడ్డంతా ఎత్తు పల్లాలతో అంత సక్రమంగా లేదు. పైగా అడవి మార్గం. జీపు 'బట్రేపల్లి' సమీపించ బోతున్నది. ఒక మలుపులో హఠాత్తుగా 'జీపు' ను ఆపుచేశాడు డ్రైవరు. గతుక్కుమని అంతా ముందుకు చూశారు.

అందరికి గుండె ఆగినంత పని అయింది. ముగ్గురిలో ఒక్కరి నోటంటా మాటరాలేదు ఆ దృశ్యాన్ని చూచి.

అనంతపురం జిల్లా కదిరి తాలుకా చాలా బీద ప్రాంతం. వర్షాలు సరిగ్గా పడవు. పంటలు పండవు. ఈ సంవత్సరం వర్షాలు లేవు. పైరులన్నీ ఎండిపోయినవి. ప్రజలు తినటానికి తిండి గింజలు లేక అల్లాడి పోతున్నారు. మమూలు ప్రజల వద్ద కొందామంటే చేతిలో పైసా లేదు. అప్పు తెచ్చుకొందామన్నా అప్పు ఇచ్చే నాథుడే లేదు. ఇచ్చినా బాగా ఆస్తి ఉన్న రైతులకు, ఏ షావుకారో ఎక్కువ వడ్డీలకు ఇచ్చేవారు. సక్రమంగా రెండు పూటలా తింటున్నవారు నూటికి పదిమంది కూడా లేరు.



మిగతా వాళ్లంతా ఏదో ఒక పూట తిని తినక అల్లాడి పోతున్నారు. రాగులు, జొన్నలు కూడా అయిపోయినవి. గంజినీళ్లు కూడా కరువయిపోయినవి. ఆకలి రక్కసి బాధకి ఓర్వజాలక ఆకులు అలములు తింటున్నారు. పసిపిల్లలు తెల్ల మెతుకులకు నకనకలాడుతున్నారు. హాయిగా తిని కష్టమంటే ఏమిటో ఎరగకుండా పెరగాల్సిన పిల్లలు తిండి లేక ఆకలితో అలమటిస్తున్నారు. కష్టించి పనిచేసి పరువంతో పరవళ్లు తొక్కాల్సిన యువకులు నీరసంగా కాలుగాలిన పిల్లిలా తిరగాల్సి వచ్చింది.

రామా, కృష్ణా అనుకొనే ముసలివారు ఆకలికి ముడుక్కొని అలాగే పండుకుంటున్నారు. తాలూకాకి తాలూకా అంతా యిదే పరిస్థితి. ఎక్కడ చూచినా ఆకలి చావులు. ఆకులు అలములు తిని తెలియని రోగాల్తో ఈపాటికి ముగ్గురు చనిపోయారు 'బత్రేపల్లి' గ్రామంలో. ఒక జిల్లా నుంచి ఇంకొక జిల్లాకు, ఒక తాలుకా నుంచి ఇంకొక తాలుకాకు, ఒక గ్రామం నుంచి ఇంకొక గ్రామానికి తిండి గింజలు ఎగుమతి కాగూడదని గవర్నమెంటువారి శాసనం. అయినా రోజూ కదిరిలో లారీలు లారీలు తిండి గింజల వచ్చి షావుకార్ల చీకటి కొట్లలో దాక్కుంటున్నాయి. మరల ఎగుమతి అవుతునే ఉన్నాయి. వాటిని నిరోధించే నాథుడే లేడు. 'బత్రేపల్లి' యువతరాన్నంతా ఆకలి చావులు కదిలించివేశాయి. అంతా ఒకచోట సమావేశమయ్యారు. “రాత్రి పూట దారికాసి తిండి గింజల లారీలు పట్టుకొని ప్రాణాలు రక్షించుకొందాం. లేకపోతే మనము, మన భార్యాబిడ్డలూ ఇలా ఆకలి చావులు చావవలసిందే” అని నిశ్చయించుకొన్నారు. అంతా సరేనంటే సరేనన్నారు ముక్తకంఠంతో. రాత్రి 8 గంటలకు రోడ్డు కాపలా మొదలు పెట్టారు. అంతా ఈటెలు, కట్టెలు వంటి ఆయుధాలతో తయారయ్యారు. రోడ్డుకు అడ్డంగా పెద్ద పెద్ద గుండ్లు దొర్లించారు.

డాక్టరు ముకుందరావు గారి కారు వస్తోంది. అంతా లారీ ఏమో అనుకున్నారు. ఆయుధాలతో రెడీగా ఉన్నారు. జీపు వచ్చి ఆగింది, అందరి ఆశ నిరాశ



అయింది. అది తిండి గింజల లారీ కాదు, 'తలుపుల' ఆస్పత్రి జీపు. జీపులో ఉన్న వాళ్లకి నోట మాట రాలేదు. కాస్త పొగరుమోతు కుర్రకారు జీపు దగ్గరకువెళ్ళి గలాటా చేశారు. జీపులో డాక్టరు ముకుందరావు గారికి వణుకు పుట్టుక వచ్చింది. చేతి సంచిలో అయిదారు వందల రూపాయలు డబ్బు ఉంది. డబ్బు పోతే పోయింది ప్రాణాలు తీస్తారేమోనని భయం. ఒక్కసారి బావురుమని ఏడ్చాడు. డబ్బు సంచి వాళ్లకు ఇచ్చి రెండు చేతులెత్తి నమస్కరించాడు. నన్ను రక్షించమన్నాడు. నా భార్యకు నేనొక్కడినే అన్నాడు. నాకు బిడ్డలు లేరు. నా భార్య దిక్కులేనిదవుతుందని కన్నీళ్లు కార్చాడు. డబ్బు తీసుకుపోయి రామయ్య అనే వ్యక్తి చేతికి ఇచ్చారు. రామయ్య వీళ్లందరికి నాయకుడు కాదుకాని అతని న్యాయవర్తనాన్ని బట్టి సంచి అతనికి అంద చేశారు. రామయ్య చూచాడు దగ్గరకు వచ్చి. డాక్టరు ముకుందరావు గారు ప్రాణభీతితో వణికి పోతున్నారు. "భయపడకండి డాక్టరు గారూ, మీ ప్రాణాలకు వచ్చిన ప్రమాదమేమి లేద"ని డబ్బు సంచి తిరిగి డాక్టరు గారి చేతిలో పెట్టారు.

‘‘మేము తిండి గింజలకోసం ఇలా కూడాం. కాని మీ బోటి పెద్దల ప్రాణాలు తియ్యటానికి కాదు, పైగా డబ్బు తీసుకొని ప్రాణభిక్ష పెట్టే ప్రభుత్వ డాక్టరువు. నీ ప్రాణాలా మేము తీసేది. నీవు అన్యాయంగా పేదల కష్టాన్ని దోచి సంపాదించిన డబ్బా మేము ఆశించేది. వద్దు డాక్టరు గారూ! వద్దు. ఈ పాపిష్టి డబ్బు మాకు వద్దు. ఈ డబ్బు నీవే కట్ట కట్టుకొని పో! పైసా చేతిలో లేక కరువొచ్చి అల్లాడిపోతూ, జబ్బు చేస్తే నా బిడ్డను మీ వద్దకు తీసుకొని వచ్చాను. ప్రాణదానం చేసే డాక్టరువని మీ పాదాలు పట్టుకొని బ్రతిమిలాడాను.

ముప్పై రూపాయలు ఇస్తే వైద్యం చేస్తానన్నావు. ఎంత బ్రతిమిలాడినా నీ రాతి గుండె కరగలేదు. ముప్పయి రూపాయలు లేక నా బిడ్డ నిండు ప్రాణాలు పోయాయి. మీ ప్రాణాలంటివే నా బిడ్డ ప్రాణాలు కూడా. నిన్ను చంపాలంటే నిముషం పట్టదు. కాని మేము మీలాగే ప్రాణాలతో చెలగాటమాడే రాక్షసులం కాదు. నీవు చదువుకున్నావు, కాని పశు వులా ప్రవర్తిస్తున్నావు. మేం చదువుకోలేదు మీలాగా. అయినా మాకూ హృదయం ఉంది. ప్రాణాలు తీసి హింసించటం కాదు మా పని. వెళ్లండి, డాక్టరు గారూ! వెళ్లండి.''

రామయ్య మాటలకు పక్కనున్న బృందం రోడ్డుకు అడ్డం వేసిన గుండు రాళ్లు తొలగించారు. ఫర్లాంగు దూరం వచ్చి, హమ్మయ్య! అని ఊపిరి గట్టిగా పీల్చుకున్నారు డాక్టరు ముకుందరావు గారు. మరునాటి దినపత్రికలో "కదిరి తాలూకాలో విప్లవ కమ్యూనిస్టుల నాయకత్వంలో ప్రజల కరువుదాడి ఓ బియ్యం లారీ స్వాధీనం" అనే వార్త. అంతే అది మొదలు డాక్టరు గారు ఒళ్లు దగ్గర పెట్టుకొని వైద్యం చేస్తున్నాడని ఆ ఊరిలో వాళ్లంతా అనుకుంటున్నారు.

---

కథా కాలం & రచనా కాలం : 1968

*కా॥ యస్.ఎ.రవూఫ్ కదిరి ప్రాంతంలో ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు. కదిరి బట్రేపల్లి గ్రామాలమధ్య వున్న కుటాగుళ్ళ ఆయన స్వగ్రామం. నక్సల్బరీ – శ్రీకాకుళ విప్లవోద్యమ చరిత్రను చదివిన తరువాత ఈ సంఘటనకు శ్రీకాకుళ ఉద్యమ ప్రేరణ అయి ఉండవచ్చునని అనిపిస్తుంది.*

# 2. భూమి కోసం

జైలు గదంతా చీకటిగా వుంది. నలుగురితోపాటు కాస్త కూడు తిని పండుకున్నానన్న మాటే గాని కునుకు రావటంలా! అప్పుడే పది రోజులు గడచిపోయాయి సబ్‌జైలుకొచ్చి. ఈ పది రోజులకే సగం అయిపొయ్యా. సంవత్సరాల తరబడి వుండే వాళ్లు ఎలా వుంటారో ఈ జైళ్లలో.

ఆరేళ్లు వెనక్కి పరుగెత్తాయి ఆలోచనలు. ఆరేళ్ల క్రితం ఇందిరాగాంధి పుట్టినరోజునాడు మా వూళ్లో జరిగిన సంబరం నాకింకా కళ్లకు కట్టినట్లే వుంది. ఓ రోజు ఉదయం దగ్గుబాడు ఆరోగ్య కేంద్రం నుండి డాక్టర్లు, నర్సులు ఓ జీబులో వచ్చారు మా పల్లెలోకి. బిలబిలమంటూ పిల్లా జెల్లా జీబు చుట్టూ చేరారు. డాక్టరు గారు, నర్సులు జీబు దిగారు. ఓ లిస్టు తీసుకొని పేర్లు చదువుతూ ఇల్లిల్లూ తిరిగారు. కుటుంబ నియంత్రణ డాక్టరట ఆయన. మా ఇంటికీ వచ్చారు, పిల్లలెంతమందని అడిగారు. నలుగురని చెప్పా. “వెంకన్నా! నువ్వు కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకోవాలయ్యా. ఇలా ఎక్కువ మంది పిల్లలని కంటూ పోతే రేపు వీళ్లందరికి కూడూ– గూడూ, చదువు సంధ్యలు సమకూర్చడం కష్టం” అన్నారు. నీవు ఆపరేషన్ చేయించుకుంటే ప్రభుత్వం సహాయం చేస్తుంది. ఆపరేషన్ చేయించుకున్న వాళ్లకు ప్రభుత్వం భూములిస్తుంది, మనిషికి 50 సెంట్లు భూమి. మీ గ్రామంలో సీలింగ్ భూమి క్రింద మిగులుగా వున్న 40 ఎకరాలు 80 మందికి పంచుతారు. తరువాత నీ ఇష్టం, పదివేలు చేస్తుంది ఈ భూమి. మీ ఆవిడతో మాట్లాడి పంచాయతీ ఆఫీసుకురా. అక్కడ ఓ ఆపరేషన్ చేస్తాం. వెంటనే పట్టాలిస్తాం” అన్నారు. డాక్టరు బాబు వెళ్ళగానే మా సుబ్బినడిగా. “ఏమేవ్, ఎన్నాళ్ళు కూలీ నాలీ చేసుకున్నా పిల్లలకింత కూడు వేళకు లేకపోయె.7

నీవా రోగాలతో ముడుక్కుంటున్నావు. పనీపాట నీకు భారమైపోయింది. ఏదో సొంతం అంటూ చారెడు నేల వుంటే కాస్త తిండిగింజలన్నా వస్తాయి. పై ఖర్చుల కెలాగో కూలీ నాలీ చేసుకొని బ్రతకొచ్చు. పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకోనా" అన్నా. మా ఇంటిది కాసేపు నసిగింది. చివరకు 'ఎవరైనా చేయించు కుంటున్నారేమో కనుక్కో అంది. నలుగురితోపాటు మనం'. సరే, అని బయలుదేరి పంచాయితీ ఆఫీసు వద్దకు చేరా. పంచాయతీ ఆఫీసు దగ్గర అప్పటికే మా పల్లె జనం చాలా మంది చేరారు. ఆపరేషన్ చేయించుకున్న వాళ్ళకు మనూరు గోపాళస్వామి గారి భూమి ఒక్కొక్కరికి 50 సెంట్లు చొప్పున 40 ఎకరాల సీలింగు భూమిని 80 మందికి పంచుతారని మా గ్రామ ప్రెసిడెంటు చెప్తున్నాడు. 80 మంది జమయితే పేర్లు రాసుకొని వరుసగా అందరికి ఆపరేషన్లు చేసి పట్టాలిస్తారని చెప్పాడు. ఓ నర్సమ్మ కూర్చుని వరసగా పేర్లన్నీ వ్రాసుకొంది. 'రెండు రోజుల్లో అందరికి ఆపరేషను చేశారు. ఆపరేషన్ అయిపోయిన వారానికే ఇందిరమ్మ పుట్టిన రోజు పండుగని చెప్పారు. ఆ రోజు మా గ్రామ ప్రెసిడెంటు, కరణం, మునసబు, పంతులు, గ్రామ పెద్దలు, డాక్టర్లు, నర్సులు, ఆపరేషన్ చేయించుకున్న మేమంతా ఇందిరమ్మ ఫొటో పెట్టి గ్రామమంతా వూరేగినాం. చివరకు పంచాయతీ ఆఫీసు వద్ద ఓ మీటింగు జరిగింది. ఆ మీటింగులో మా అందరికి పట్టాలంటూ కాగితాలిచ్చారు. చెప్పొద్దూ, మా ఎం.ఎల్.ఎ. గారు కూడా వచ్చారు. అప్పుడెప్పుడో నాలుగేళ్ల క్రింద ఓట్లప్పుడు వచ్చె. మళ్ళీ ఇప్పుడు పట్టాలు ఇవ్వటానికని వచ్చారని మా వాళ్లు చెప్పుకుంటుంటె విన్నాను. మా వూరి ప్రెసిడెంటు, మునసబు, ఎం.ఎల్.ఎ., డాక్టరు గారు, పంతులు గారు, ఇంకా గ్రామ పెద్దలు అనేకమంది ఆ మీటింగులో మాట్లాడారు. అందరూ ఇందిరమ్మను తెగపొగిడారనుకో.

ఇందిరమ్మకు పేదలంటే చాలా ఇదట. అందుకనే పేదరికాన్ని తొలగించి సోషలిజం తెస్తది ఇందిరమ్మ అన్నారు. ఇందిరమ్మకు అందరూ సమానమేనట. ఇందిరమ్మ అందరికి భూములు, ఇళ్లూ ఇచ్చి పేదరికాన్ని తొలగిస్తదట. మొదటిమెట్టుగా ఇప్పుడు భూములు ఇస్తున్నామన్నారు. ఇందిరమ్మ కొడుకు సంజయ్ గాంధీ అంట, ఆయన కనుక్కున్నాడంట ఈ కిటుకు. కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించు కుంటే భూమని. చివరిలో అందరూ మా గ్రామ భూస్వామి గోపాళస్వామిని కూడా పొగిడారు. గోపాళస్వామిగారు కూడా పేదల పట్ల జాలితో ధర్మంగా తన మిగులుభూమిని పంచుతున్నారని చెప్పారు. మాకేమో భూముల రంధాయె. చివరిలో అందరిని పేరు పేరునా పిలిచి ఆపరేషన్ చేయించుకున్న 80 మందికి పట్టాలిచ్చారు. కొన్ని పట్టాలు ఎం.ఎల్.ఎ. గారు, కొన్ని డాక్టరు గారు, కొన్ని ప్రెసిడెంటు గారు, కొన్ని మునసబు గారు, కొన్ని కరణం గారు, ఇలా అందరిచేతా మాకు పట్టాలిప్పిచ్చారు. మరునాడు భూమికి గట్లువేసి చూపుతాం రమ్మన్నారు. అందరం ఇందిరమ్మకు 'జై' కొట్టుకుంటూ ఇళ్లకు చేరాం.

మరుసటినాడు అందరం పొలంవద్దకు చేరాం. ప్రెసిడెంటు, మునసబు, కరణం, గ్రామ పెద్దలు అందరూ వచ్చి భూమి కొలతలు వేసి, రాళ్లు పాతి ఎవరి భూమిని వాళ్ళకు అప్పజెప్పారు. అందరం సంబరంగా ఇంటికి వచ్చాం. పల్లెపల్లెంతా ఆ రోజు పండుగే. మంచి గొడ్డును గోసి భాగాలేసుకొని వండుకొని తిన్నాం. కల్లు తాగాం. గోపాళస్వామి గారి గుణాల్ని, వారి బాబుని, తాతని అందర్నీ తలుచుకున్నాం. అందరి మంచిని కథలు కథలుగా చెప్పారు తెలిసిన మా పల్లె ముసలోళ్లు.

ఏరువాక వచ్చింది. పల్లెపల్లెంతా నాలుగురోజులు భూమిలోనే దిగబడ్డాం. కంపాకర్రా గొట్టి బాగుచేశాం. రెడ్డిగారి ట్రాక్టరు తెచ్చి దున్నించాం. కాలువ పూడికలు తీసి నీరు పొలంలోకి వచ్చేటట్లు చేశాం. నాలుగు రోజులు పొలమంతా దమ్ముచేశాం. వరినారు తెచ్చి అందరం కలిసే నాట్లు వేశాం. మా గుండెల నిండా సంతోషం. చెప్పలేని గుబులు. పైరు పెరుగుతూవుంది. బిడ్డని సాకినట్లు సాకాం పైరును. ఎప్పటికప్పుడు కలుపులు తీస్తూ కంటికి రెప్పలా పైరును కాపాడుకున్నాం. సీలింగ్ కింద పోయి కొన్నాళ్లుగా సాగులేక ఈ సంవత్సరమే సాగయిన భూమికదా! మొదటేడుగదా! ఎక్కువ పంట కాలా! తలా అయిదారు బస్తాలు అయ్యాయి. విత్తులకు నాటుకు, అరకలకు, కలుపులకు, తాసీలుకు సరిపోయె. చాకిరి దండగే. అయితేనేం భూమి మనదేగదా! నేలతల్లి ఈ ఏడు గాకపోతే వచ్చే ఏడు కరుణించదా. బంగారం పండదా అనుకున్నాం. రెండో సంవత్సరం సాగుచేశాం. పంట బాగా ఏపుగా పెరిగి గింజమీద వున్నప్పుడు రెండు మూడు రోజులు గాలివాన బట్టి వరదలొచ్చాయి. అదేదో ఉప్పెనంట. ఆ ఉప్పెనొచ్చిందంట. దివంట. అక్కడ ఉప్పెనొచ్చి తాటి ప్రమాణంలో నీళ్లొచ్చి వూళ్లకు వూళ్లు కొట్టుకపోయాయంట. జనం మస్తుగా చచ్చిపోయారట. చీరాల, పర్చూరు, ఇంకొల్లు– ఆ చుట్టు గ్రామాల్లో భూములన్నీ మునిగిపోయాయంట. గుడిసెలన్నీ వర్షానికి పడిపోయాయంట. మావూర్లో గూడా చాలా ఇళ్లు కూలిపోయాయి. మట్టి గోడలు గదూ, వర్షానికి నాని మా పల్లెలో కూడా చాలా ఇళ్ళు కూలిపోయాయి. నలుగురితోపాటు నారాయణ... చేసేదేముంది. పడిపోయిన ఇళ్లకు డబ్బు లిస్తుంది ఇందిరమ్మనిరి. కరణం వచ్చి ఇల్లిల్లు తిరిగి లెక్క రాసుకొనే. అందరిళ్లు పల్లెలో పడిపోయాయనే రాశాడు. గోడలు పడనోళ్లయి కూడా కాస్త గోడలు పడేయించి పేర్లు రాసుకున్నారు.

అందరికి డబ్బులు పంచటానికి ఆర్.డి.ఓ., తాసీల్దారులు వచ్చారొకరోజు. ఒక్కొక్కళ్లని పిలచి 100 రూ. లు కొంతమందికి, 150 రూ.లు కొంతమందికి ఇచ్చారు. అందరిచేతా వేలి ముద్రలు గుద్దుకొనిరి. ఇందులో కూడా భాగాలంట. తాసీల్దారుకు 25 రూ.లు, ఆర్. డి. ఓ.కు 15 రూ. లు, కరణానికి 10 రూ. లు చొప్పున మొత్తం ఇంటికి 50 రూ. బిగబట్టుకొని మిగిలిన డబ్బు పంచారుట. అట్లా చేస్తేనేనట ఇల్లుపడిపోయినట్లు రాసేది. లేకపోతే నిజంగా పడిపోయినా రాయరంట. సరేనని అందరం రాయించుకొని డబ్బు తీసుకున్నాం. పొలాలు ఎటూ మునిగిపోయాయి. పంటంతా నీటిపాలయింది. ఈ వందన్నా వుంటే ఓ నెలన్నా ఎలాగో గడచిపోతుంది అనుకున్నాం. ఇంకా రెండేళ్లు ఇలా గడిచిపోయాయి. పంట చేతికందినట్లే అంది నోటిదాకా రాకుండా పోతోంది. అయితేనేం భూములు మనయ్యే గదా! భూమమ్మతల్లి కరుణించదా అనుకున్నాం. ఈ మధ్యలో చాలా విషయాలు జరిగాయి దేశంలో. అవన్నీ మాకు తెలిస్తే గదా! ఈమధ్య జరిగిన ఎన్నికల్లో ఇందిరమ్మ ఓడిపోయిందంట. అదేందో ఎమర్జెన్సీ పెట్టిందంట. అందుకని ఓడిపోయిం దన్నారు మా కాపులంతా. అయినా ఆంధ్రలో గెలిచిందంట. మా మాల మాదిగలకు భూములిచ్చిందంట. అందుకని ఇక్కడ గెలిచిందంట. దేశాన్ని కొన్నాళ్లు దేశాయ్ అట ఆయన ఏలాడట కొన్నాళ్లు. ఆయన గాంధీగారి లాంటోడన్నారు. ఆయన కూడా కొన్నాళ్లకు దిగిపోయాడంట. ఆరోగ్యంగా వుంటుందని ఆయనుచ్చ ఆయనే తాగేవాడట. అందుకని దిగిపోయాడన్నారు మా వాళ్లు. కొన్నాళ్లు చౌదరి చరణసింగంట, ఆయనంట ఏలింది. మళ్లీ ఎలక్షన్లలో ఇందిరమ్మ వచ్చిందన్నారు. ఈ దఫా అందరికి ఇళ్ల స్థలాలు ఇస్తారన్నారు. అమ్మమ్మో ఇందిరమ్మో అనుకున్నాం. ఇవ్వన్నీ మా వాళ్లు అనుకుంటుంటే విన్నా.

ఇలా నాలుగేళ్ళు గడిచాయి. పంటలు పండుతున్నాయి. ఖర్చులు తేలుతున్నాయి. అయిదవ సంవత్సరం ముచ్చటగా పొలం సాగుచేశాం. నాట్లేశాం. పైరు పెరుగుతోంది. మా ఆశలూ పెరుగుతున్నాయి. ఈ ఏడన్నా దేముడు దయతలచడా! పంట బాగా చేతికి రాదా! అని ఆశతో ఎదురుచూస్తున్నాం. అంతలో ఓ రోజు మా పల్లెలో టముకు వేయించారు. మా నెత్తిన పిడుగు పడ్డట్లయింది. మాకు సీలింగులో పంచిన భూమంతా వెంకటసుబ్బమ్మ గారిదట. ఆమె ఎప్పుడో అయిదారేళ్ళ క్రితమే గోపాళస్వామి దగ్గర భూమి కొని అగ్రిమెంటు రాయించుకున్నదట. అందుకని ఆ భూమిలో ఎవ్వరూ ప్రవేశించరాదని టముకు వేశారు. అందరం కాలుగాలిన పిల్లుల్లా అటుయిటు తిరిగాం. అందరం కూడి కరణంగార్ని కలసి వివరం అడిగాం. నిజమే వెంకటసుబ్బమ్మ గారిదని కోర్టు తీర్పు యిచ్చిందని చెప్పాడు కరణం. ఆమెకు పొలం అమ్మినట్లుగా గోపాళస్వామి గారు ఎప్పుడో కాగితం వ్రాసియిచ్చారట. ఆమె వెళ్ళిందట కోర్టుకు. ఆధారంగా, ఆ భూమి 40 ఎకరాలు ఆమెకే చెందుతుందని కోర్టు తీర్పంట. ఆడమనిషికి మా వూరి గోపాళస్వామికి లంకె వుందంట. అందుకని పాత తారీఖుతో అమ్మినట్లుగా కాగితాలు వ్రాసి కోర్టుకెళ్ళారట. చెవులు తప్ప కళ్లు లేని కోర్టు తీర్పంట ఇది. మా పిల్లలు చెప్పబట్టె. మా అందరికి కడుపులో దేవినట్లయె. అయిదేళ్లు సాగుచేస్తిమి. పొలమంతా బాగుచేస్తిమి. శ్రమంతా భూమిలో పోస్తిమి. ఆ భూమి నుండి గుప్పెడు మెతుకులు తిన్నది లేదాయె. ఏటేటా ఏదో మిత్తవ వచ్చిపడుతుండే. ఏమి చెయ్యాలంటే ఏమి చెయ్యాలనుకొని మల్లగుల్లాలు పడుతుంటిమి. మా హరిజన నాయకుడుండే ఏసుపాదం అని కోర్టుకెల్దామనె. అందరం సరేనంటిమి. కాయితాలు తయారు చేసి అందరిచేత సంతకాలో, వేలు ముద్రలో వేయించుకొనె.

ఏది ఏమైనా ఈ భూములు మనకే చెందుతాయనె. అయిదేళ్లు సాగుచేసినాక ఇప్పుడు భూములు మనవి కాదంటే చెల్లదనె. అందరం కోర్టు ఖర్చులకని ఓ వెయ్యిరూపాయలు పోగుచేసి ఇస్తిమి. మా ఏసుపాదం హైదరాబాదు వెళ్ళి ఓ వారానికి వచ్చాడు. కేసు హైకోర్టులో వేశానన్నాడు. ప్లీడరుకు ఇంకా ఫీజు యివ్వాలన్నాడు. ఎక్కడివంటే– మరెట్టా కోర్టా లేక మజాకా అనే, ఫీజివ్వ కుండా ప్లీడర్లు పని చెయ్యరనె. సరేనని అప్పోసప్పో తెచ్చి ఇంకో నూరు రూపాయలు పోగుచేసి యిచ్చాం. మరలా హైదరాబాదు వెళ్ళి నాలుగు రోజులకొచ్చి ఓ కాగితం చూయించి మనకే అయ్యింది భూమనె. ఈ తతంగమంతా ఓ రెండు నెలలు జరిగె. ఈలోపు కోత కొచ్చిన పంట కోయించి నూర్పిచ్చి గోపాళస్వామి అమ్ముకునె. నక్కబోయినాక బొక్క కొట్టుకున్నట్లయె మా పని. అందరం వెళ్లి వూరి ప్రెసిడెంటు గార్కి మొర పెట్టుకుంటిమి. ప్రెసిడెంటు, మా నాయకుడు ఏసుపాదం వెళ్ళి గోపాళస్వామి గార్ని కలిస్తే– వడ్లమ్మి డబ్బు ఎప్పుడో ఆమెకు ఇచ్చాను. ఆమెకు కోర్టు ఖర్చు చాల అయింది. కోర్టు తీర్పు ప్రకారం ఆమె పంట కోసుకుంది. వచ్చే ఏడు మీదే గదా అన్నాడని చెప్పారు. సరే ఇంతలో మనకు ఒరిగేదేంది, తరిగేదేంది అని వూరుకుంటిమి.

ఆరో సంవత్సరం ఏరువాక వచ్చింది. దమ్ముచేసి నాట్లు వేద్దామని పొలం రడీ చేసుకున్నాం. అంతలో మరల టముకు వేయించారు. సీలింగు భూమంతా వెంకటసుబ్బమ్మ గారిదేననిరి. పొలం వద్ద 144 సెక్షను పెట్టి పోలీసులను దించారు. మా కడుపు మంట ఎవరికి కాబట్టె. అందరం మరల జమయితిమి. ఏమైనా భూమిని వదలొద్దనిరి మా కుర్రాళ్లు. ఇన్నాళ్లు కష్టపడి బాగుచేసి సాగు చేస్తే ఇపుడు భూమి మనది కాదంటే ఎలా! ఆ రోజు కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకోమనిరి. ఆపరేషన్ చేయించుకున్నాళ్లకు భూములనిరి. ఎం.ఎల్.ఎ. గారు స్వయానా పట్టాలిచ్చె.

మరల ఎం.ఎల్.ఎ. గారినే కలసి తేల్చుకుందాం అనుకున్నాం. ఈ కోర్టులు, కేసులు ఈ తతంగం, ఈ తిమ్మిని బమ్మి చేయటం మనకు తెలవదాయె. మనం భూమిలోనే చావటమో బతకటమో తేల్చుకుందాం అనుకుంటిమి. మరునాడు అందరం కలిసి నాట్లు వేద్దామని పొలం వెళ్లాం. అక్కడంతా పోలీసుల మయం. భూమిలోకి వస్తే అరెస్టు చేస్తామంటూ పోలీసులు చేయండంటూ అందరం పొలంలో దిగబడితిమి. లాఠీలు తిప్పబట్టె. సరే అరెస్టు అందరిని అరెస్టు చేస్తున్నాము అన్నారు. అంతలో కాపుగారి లారీ రానేవచ్చింది. అందర్నీ అరెస్టు చేశాం లారీ ఎక్కమన్నారు. ముసలీ ముతకా నొదిలి అందర్నీ లారీ ఎక్కించి చీరాల తాలూకా స్టేషన్‌కి తీసుకెళ్ళారు. అందరిచేత కాగితాల మీద బలవంతాన వేలి ముద్రలు గుద్దుకొని రాత్రి 10 గంటలకు వదిలేశాం వెళ్లండన్నారు. చేస్తా బతుకుతూ 8 మైళ్ళు నడిచి ఏ అర్ధరాత్రికో కొంప జేరితిమి. పల్లెపల్లెంతా మేలుకొనేవుంది. ఆ రాత్రి పల్లె కంటికి కునుకు లేదు. తెల్లవారేటప్పటికి మా నాయకుడు ఏసుపాదం చిలకలూరిపేట నుండి ఓ రాజకీయ నాయకుడ్ని వెంట తీసుకొనివచ్చాడు. గ్రామీణ పేదల సంఘం నాయకుడంట ఆయన. పార్లమెంటు మాజీ సభ్యుడంట. పేరు కొల్లా వెంకయ్య గారంట. ఆయనొచ్చి మా అందర్ని పలకరించె. మీ భూములు మీకే అవుతాయి. భయపడొద్దనె. భూస్వాములు దొంగ కాగితాలు సృష్టించి, కోర్టులను, పోలీసులను డబ్బుతో అధికారంతో లోబర్చుకొని ఇలా చేస్తున్నారు. మనం మన భూమిమీదనే పోరాడాలనె. ఎన్నాళ్ళు అరెస్టు చేస్తారో చెయ్యనియ్యి. మనం మటుకు భూమి వదలకూడదనె. శాంతియుతంగా మనం భూముల కోసం పోరాడాలనె. అందర్ని మరల భూమిమీదకు తీసుకువెళ్లె. మరల అరెస్టులు. ఈ దఫా అందర్నీ ఇంకొల్లు పోలీసు స్టేషన్‌కి తీసుకువెళ్లారు. అందరిచేత సంతకాలు, వేలిముద్రలు రాత్రికి వదలడం. ఇళ్ళకు రావటం. మరల రెండురోజులాగి భూమి మీదకు పోవటం, అరెస్టులు కావటం. చీరాలో, ఇంకొల్లో తీసుకువెళ్ళి రాత్రికి వదలటం.

ఈ తతంగం రెండు మూడు సార్లు జరిగింది. ఇంతలో మా పల్లెనుండి కాలేజీలో చదివే కుర్రాళ్లు శలవులకని వచ్చారు. ఈ తతంగం అంతా చూశారు. ఓ రోజు గ్రామంలో వూరేగింపు తీద్దామని చెప్పారు. ఆరోజు చీరాల నుండి విప్లవ విద్యార్థి యువజన నాయకులు ఏడెనిమిది మంది వచ్చారు. వాళ్ళంతా డప్పులు తీసుకొని పాటలు పాడుతూ సాగుతుంటే వాళ్ళెనక మేమంతా పిల్లా జెల్లా కుటుంబాలతో సహా గ్రామం అంతా తిరిగి ప్రచారం చేశాం. గోపాళస్వామి గారింటి ముందు పెద్దగా నినాదాలు ఇచ్చుకుంటూ, పాటలు పాడుకుంటూ వెళ్ళాం. “ఊరు మనదిరా! ఈ దొర ఏందిరా! దొర పీకుడేందిరా” అంటూ ఓ పాట పాడారు. బలేగా వుంది. అలాగే “ఆగదు ఆగదు ఆకలి పోరు ఆగదు” అంటూ యిలా ఎన్నో పాటలు పాడుకుంటూ పల్లెపల్లెంతా కదిలింది. దారిపొడుగునా “విప్లవం వర్ధిల్లాలి” “దున్నేవాడిదే భూమి” “భూస్వాముల దౌర్జన్యం నశించాలి” అంటూ నినాదాలు ఇస్తూ పొలంలోకి వచ్చాము. పొలం అంతా నిర్మానుష్యంగా వుంది. నారు కట్టలు వరిమళ్లలో నాటటానికి వున్నాయి. భూస్వామి కూలీలు ఎవ్వరు లేరు. యువజన నాయకుడు ప్రసాదట. ఆ భూమి దగ్గర మీటింగ్ పెట్టి మాట్లాడాడు. పట్టుకుంటే కందిపోయే టట్లున్నాడు. మొహంలో చిరునవ్వు చిందులాడుతుంది. అక్కలారా! అన్నలారా! అంటూ మాట్లాడ్డం మొదలు పెట్టాడు. ఈ దేశంలో భూమికోసం, భుక్తికోసం, విముక్తి కోసం 15 సంవత్సరాలుగా పోరాటం సాగుతుందన్నాడు. ఆ పోరాటం వలనే భూ సంస్కరణల చట్టం వచ్చిందట. మిగులు భూముల్ని పేదలకు పంచాలంట. అయితే భూస్వాములు, లంచగొండి అధికారులు కుమ్మక్కయి పేదలకు మిగులు భూములు పంచకుండా ఏవేవో దొంగకాగితాలు సృష్టించి కోర్టులకెక్కి న్యాయాన్ని గొంతు నులిమేస్తున్నారనె. ఈ భూస్వాములకు రక్షణగా పోలీసు వ్యవస్థ, పాలకులు వుంటున్నారనె. వీళ్లనెదిరించటానికే మనందరం, తిరగబడాలనె. అవసరం అయితే మనం కూడా పోరాడాలనె.

అలా దేశంలో అనేక రాష్ట్రాల్లో పోరాటాలు సాగుతున్నాయనె. ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాలలో పేదప్రజలు, గిరిజనులు, వీరోచితంగా పోరాడి భూములు పంచుకొని సాగు చేసుకుంటున్నారని చెప్పె. ఈ భూమి మీకు ప్రభుత్వమే పంచి యిచ్చింది. మరల ప్రభుత్వ కోర్టు ఈ భూమి మీది కాదంటుంది. అన్యాయం సాగదు. మనం జాగ్రత్తగా మన పోరాటాన్ని మెట్టుమెట్టుగా కొనసాగించాలి. అందులో భాగంగా ఓ పదిమంది ఈ రోజు పొలంలో దిగి నాట్లు ఆరంభించండి. భూస్వాముల్ని, పోలీసుల్ని నమ్మకూడదు. వాళ్లు ఎప్పుడైనా రావచ్చు. మనల్ని అరెస్టు చేయొచ్చు. అందరిని ఒకేసారి అరెస్టు చేయొచ్చు. అందరం ఒకేసారి అరెస్టు కాకుండా పదిమంది పదిమంది ఓ జట్టుగా అరెస్టులకు వెనుకాడకుండా మన పోరాటం సాగిపోవాలి అని చెప్పి ఓ పదిమంది జట్టు నాట్లకు దిగమని చెప్పె. మొదటి జట్టులో నేను కూడా దిగి నాట్లు వేస్తున్నామో లేదో బిలబిలమంటూ రెండు లారీల నిండా పోలీసులు దిగారు. 144 సెక్షనుంది. ఈ పొలంలో అందర్ని వెళ్లిపొమ్మనిరి. మేము వులుకు పలుకు లేకుండా నాట్లు వేస్తూనే వున్నాం. ఓ పదిమంది పోలీసులు వచ్చి మా పదిమందిని లారీలోకి ఎక్కిచ్చారు. మేము లారీ ఎక్కకుండా నినాదాలు ఇస్తూ ప్రతిఘటించాం. పోలీసులు లారీలకు పని పెట్టి మా పదిమందిని బలవంతాన లారీలోకి నెట్టి చీరాల తీసుకువెళ్ళారు. ఇంతకుముందు అరెస్టు చేసి సాయంత్రానికంతా వదిలేసేది. ఈ దఫా కేసు పెట్టి మరుసటి రోజు కోర్టుకు హాజరు పరిచారు. అందరిమీద మర్డరు కేసు పెట్టారు. ఈ భూమి స్వంతదారు వెంకట సుబ్బమ్మ ఆ భూమిలో కూలీల చేత పని చేయించుకుంటుంటే మేమంతా దొమ్మీగా వెళ్ళి కత్తులు, గొడ్డళ్లు, పారలతో కూలీలను చితకబాది ఆమెను చంపబోయినట్లు, ఆమె ప్రాణభయంతో తప్పుకొని పరిగెత్తినట్లు కేసు పెట్టారు. అమ్మ లంజకొడుకు ఎస్.ఐ. నా కొడుకు బాగా మేసుంటాడు అనుకున్నాం అందరం. అన్నెం పున్నెం ఎరుగని వాళ్ళమీద మర్డరు కేసు.

మా చేతిలో కనీసం కర్రలు, కొడవళ్ళు కూడా లేవాయె. వాడి కళ్లేమైనా పోయాయా! ఆమె దగ్గర బాగా డబ్బు గుంజివుంటారు. వాళ్లిష్టమొచ్చినట్లు మా పదిమందినీ కేసులో ఇరికించారు. మేమొక లాయర్ను పెట్టుకొని బెయిలు పిటీషన్ పెట్టుకొంటిమి. బెయిలు ఇవ్వనన్నాడు చీరాలలో జడ్జి. మా పల్లెలో మిగిలిన వాళ్లంతా కొంత డబ్బు జమచేసి బెయిలు కోసం ఒంగోలు పంపారట మా లాయర్ని. జిల్లా కోర్టులో కూడా జడ్జి బెయిలు ఇవ్వలేదట. ఇక హైకోర్టుకు వెళ్ళి బెయిలు తెచ్చుకోవాలన్నాడు మా లాయరు. ఇదంతా జరిగేటప్పటికి ఓ వారం అయిపోయింది. మా పల్లె జనం అప్పో సప్పో చేసి రెండు వేలు జమ చేసి మా లాయర్ని హైదరాబాదు పంపారు. లాయరు వెళ్లి కూడా రెండు మూడు రోజులాయె. హైకోర్టులో కూడా బెయిలు ఇవ్వకపోతే ఈ సబ్ జైలులోనే వుండాలట. ఇదంతా మా పిల్లకాయలు చెప్పారు. సబ్‌జైలు కొచ్చి మమ్మల్ని చూడడానికి మా పిల్లకాయలతో పాటు యువజన నాయకుడు ప్రసాద్ కూడా వచ్చాడు. ఆయన చెప్పబట్టె, ఇట్లాగే, అక్కడెక్కడో ఇంద్రవెల్లిలోనంట. ఇట్లాగే భూముల తగువట. అక్కడంతా గిరిజనులంట. మాకంటే బీదోళ్లంట. వాళ్ళు అడవికొట్టి సాగుచేసిన భూమంతా వ్యాపారస్తులు, పెదకాపులు అప్పులిచ్చి గుంజుకున్నారంట. గిరిజనుల భూములు గిరిజనులు కానివాళ్లు కొనగూడదని చట్టం వుందంట. అయితేనేం చట్టాలన్నీ డబ్బున్న వాళ్లకే అనుకూలమంట. వాళ్లేనంట మనల్ని పాలించేది. అందుకని వాళ్లకే అండంట ఈ పోలీసులు, అధికారులు. అందుకేనంట ఈ తప్పుడు కేసులు. ఇంద్రవెల్లిలో మాలాగే గిరిజనులంతా జమయి మీటింగు పెట్టుకొందామనుకున్నారంట. గిరిజనుల భూములు గిరిజనులకే చెందాలని, వాటిమీద షావుకార్ల, భూస్వాముల పెత్తనం వుండకూడదని ప్రభుత్వానికి విన్నవించుకోవటానికంట ఆ సభ. పోలీసులు, భూస్వాములు సభని జరగనివ్వకూడదని 144 సెక్షను పెట్టారంట. సభకు వస్తున్న గిరిజనులపై ఎట్టి హెచ్చరిక లేకుండా తుపాకులు పేల్చారంట.

వందకు పైగా గిరిజనుల్ని పిట్టల్లా కాల్చారంట పోలీసులు. పోలీసోళ్లకి తుపాకులు అందుకేనంట. పేదల్ని కాల్చటానికి, సావసితక కొట్టటానికి. భూస్వాముల్ని, షావుకార్లని కాపాడడానికి. ఇదంతా మా పిల్లలతో వచ్చిన ప్రసాద్ చెబుతుంటే రక్తం వుడికిపోయె. ఆ రాత్రి నిద్ర కూడా పట్టలా. ఏమి చెయ్యాలా అని ఈ పోలీసుల్ని, భూస్వాముల్ని. వాళ్ళ దగ్గరేమో లాఠీలు, తుపాకులు వుండబట్టె. ఎట్లాగా, ఆ! మనకు తుపాకులుంటే వాళ్లేనేంటి కాల్చేది, మనం కాల్చలేమా! నాయాల్ది అయినా రేపు కనుక్కుందాములే. మనకు తుపాకులు ఎలా వస్తాయో! వస్తాడుగా పిల్లలతో పాటు మరలా ప్రసాద్. అప్పుడు కనుక్కోవాలి. లేచి కటకటాలు పట్టుకొని బయటకు చూద్దును కదా! తెలవారబోతుంది. చీకటి మబ్బులు చీల్చుకొని సూరయ్య బయటకు రాబోతున్నాడు. తూరుపు మెల్లగా ఎర్రబారుతూంది. ఇంకేమి నిద్రపోతాం అని గుర్రు కొట్టి నిద్రపోతున్న మా రాజేశం గాణ్ణి, సుందరం గాణ్ణి, నాగిగాణ్ణి లేపుదామంటే లేవరే నిద్ర. మొద్దునాయాళ్లు, తింటం, నిద్రపోవటం తప్ప మరో పని లేదాయె.

---

***కథ జరిగిన కాలం : 1976 – 82***

***కథ రచనా కాలం : 1983***



*రంగు బంగారం... మనసు బంగారం... మాట బంగారం... పోరు బంగారంగా ఈ కథలో మెరసి, రాష్ట్ర విప్లవోద్యమ నాయకుడుగా ఎదిగి బూటకపు ఎన్ కౌంటర్లో 2003 మేలో అమరుడైన గుంటూరు– ప్రకాశం జిల్లాల ముద్దుబిడ్డ కా॥ శేషప్రసాద్ స్మృతిలో*

# 3. అభ్యుదయం

ఓ రోజు వున్నట్టుండి మిత్రుడు నారాయణ నేను ఉద్యోగం చేసే నాయుడుపేటకి వూడిపడ్డాడు. నారాయణ డిగ్రీ వరకు చదువుకున్నాడు. అభ్యుదయ భావాలు మోసుకొని తిరుగుతుంటాడు. పెద్దలు గడించిన ఇల్లు, పొలాలు, వ్యవసాయం ఉన్నాయి. సాహిత్యాభిరుచి వుంది. కాలేజి రోజులలో వామపక్ష రాజకీయాలు వంట బట్టాయి. శ్రీశ్రీ కవితలు, పాటలు శ్రావ్యంగా పాడతాడు. మార్క్స్, లెనిన్, మావోల రచనలు నిరంతరం అధ్యయనం చేస్తుంటాడు. ఎక్కడ సభలున్నా అక్కడ ప్రత్యక్షమయ్యేవాడు. జననాట్య మండలి, అరుణోదయ కళాకారులతో గొంతుకలిపి గానం చేస్తాడు. శ్రీ శ్రీ "శక్తి కోసమే నడూ" కవితను చక్కగా గానం చేసి సభలకు వచ్చిన ప్రజలను రంజింప చేస్తాడు. నారాయణకు కొన్ని సుగుణాలుకూడా లేకపోలేదు. దండిగా డబ్బుంటే విలాసంగా ఖర్చు పెడ్తాడు. పేకాట ఆడతాడు. అప్పుడప్పుడు తాగుతాడు. ఇలాంటి నారాయణ అనుకోకుండా ఇలా రావటం కాస్తంత ఆశ్చర్యాన్ని, సంతోషాన్ని కూడా కలుగ జేసింది.

గుంటూరు కబుర్లు కాసేపు చెప్పుకున్నాం. గ్రామ రాజకీయాల్నుండి అంతర్జాతీయ రాజకీయల ద్వారా కాసేపు వాయించాడు. "మా చెల్లెలు పెళ్ళి ఎల్లుండి తిరుపతిలో జరుగుతుంది. అందుకు పిలవటానికి వచ్చానన్నాడు." వాడికి పెళ్ళి కావలసిన చెల్లెలు లేదు. ఆశ్చర్యంతో నీకు చెల్లి ఎవరు? పెళ్లేమిటి అన్నా!

నీకు తెలియదులేరా! మా బాబాయి కూతురు రమ్య వుంది. తిరుపతిలో నర్సింగ్ కోర్సు చేస్తుంది.

అక్కడ మెడికల్ కాలేజీలో ఓ డాక్టరుని ప్రేమించింది. కులాంతరం. పెద్దలు ఎటూ ఒప్పుకోరు కదా! అందుకని ఆ భారం నేను మోయవలసి వచ్చిందని చెప్పాడు. వాడి ధైర్యానికి, పెద్దలని ఎదిరించి వాడు చేసే ఈ వర్ణాంతర వివాహానికి నాకు ఆనందం వేసింది.

''పెళ్లి చేసుకొనే వాళ్లకు మన రాజకీయాలు ఏమైనా వున్నాయా అని అడిగా! అబ్బే అదేం లేదురా అన్నాడు. వాళ్ళిద్దరికి వృత్తిలో పరిచయం. పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. పెద్దలు ఒప్పుకోలేదు. మనం అన్నా పూనుకొని, అండగా వుండాలి గదా! అన్నాడు.మంచి పని చేస్తున్నావురా సంతోషం, అన్నాను.

"ఊరికే సంతోషించడం కాదు. మనం ఇక్కడ నుండి భోజనాలకు సరుకులు, వంటవాళ్లనూ తీసుకెళ్లాలి" అన్నాడు. అప్పుడర్థమయింది, వాడు ఎందుకు వచ్చింది? వాడు తెచ్చిన డబ్బులు మంచినీళ్ల ప్రాయంగా ఖర్చుపెట్టి ఉంటాడు. ఇక నా మీద వాలాడు. సరేనని ఒక వెయ్యి రూపాయలు అప్పుచేసి సరుకులు, వంటమనిషితో తిరుపతి చేరాం. ఓ రూము తీసుకొని పెళ్ళికి రశీదు రాయించుకొని మా ప్రయత్నంలో మేమున్నాం. రూము దగ్గరే పెళ్ళి. పెళ్ళి సమయానికి, పెళ్ళి కూతురు తన స్నేహితులతో వస్తుందని చెప్పారు. పెళ్ళి కుమారుడు తన కుటుంబంతో వస్తాడు. పురోహితుడు వస్తాడు. అక్కడే పెళ్ళి చేస్తాడు. అనంతరం అక్కడే భోజనాలు. ఇదీ పెళ్లి రోజు కార్యక్రమం.

పెళ్ళి రోజు రానే వచ్చింది. రూములో భోజనాల ఏర్పాట్లు జరుగు తున్నాయి. ముహూర్తం వేళ సమీపిస్తూంది. ముందుగా పెళ్ళి కూతురు తనతో నర్సింగ్ చేసే స్నేహితురాళ్ళతో రూము వద్దకు వచ్చింది. పెళ్ళి కూతురును తన చెల్లెలు రమ్య అని పరిచయం చేశాడు నారాయణ.

అమ్మాయి తెల్ల బట్టల్లో ఎర్రగా అందంగా వుంది. కొత్త బట్టలతో స్నేహితుల మధ్య ఉల్లాసంగా కలియ తిరుగుతూ వుంది. చాలా మంది నర్సింగ్ విద్యార్థినులు వచ్చారు. కొంత మంది చీరలతో, కొంత మంది పంజాబీ డ్రస్సులతో పెళ్ళి పందిరి అంతా కళకళలాడుతుంది. ఎంతైనా ఆడపిల్లల సందడే సందడి. అందమే అందం.

కాసేపటికి పెళ్ళి కొడుకు తన కుటుంబ సభ్యులతో, కొద్ది మంది మిత్రులతో అక్కడకు వచ్చాడు. నారాయణ పరిచయం చేశాడు. ఇతనే పెళ్ళి కొడుకు డాక్టరు ఆనందరావు అని, చేతులు కలిపాను. పెళ్ళి కొడుకు నలుపు రంగు, తెల్లని బట్టలు వేసుకున్నాడు. రావిశాస్త్రి పోలిక గుర్తొచ్చింది. పెళ్ళి మండపం ఓ మూలన ఆనందరావు తల్లిదండ్రులు, చెల్లెళ్లు, తమ్ముళ్లు నిల్చొని వున్నారు. పరదా పరిస్తే బిక్కు బిక్కుమంటు కూర్చున్నారు. తమ్ముళ్లు, చెల్లెళ్లు అంతా చిన్న పిల్లలు. 15 సంవత్సరాల లోపువారు. ఆడపిల్లలు పటాపటీల లంగాలు, జాకెట్లు వేసుకొన్నారు. మగపిల్లలు సైను గుడ్డలతో సంబర పడుతున్నారు. ఆనందరావు తల్లిదండ్రులు ముతక బట్టలతో మొరటుగా వున్నారు. ఆనందరావు పెళ్ళికి వచ్చిన స్నేహితులతో కబుర్లాడుతున్నాడు. ఆనందరావు తరపున వచ్చిన బంధువులు, పిల్లలు మిగిలిన వారితో కలవాలంటేనే భయం భయంగా వున్నారు. అప్పుడు తెలిసింది మా స్నేహితులకు, పెళ్ళికొడుకు మాదిగ కులస్తుడని. తల్లిదండ్రులు చెప్పులు కుట్టి సంసారాన్ని నెట్టుకొస్తున్నారని. ఆనందరావు పెద్దకొడుకు కావటాన కష్టపడి అప్పులు చేసి చదివించారు. డాక్టరు అయ్యాడు. ఇప్పుడు ఓ అగ్రవర్ణాల అమ్మాయిని వివాహం చేసుకుంటున్నాడు. ఆనందరావు ఏదో అందలం ఎక్కినంత వుత్సాహంగా వున్నాడు. కుటుంబాన్ని, తమ్ముళ్లని, చెల్లెళ్లని చూస్తే బాధవేసింది.

మా మిత్రుడు శర్మ కూడా పెళ్ళికి వచ్చాడు. వాడికి కాస్త చాదస్తం. ఇదేం పెళ్ళిరా ! ఇంత వర్ణ సంకరమా, అంటూ నా చెవిలో గొణిగాడు. మన సంస్కృతి మంటగలసి పోతుందన్నాడు. అంటరాని వాళ్ళతో పెళ్ళి జరిపించడం ఇదేమి అభ్యుదయమన్నాడు. అఖరుకు పెళ్ళి భోజనం కూడా చేయకుండా జారుకున్నాడు.

మా మిత్రుడు నారాయణకు ఈ పెళ్ళి వర్ణసంకరమైనా ఒక గొప్ప ఆదర్శ వివాహం అని, తన చెల్లెలు ఇటువంటి వివాహం చేసుకోవడం తనకు చాలా సంతోషంగా వుందని చెప్తున్నాడు. ఇటువంటి కులరహిత ప్రేమ వివాహాల వలన మన సమాజం నుండి కులాన్ని నిర్మూలించవచ్చని సమ సమాజాన్ని కాంక్షించే యువతరం ఇటువంటి వివాహాలను చేసుకోవాలని చెప్తూంటే మేమంతా నోరెళ్ల బెట్టి చూస్తుండిపోయాం. తీరా ముహూర్తం దగ్గరకు వచ్చి కాసేపట్లో పెళ్ళి జరగబోతుంటే ఆ పెళ్లి విషయం చర్చించడం అనవసరం కదా అనిపించింది నాకు.

పెళ్ళి బాగానే జరిగింది. పురోహితుడు శాస్త్రోక్తంగా పెళ్ళి జరిపించాడు.తాళి కట్టించాడు. అందరం అక్షింతలు వేసి ఆశీస్సులు పలికాం. ఎవరిదారిన వాళ్లం ఇళ్లకు వెళ్లాం. నేను ఇంటికి వెళ్లినా ఈ పెళ్ళి దృశ్యాలే కళ్లలో మెదుల్తున్నాయి.

ఒక నిరుపేద. అట్టడుగు కులంగా ఈ సమాజంచే భావించబడుతున్న కులంలోని ఓ కుటుంబం తమ పిల్లవాణ్ణి అనేక బాధలు, కష్టాలకు ఓర్చి తాము, మిగిలిన పిల్లలు కడుపు నిండా తినక, కట్టక ఉన్నత చదువులు చదివించారు.

తీరా డాక్టరయి చేతికి అంది వస్తాడనుకున్న కొడుకు ఈ వివాహం చేసుకోవడం వాళ్లకు ఆనందాన్నిస్తుందని అనుకోను. తరతరాలుగా ఈ హిందూ సమాజంచేత అంటరాని వారుగా దూరంగా వుంచబడిన కులంలోనివాళ్లు ఈ సమాజంలో చదువుకోవడమే గగనం. అందులోనూ డాక్టరు కోర్సు చదవటం మరింత కష్టం.

డాక్టరు ఆనందరావు ఆ కులానికి దూరంగా ఓ అగ్రవర్ణ అమ్మాయిని పెళ్ళి చేసుకోవడం గర్వంగా తలచాడేమో. రమ్య నిజంగా డాక్టరు ఆనందరావుని ఏమి చూసి ప్రేమించిందో అర్థంకాని విషయం కాదు. కమ్మ కులంలో ఏ మాత్రం చదువుకున్నా ఎంతెంత కట్నాలు ఆడపిల్లల తల్లిదండ్రులు ఇవ్వాలో తెలియంది కాదు. రమ్య తల్లిదండ్రులు కట్న కానుకలు ఇచ్చుకోలేరు. ఆ విషయం రమ్యకు తెలియనిదేం కాదు. అందుకే సంపాదనపరుడయిన డాక్టరును చేసుకోవటానికి నిర్ణయించుకున్నదనే విషయం అర్థం అవుతూనే వుంది. ప్రేమ ఎంత గుడ్డిదయినా ఇక్కడ మాత్రం ఆ సామెత పొసగదేమోననిపిస్తుంది. ఈ పవిత్ర భారతదేశంలో కులంపేర, ధర్మంపేర, ఆచారం పేరుతో తరతరాల నుండి దోపిడీ జరుగుతున్నది. దానిని అరికట్టటానికి అనేక ప్రజాసంఘాలు, కమ్యూనిస్టులు– నిత్య పోరాటాలు చేస్తూ వుండటం చూస్తునే వున్నాం. కాని ఈ దేశంలో ప్రధానంగా పీడనకు దోపిడీకి గురువుతున్నది అన్ని కులాలలోని స్త్రీలు మరియు అట్టడుగు ప్రజానీకం అని మేథోవర్గాలు విశ్లేషిస్తున్నాయి. కాని ఈ దేశంలో అగ్రవర్ణాల స్త్రీలు కూడా అట్టడుగు వర్గాల వారిని ఇలా కూడా దోపిడీ చేయొచ్చనే విషయం ఈ పెళ్ళి చూచిన తరువాత నాకు తెలిసింది. ఆనందరావు చెల్లెళ్లు, తమ్ముళ్లు బిక్కు బిక్కుమంటూ ఒదిగిఒదిగి వుండటం ఇప్పటికీ నా కళ్లలో మెదలుతూనే ఉంది.

---

*రచనా కాలం : 1980*

*1978లో తిరుమలలో ఓ పెళ్ళి చూచిన నేపథ్యం ఈ కథకు ప్రేరణ.*

# 4. రైతు ప్రస్థానం

ఓ రోజు ఉదయం నిద్ర లేచేటప్పటికి ప్రసాద్ నలుగురు వ్యక్తుల్ని తీసుకొని నా కోసం చీరాల వచ్చాడు. ఆశ్చర్యపడటం నావంతయ్యింది. "గ్రామాలకు తరలండి" క్యాంపెయిన్‌కు వెళ్ళిన ప్రసాద్ ఇలా మధ్యలో రావటానికి బలమైన కారణం లేకపోతే రాడు.

ఈ మధ్య కొన్ని సంవత్సరాల నుండి ప్రతి వేసవి సెలవులలో విప్లవోద్యమంలో పనిచేసే విద్యార్థి యువకులు "గ్రామాలకు తరలండి" క్యాంపెయిన్ చేస్తున్నారు. క్యాంపెయిన్‌కు వెళ్ళాలన్న ఆసక్తివున్న విద్యార్థి యువకులందరికి ముందుగా రెండు మూడు రోజులు వివిధ విషయాలపైన క్లాసులు జరుగుతాయి. ఆ క్లాసులలో దేశంలో, రాష్ట్రంలో జరుగుతున్న విప్లవోద్యమం తీరు తెన్నులను గురించి ఉపాధ్యాయులు వివరిస్తారు. క్యాంపెయిన్లో పాల్గొనేవారు గ్రామాలకు వెళ్ళినపుడు గ్రామీణ ప్రజలతో ఎలా వ్యవహరించాల్సింది, గ్రామాలలో ఉండే రైతాంగం, కూలీలు, వివిధ వృత్తుల వారు, వివిధ కులాలవారు ఏ పొందికలో వున్నది, వారి నిత్య జీవన సమస్యలు, ఇవ్వన్నీ అధ్యయనం చేయడం వలన ప్రజల నుండి నేర్చుకోవడం అనే ప్రక్రియ మొదలవుతుంది. ఆ నేర్చుకోవడంలోనే పరిష్కార మార్గాలు గోచరిస్తాయి. విప్లవోద్యమంలో ఇదంతా ఓ నిరంతర ప్రక్రియగా జరుగుతుంది. దాని వలన పీడిత ప్రజానీకంలో చైతన్యం పెరుగుతుంది, విప్లవోద్యమం బలపడుతుంది.

దాదాపు అన్ని జిల్లాల్లో వేసవిలో ఈ క్యాంపెయిన్ కార్యక్రమాలు జరుగుతున్నాయి. క్యాంపెయిన్‌కు విద్యార్థి యువకులు ఏడెనిమిదిమంది ఒక టీముగా తయారై నిర్ణీతకార్యక్రమం ప్రకారం గ్రామాల అధ్యయనం

చేస్తుంటారు. అలా దాచేపల్లి ప్రాంతం వెళ్ళిన టీంలో నుండి ప్రసాద్ ఇలా వచ్చాడు.

పరస్పరం విప్లవాభినందనలు తెలుపుకొన్న అనంతరం క్యాంపెయిన్ ఎలా జరుగుతుందో వివరాలు ప్రసాద్ అందించాడు. విద్యార్థి యువకులు చాలా ఉత్సాహంగా క్యాంపెయిన్ నిర్వహిస్తున్నట్లు వివరించాడు.

ఆ నలుగురు రైతులను పరిచయం చేస్తూ దాచేపల్లి దగ్గర "తంగెడ" గ్రామ రైతులుగా వారిని పరిచయం చేశాడు. ఆ గ్రామంలో అధిక శాతం రైతాంగం పది ఎకరాల లోపువారే. అన్ని కులాల వారికి కొద్దో గొప్పో భూములున్నాయి. ఎక్కువ మంది రైతులు పొగాకు పండిస్తారు. రెండు సంవత్సరాల క్రితం కారంచేడు గ్రామం నుండి ఓ పొగాకు వ్యాపారి తంగెడ గ్రామ రైతుల నుండి రెండు లారీల పొగాకు కొన్నాడు. వెంటనే డబ్బు ఇస్తానన్న వ్యాపారి ఈ రెండు సంవత్సరాల నుండి వాళ్ళను తన గ్రామం చుట్టూ తిప్పుకుంటున్నాడు. మొత్తం ఈ వ్యాపారి బాధితులు దాదాపు 30 మంది రైతులు. అందులో పదెకరాల రైతులు నుండి ఎకరా అరెకరా రైతుల వరకు వున్నారు. వివిధ కులాలవారూ వున్నారు.

ఆ వ్యాపారి పేరు చక్రపాణి. స్వగ్రామం కారంచేడు. గతంలో ఆ గ్రామం గుంటూరు జిల్లాలో ఉండేది. ప్రకాశం జిల్లా ఏర్పడ్డాక ప్రకాశం జిల్లాలో చేరింది. విజయవాడ మద్రాసు బకింగ్‌హోము కాలువ పక్కన గల గ్రామం. బాగా ధనవంతమైన గ్రామం. తెలుగు సినిమా రంగంలో పెట్టుబడులు ఆ గ్రామం నుండి తరలుతుంటాయి. చక్రపాణి తండ్రి నారాయణరావు చౌదరి. ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీలో పనిచేశాడు. 1952 ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిగా విజయం సాధించాడు.

తరువాత పొగాకు వ్యాపారంలో ప్రవేశించాడు. రష్యా దేశానికి పొగాకు ఎగుమతిచేస్తూ లక్షలార్జించాడు. నారాయణరావు చౌదరి అనంతరం కుమారులలో ఒకరైన చక్రపాణి ఆ వ్యాపారంలో ప్రవేశించాడు. సినిమా రంగంలో కూడా చక్రపాణి వేలు పెట్టాడు.

చక్రపాణి రెండు సంవత్సరాల క్రితం తంగెడ గ్రామం వెళ్లి పొగాకు రెండు లారీలు కొన్నాడు. సరుకు లారీలలో కారంచేడు చేరగానే డబ్బులు ఇస్తానని హామీ మీద చెక్కులు కాటా వేయించి రెండు లారీలను పిడుగురాళ్ల నుండి పిలిపించి తీసుకువెళ్ళాడు. లారీలతోపాటు కొంతమంది రైతులు కూడా కారంచేడు వెళ్ళారు.

అదే సమయంలో ప్రకాశం జిల్లా పొగాకు రైతులు గిట్టుబాటు ధర కోసం జిల్లా అంతటా ధర్నాలు చేస్తున్నారు. టంగుటూరు దగ్గర రైతులు ధర్నా చేస్తుంటే పోలీసు కాల్పులు జరిగాయి. ఒక రైతు చనిపోయాడు. అనేక మందికి గాయాలయ్యాయి. రైతులంతా తీవ్ర ఉద్రిక్తతతో రహదారులు దిగ్బంధనం చేశారు. జిల్లా అంతటా రైతాంగ నిరసనలతో మారుమ్రోగింది. ప్రభుత్వ కార్యాలయాలు మూతబడ్డాయి. అందువలన ఆ రోజు బ్యాంకు నుండి డబ్బు తీసుకురావడం తన గుమస్తాకు కుదరలేదని చక్రపాణి చెప్పాడు. తరువాత రెండు రోజులు శలవులు వచ్చాయి. వెళ్లిన రైతులకు ఖర్చులకు కొంత డబ్బిచ్చి పంపాడు. రైతులు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. చక్రపాణి ఇల్లు కోటలా ఉంది. చుట్టూ పెద్ద కాంపౌండ్ వాల్. రెండంతస్థుల మేడ. మేడ చుట్టూ ఓపినంత ఖాళీ స్థలం. ఇంటికి నిత్యం వచ్చిపోయే రైతుల మోటారు సైకిళ్లు, వ్యాపారుల కార్లు. ఈ హంగామా అంతా చూసి తంగెడ రైతులు అనుకున్నారట, చక్రపాణి గారి దగ్గర డబ్బు ఎక్కడకు పోతుందని.

మొత్తం తమ సరుకంతా ఓ ప్రక్క గోడ ఖరీదు చేయదనుకున్నారట. ఖర్చులకు ఇచ్చిన డబ్బులు తీసుకొని తిరుగుముఖం పట్టారు. ఆ వచ్చిన రైతులు అమాయకంగా ఈ విషయాలన్నీ చెబుతుంటే కడుపు మండి పోయింది.

గుంటూరు, ప్రకాశం జిల్లాలలో పొగాకు పంట ఎక్కువగానే పండిస్తారు రైతులు. దానితో అనేక పొగాకు కంపెనీలు గుంటూరు, చిలకలూరిపేట, మార్టూరు, చీరాలలలో వెలిశాయి. వీటన్నింటిలో చీరాల ఐ.ఎల్.టి.డి కంపెనీ పెద్దది. పొగాకు కొని గ్రేడ్ చేయించి ఇతర దేశాలకు ఎగుమతి చేస్తారు. చిన్నచిన్న వ్యాపారస్తులు కూడా రైతుల వద్ద పుగాకు కొని గ్రేడ్ చేయించి పెద్ద పెద్ద కంపెనీలకు అమ్మడం చేస్తుంటారు. ఈ వ్యాపారస్తులు ఎక్కువగా స్థానికులు కాబట్టి రైతులు వాళ్లను నమ్మి పొగాకు అమ్ముతారు. వాళ్లు నష్టాలొచ్చాయంటూ రైతులకు కొంత డబ్బు ఎగనామం పెడుతుంటారు. ఈ తంతు ఇలా జరుగుతూనే వుంటుంది. రైతులు మరల మరల మోసపోతూనే వుంటారు.

చక్రపాణి చుట్టూ రైతులు ఈ రెండు సంవత్సరాలబట్టి తిరుగు తున్నారు. ఎవరికి వీలయినప్పుడు వాళ్లు ఇద్దరు ముగ్గురు కలసిరావటం చక్రపాణిని డబ్బుల కోసం బ్రతిమిలాడుకోవడం జరిగేది. చక్రపాణి ఎక్కువగా నిషాలోనే వుండేవాడు. కాస్త ధనిక రైతులను, అగ్రవర్ణ రైతులను ప్రక్కకు పిలిచి మర్యాదగా మాట్లాడటం, అందరితో మీకెందుకు మీ డబ్బులు త్వరలో ఇస్తానని ఎంతో కొంత ఖర్చులకిచ్చి పంపుతూ వుండేవాడు. చిన్న రైతులు, తక్కువ కులం రైతులు వస్తే వాళ్లను తిట్టడం, బెదిరించడం చేసేవాడని ఆ

రైతులు చెప్పి వాపోయారు. ఇలా రైతుల మధ్య కులం పేరుతో, వర్గం పేరుతో విభేదాలు కల్పించి అందరూ కలసి వచ్చి డబ్బు అడగకుండా చేశాడు.

సమస్య అయితే అర్థమయింది. పరిష్కారం ఎలా అని ప్రసాద్, నేను ఆలోచించాం. సాయంత్రం ప్రజాసంఘాల బాధ్యులతో సమావేశం ఏర్పాటు చేయాలని నిర్ణయించాం. ఆ రైతులకు మాకున్నంతలో భోజనం ఏర్పాట్లు చేసి విశ్రాంతి తీసుకోమని చెప్పాం. ప్రసాద్ ప్రజాసంఘాల బాధ్యులకు కబురు చేయడానికి నాసైకిలు తీసుకొని ఊరిమీద పడ్డాడు.

సాయంత్రం ప్రజాసంఘాల బాధ్యులు, రైతులు అందరం కలసి కూర్చొని చాలాసేపు చర్చించిన అనంతరం ఓ నిర్ణయానికొచ్చాం. బాధిత రైతులందర్నీ తీసుకొని వెళ్లి చక్రపాణిని కలుద్దామని నిర్ణయించాం. గ్రామం వెళ్ళి రైతులను పిలుచుకరమ్మని ఇద్దరు రైతులను పంపించాం. సరాసరి మరుసటిరోజు మధ్యాహ్నంకల్లా కారంచేడు రమ్మని చెప్పి పంపించాం.

మరుసటిరోజు సాయంత్రానికి తంగెడనుండి రైతులు, చీరాల నుండి ప్రజాసంఘాల బాధ్యులు అందరం కారంచేడు చేరాం. చక్రపాణి ఎక్కడుందీ వాకబు చేశాం. చక్రపాణి గ్రామంలోనే పొగాకు గోడౌన్ వద్ద వున్నట్లు తెలిసింది. అందరం అక్కడికి చేరుకొన్నాం. రైతుల్ని, మమ్మల్ని చూచి కాస్త ఖంగు తిన్నట్లు అనిపించినా వెంటనే సర్దుకొని మాటలు కలిపాడు. మేము చీరాల నుండి వచ్చామని, రైతుల పొగాకు బకాయిలు ఎప్పటిలోగా ఇస్తారో తేల్చి చెప్పమని నిలదీశాం. ఏవో తన సాధక బాధకాలు కాసేపు చెప్పుకొన్నాడు. 15 రోజుల గడువులో డబ్బు చెల్లిస్తానని హామీ ఇచ్చాడు. తప్పితే బాగుండదని మేము హెచ్చరించి వచ్చేశాం.

రైతుల్ని వదిహేనురోజుల తర్వాత రమ్మన్నాం. ఏరోజు రావాల్సింది నిర్ణయించుకున్నాం. రైతులు తంగెడ గ్రామం, మేము చీరాల చేరాం.

మేము మధ్యమధ్య రెండుసార్లు చక్రపాణిని కలిశాం. గ్రామ ప్రెసిడెంటు, పెద్దలు కొంతమందికి తెలియపరిచాం. చక్రపాణి పెద్దలను గౌరవించడు పెద్దల మాట వినడు అని గ్రామ పెద్దలు తమ అశక్తతను తెలియపరచారు. మీరూ, తంగెడ రైతులే తేల్చుకోవాలని చెప్పారు. గ్రామంలోని రైతు కూలీలు కూడా అదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

కారంచేడు గ్రామంలో కమ్మకులస్తులు ఎక్కువ. మిగిలిన కులాలు తక్కువ. ఎక్కువ మందికి వ్యవసాయం ప్రధాన జీవనాధారం. అన్నీ మాగాణి భూములు. వరి, మినుము, ప్రధాన పంటలు. జాగర్లమూడివారు, యార్లగడ్డ వారు పెద్ద రైతులు. వ్యవసాయంతోపాటు రైస్ మిల్లులు, సినిమా హాళ్ళ మొదలగు వ్యాపారాలలో స్థిరపడ్డవారున్నారు. గ్రామంలో చదువుకున్నావారు కూడా అధికం. స్వాతంత్ర్యోద్యమ కాలంలో జస్టిస్ పార్టీ ప్రభావం, స్వాతంత్ర్యానంతరం కొంతకాలం, కాంగ్రెసు, స్వతంత్ర పార్టీ, తెలుగుదేశం వరుసగా ప్రభావాలు చూపాయి. గ్రామంలో ఫ్యూడల్ భావజాలం అధికం. రైతు కూలీలు, చేతివృత్తులవారు రైతాంగంపై ఆధారపడి జీవనం సాగించే వారు. రైతాంగం తమ పెద్దరికం నిలుపుకునేవారు. తమపై ఆధారపడి బతికే కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, చాకలి మొదలగు కులాలవారి అవసరాలను కనిపెట్టివుండేవారు. అవసరమయినపుడు కొద్దోగొప్పో ఆర్థిక సహాయం చేస్తుండేవారు. ఇలా గతంలో ఆ గ్రామ రైతాంగానికి మిగిలినవారికి మధ్య వైరుధ్యం అంతగా వుండేదికాదు. అంతర్గతంగా వున్నా పైకి కనుపించేదికాదు. ఈ పరిస్థితి స్వాతంత్ర్యానంతరం మారింది.

ఎన్నికలు, హైస్కూలు, కాలేజి చదువులు, ఉద్యోగాలు సమాజంలో అనేక మార్పులు తెచ్చాయి. మనుషుల మధ్య సంబంధాలు తగ్గిపోయాయి. ఆర్థిక లావాదేవీలు అధికమయ్యాయి. నూతన పెత్తందారీ వర్గమొకటి దేశమంతా ఆవిర్భవించింది. దాని స్వభావం ఆ గ్రామంలో కొట్టొచ్చినట్లు కనుపించేది. నూతన పెత్తందారీ వర్గానికి, రైతు కూలీలు, చేతివృత్తులవారి మధ్య వైరుధ్యాలు అధికం అయ్యాయి. డబ్బు ప్రధానాంశమయింది.

గడువు సమయానికి తంగెడ నుండి రైతులందరూ వచ్చారు. అందరం కలసి కారంచేడు వెళ్ళాం. పొగాకు గోడౌన్ వద్ద చక్రపాణిని కలిశాం. చక్రపాణి డబ్బు సమకూర్చకపోగా యింకా కొంత గడువు కావాలని అడుగుతున్నాడు. మేము ఆలోచించాం. స్థానికంగా వున్న పరిచయస్తులతో కూడా సంప్రదించాం. మీరూ, రైతులు అందరూ ఇక్కడే వుండి చక్రపాణి విషయం తేల్చుకోమని సలహా యిచ్చారు. ఈ రైతులందర్నీ ఎక్కడ వుంచడం. వీళ్లందరికీ వసతి, భోజనాలు ఎలా? అని మధనపడ్డాం. మా విద్యార్థి యువకులకు రెండుమూడు సంవత్సరాలనుండి "గ్రామాలకు తరలిరండి" కాంపెయిన్ అనుభవముంది.

ఆ అనుభవంతో రైతులందర్నీ స్థానికంగా ఉండే చిన్న రైతులు, శ్రామికుల ఇళ్లలో ఉంచాలనుకున్నాం. స్థానిక రైతులు కూడా ఇందుకు సుముఖత వ్యక్తపరిచారు. ఇంటికొకర్ని భోజనానికి పంపండి. మాతోపాటు తింటారు, వుంటారు అని భరోసా ఇచ్చారు కొంత మంది రైతులు.

తంగెడ నుండి వచ్చిన రైతులలో కొంత మంది అగ్రకులస్తులు, కాస్త స్థిమితం గల రైతులు ఇలా ఇతరులు, ముక్కు మోహం తెలియని వాళ్ల ఇండ్లలో వుండటానికి కాస్త అయిష్టత వ్యక్తపరిచారు.

అందరిని కూర్చొబెట్టి ఓ చిన్న సమావేశం వేశాం. మీకు ఆశ్రయమిచ్చేవారు మీలాంటి శ్రమజీవులే. ఇక్కడ కులాల ప్రసక్తి లేదు. కులాల ప్రసక్తే ఉంటే ఈపాటికి కమ్మ రైతులకన్నా చక్రపాణి డబ్బు ఇచ్చి ఉండేవాడు. కులం కూడు బెట్టదు. చక్రపాణి లాంటి దళారీ వ్యాపారస్తుల్ని దారికి తేవాలంటే మనందరం మన కులాల్ని మరచిపోవాలి. మనందరం శ్రమ జీవులం. మనందరం శ్రమచేసి పండించిన పంటకు ప్రతిఫలం మనం పొందాలి. అందుకు ఇక్కడి చిన్న రైతులు, కూలీలు మనకు ఆశ్రయం ఇవ్వటానికి సన్నద్ధమయ్యారు. మనం వారి ఆశ్రయంతో చక్రపాణిని దారిలోకి తేవాలి. ఇలా వివరణ ఇచ్చిన తరువాత రైతులు మెత్తబడ్డారు. రైతులందరితో గ్రామంలోకి బయలుదేరాం. రైతుల ఇళ్ల వద్దకు వెళ్లి పరిస్థితిచెప్పి ఒక మనిషికి భోజనం, వసతి కల్పించమని అడిగాం. వెసులుబాటు వున్నవాళ్లు సరేనన్నారు. లేనివాళ్ళు తమ అశక్తతను బాధతో వ్యక్తపరిచారు. ఒక గంటసేపు రెండు బజార్లు తిరిగేటప్పటికి మొత్తం ముప్పయి మంది రైతులకు ఆశ్రయం దొరికింది. ఒకొక్కర్ని ఒక్కో ఇంటి వద్దా వుంచుతూ వచ్చాం. ఆశ్రయం ఇచ్చిన వాళ్లు ఏ కులమో, ఆశ్రయం పొందిన వాళ్లు ఏ కులమో ఇక్కడ చర్చించడం అనవసరం. రైతులందరూ ఎవరికి కేటాయించిన ఇంట్లో వాళ్లు స్నానాలు చేయడం, వాళ్లు పెట్టింది తినడం, ఆశ్రయమిచ్చిన కుటుంబాలతో మాటా మాట కలసి సంబంధాలు ఒకటి రెండు రోజులలోనే బలపడ్డాయి. తంగెడ రైతులు ఈ సంవిధానానికి చాలా ఆనందించారు. ఆశ్రయమిచ్చిన వాళ్లకు తమ సాటివారి కొరకు సాయపడుతున్నామనే ఆనందం. ఆశ్రయం పొందిన రైతులు తాము విజయం సాధించినంత సంతోషం.

ప్రతి రోజు రైతులు ఉదయం 9 గంటలకంతా చక్రపాణి పొగాకు గోడౌను చేరుకునేవారు. ఆరుబయట కూర్చొని కబుర్లాడుకుంటూ ఉండేవారు.

చీరాల నుండి మేము వచ్చే వాళ్ళం. చక్రపాణిని కలిసి డబ్బు విషయం అడిగేవాళ్లం. చక్రపాణి వాయిదా వేయడం. రెండు మూడు రోజులు ఈ పద్ధతి చూశాం.

రైతులు సంఘటితంగా ఉండటం, గ్రామంలోని చిన్న రైతులు, శ్రమ జీవులు ఆశ్రయమిచ్చి అండదండలందించడంతో తంగెడ రైతులకు ధైర్యం వచ్చింది. చక్రపాణి వాయిదాలు మీద వాయిదాలు వేస్తూ దాట వేస్తున్నాడు. పొగాకు గ్రేడింగ్ చేయిస్తున్నాడు. గ్రేడింగ్ చేయించింది లారీలలో ఎక్కడికో వెళ్తుంది. గ్రేడింగ్ చేయాల్సిన పొగాకు వస్తూ వుంది. చక్రపాణి డబ్బు ఇవ్వడు. వాయిదాల మీద వాయిదాలు.

ప్రసాద్, నేను, రైతులు కూర్చొని ఆలోచించాం. చక్రపాణి రోజూ ఒంటి గంటకు భోజనానికి ఇంటికి వెళ్తాడు. ఈ రోజు చక్రపాణిని భోజనానికి వెళ్ళకుండా నిలవేద్దామనుకున్నాం. అలాగే సరుకును కూడా బయటకు పోనివ్వకుండా ఆపాలని నిర్ణయించాం. సరిగ్గా ఒంటి గంటకు చక్రపాణి భోజనానికి బయలుదేరి గేటు వద్దకు వచ్చాడు. గేటుకు అడ్డంగా రైతులు, ప్రసాద్ చక్రపాణికి ఎదురుగా నిల్చొని మీరు భోజనానికి వెళ్లటానికి వీల్లేదన్నాడు. రైతులు, తిండీ తిప్పలు లేక పరాయి పంచలో పడిగాపులు కాస్తుంటే మీరు హాయిగా ఇంటికి వెళ్ళి భోంచేసి రావడం, వీళ్ల మొర ఆలకించకుండా మీ వ్యాపారం మీరు చేసుకోవడం ఇక వల్లకాదన్నాడు. “గోడౌన్ సరుకు బయటకు పోవడానికి వీలుకాదు. లోపలి సరుకంతా లెక్క కట్టించి మేము తీసుకుంటాం. మీరు అలా లోపలికి వెళ్లి కూర్చొండి" అని ప్రసాద్ చక్రపాణి చెయ్యి పట్టుకోగానే పిల్లిలా లోపలికి వెళ్ళి కూర్చున్నాడు.

అంతకు క్రితం విడివిడిగా రైతులు డబ్బుల కొరకు వచ్చినపుడు నిర్లక్ష్యంగా వ్యవహరించడం, తిట్టడం చేసేవాడు ఇలా పిల్లిలా వ్యవహరించేటప్పటికి రైతులందరికీ ఆశ్చర్యం వేసింది. ప్రసాద్ ఇంకా కొంత మంది రైతులం లోపలికి వెళ్ళి చెప్పాం. మీకు భోజనం కావాలంటే ఎవరి చేతనయినా తెప్పించుకొని తినండి. మేము చిలకలూరిపేట వెళ్లి వేరే వ్యాపారిని పిలిపిస్తాం. మీ గోడౌన్లో సరుకు విలువ కట్టి అమ్మేస్తాం. మా డబ్బులు మేము తీసుకుంటాం అని చెప్పాం. చక్రపాణి మౌనంగా, అసహాయంగా, అంగీకారంగా కూర్చున్నాడు. ఇద్దరు పెద్ద రైతులు చిలకలూరిపేట వెళ్లి ఒక పొగాకు బయ్యరును వెంట బెట్టుకొని వచ్చారు. మొత్తం సరుకు విలువ కట్టించాం. రైతుల డబ్బుకు దాదాపు సరిపోయేవిధంగా వుంది సరుకు. మొత్తం పొగాకు తూకం వేయించి, పేట తీసుకొని వెళ్ళి అమ్మటం జరిగింది. రైతులకు రావలసిన రెండు లక్షలకు గాను దాదాపు 1.80 లక్షలు వచ్చాయి. రైతులంతా సంతోషించారు. దామాషా ప్రకారం డబ్బు పంచుకున్నారు. అసలు డబ్బే రాదనుకొని దిగులుపడ్డ రైతులు సంతోషించారు. ఈ నాలుగు రోజులనుండి తమకు ఆశ్రయం కలిగించిన కుటుంబాలకు కృతజ్ఞతలు చెప్పి రైతులంతా తంగెడ కెళ్ళారు. మేము చీరాల వెళ్లాం.



రచనా కాలం : 1985

# పోరాటమే - దారి

## అంకితం



భూమికోసం, భుక్తికోసం,
విముక్తికోసం ''పోరాటమె దారి''
అంటూ సాయుధులై
నగ్జల్ బరీలో చేవచూపి
శ్రీకాకుళంలో రక్తం చిందించి
దేశమంతటా విస్తరించి
అంతిమ విజయం వైపు పయనిస్తున్న
విప్లవ రైతాంగ కామ్రేడ్స్ కు
విప్లవాభినందనలతో

\- రచయిత

# 1. మేలుకొలుపు

పొద్దుపొడిచిందిరా ఓయన్నా!
నిద్దురవీడరా రైతన్నా !!

తూరుపూదిక్కున
సూరయ్య లేచెను
చీకట్ల రేయల్ల
వైదొలగిపోయెను॥

కొడవళ్ళు పారలూ
చేతబట్టండన్న
కంపచెట్లన్నిటిని
కొట్టి కాల్చండన్న ॥

ఎత్తుపల్లములన్ని
సమముచేయండన్న
మెత్తగా భూమంత
దున్ని వేయండన్న ॥

ఆరుణకాంతుల్లోన
విత్తనాల్ చల్లండి
కనురెప్పలా పంట
కాపలాకాయండి।।

కోతలూ కోయండి
నూర్పిళ్ళు చేయండి
పంటనంతా పంచి
పరవళ్ళు తొక్కండి॥

పొద్దుపొడిచిందిరా ఓయన్నా!
నిద్దుర వీడరా రైతన్నా!!
తూరుపూదిక్కున
సూరయ్య లేచెను
చీకట్ల రేయల్ల
వైదొలగిపోయెను।।



## 2. పెట్టరా చిచ్చు

పసిడిపండేపొలము
సాగులేకను నేడు
బీడాయె మోడాయె
అడవాయెరన్నా!

అడవినిండా కంప
అలముకొనియున్నాది
వన్యమృగములుచేరి
తెగబలిసియున్నవి

పెట్టరా పెనుచిచ్చు
ఈ అడవికంపకూ
వెయ్యరా మెడకుచ్చు
ఈ అడవిసంతుకూ

కంపనంతాకాల్చి
సంతునంతా పేల్చి
బాగుచేయన్నా!
సాగుచేయన్నా!

# 3 . లేచిరండి

లేచిరండి!
వేగరండి !!
మార్క్సుమాట
వినగరండి :

లెనిన్ బాట
నడవరండి !
మావోసూక్తి
మరువకండి !

ఎర్రజండా
పట్టుకోండి!
కష్టనష్టాలకు
ఓర్చుకోండి !

వర్గ కసిని
పూనిరండి !
ఆయుధాల
నందుకోండి!

సాయుధులై
కదలిరండి !
పోరులోన
కదలిరండి!

పీడకుల
కాల్చరండి!
రాబందుల
చెండరండి!

కామందుల
కూల్చరండి!
సమత మమత
పేర్చరండి!

సమసమాజం
కూర్చరండి!
ఉత్పత్తులు
పెంచరండి!

సంపదల్
పంచరండి!
వెలుగులెన్నో
కురియరండి!

ఆనందాల్
విరియరండి!
లేచిరండి!
వేగరండి!!

# 4. పొంగింది రక్తమ్ము

పొంగింది రక్తమ్ము
పొర్లింది రక్తమ్ము
నగ్జల్‌బరీలోన
విప్లవారక్తమ్ము
వీరులారక్తమ్ము
ఎర్రనీరక్తమ్ము !!



పొంగినారక్తమ్ము
పొర్లినారక్తమ్ము
శ్రీకాకుళమ్ములో
పోరులో చిందింది
వాడిగా చిందింది
వేడిగా చిందింది!!

చిందినా రక్తమ్ము
చిమ్మినా రక్తమ్ము
భరతావనినిండ
కాల్వలై పారింది
కడలియై పారింది
అణువణువు తాకింది!!

పారినా రక్తమ్ము
ఆరనీ రక్తమ్ము
పాలకుల పీఠాల
కదలించి వేయురా
కబళించి వేయురా
కరగించి వేయురా!!

# 5. విప్లవ రథము



నడవాలి నడవాలి
విప్లవ రథము
విడవాలి విడవాలి
నైరాశ్యపథము!

ధనిక పేదను వర్గ
భేదాలు పోవాలి
కార్మికా కర్షక
పాలనే రావాలి !

పేదసాదలుకూడి
ఒక్కటై నిలవాలి
దోపిడీ మూకలా
భరతమే పట్టాలి !

పల్లెపల్లెలోన
సమత విరియాలి
గుండెగుండెల్లోన
నవ్వులే పూయాలి!

జాతిమత భేదాలు
భస్మమైపోవాలి
అన్నదమ్ములవలె
అందరము మెలగాలి.

నడవాలి నడవాలి
విప్లవపథము
విడవాలి విడవాలి
నైరాశ్యపథము !

# 6. పోరులేక సమములేదు

లేవరా! లేవరా !
సోదరా! సోదరా !
లేచి ముందు
కురకరా! ఉరకరా!

మన కష్టం
మన రక్తం
పీల్చివేసె
పిప్పిచేసె

బడా బడా
బూర్జువాలు
తాతా బిర్లా
వారసులు ॥లేవరా!॥

సోషలిజం
కబుర్లతోడ
జోకొట్టెను
ప్రభుత్వం మనల

చూచిచూచి
వేచి వేచి
సత్తువంతా
వీగిపోయె!

చావులాంటి
బతుకాయె!
కష్టమెల్ల
వృధాఆయె!

శ్రమయంతా
దోపిడాయె
లేవరా! లేవరా!
సోదరా! సోదరా!

పంటలెన్ని
పండించినా
గంజినీళ్ళు
దొరకవాయె!

గుడ్డలెన్ని
నేసినా
చింకిపాత
తప్పదాయె!

ధనమెంత
కూర్చినా
చేత పైస
కరువాయె!

మేడలెన్ని
కట్టినా
పూరిపాక
నీడాయె!
లేవరా! లేవరా!
సోదరా! సోదరా!

చేయిచేయి
కలపరా!
ఒక్కటై
నడవరా !
గురిచూచి
కొట్టరా!

దోపిడీల
పొట్టలా !
నాడుమనకు
సుఖముచూడు

తిండి కరువు
బట్ట కరువు
పైస కరువు
నీడకరువు
సమస్తమ్ము
తీరురా!
లేవరా! లేవరా!:
సోదరా! సోదరా !

సానలేక
పదునులేదు
పోరులేక
సమములేదు
లేవరా! లేవరా!
సోదరా! సోదరా !
లేచి ముందు
కురకరా ! ఉరకరా !

# 7. జోహారు!

జోహారు గెరిల్లా
జోహారు! జోహారు!!

మా బాధలే నీవి
మా గాధలే నీవి
మా బిడ్డవే నీవు
మా మనిషివే నీవు
మాకొరకే నీవు
పోరాడినావు ||జోహారు||

మాలోన ఒకడివై
మమునడుపు సూత్రమై
మాగుండె వెలిగావు
మాకండ నిలిచావు
మాకొరకె నీవు
త్యాగాలు చేశావు ||జోహారు||

మాగుండె మండేటి
బడబాగ్ని నీవు
మాకనుల నిండేటి
వర్గకసి నీవు
మాకొరకె నీవు
నెత్తుర్లు ఒలికావు ||జోహారు||

ఎర్రజండానె త్తి
ఎగుర వేశావు
పోరాటమొక్కటే
దారనీ చాటావు
మాకొరకె నీవు
ప్రాణాలు ఒడ్డావు ||జోహారు||

కంటకుల నెందర్నో
కడతేర్చినావు
హంతకుల నెందర్నో
హతమార్చినావు
విప్లవాశక్తినీ
సమకూర్చినావు ||జోహారు||

నీవు నడచిన బాట
నెత్తురొలికినబాట
నీవు పలికినమాట
విప్లవాగ్నులమాట
నీవు చూపినదీక్ష
మాకాశ్రయమ్మ్కు ||జోహారు||

నీబాటనే మేము
పయనమైపోతాము
నీమాటనే మేము
కాపాడుకుంటాము
ప్రాణాల కెరువకా
పోరాడుతాము ||జోహారు||

# 8. గోముఖ వ్యాఘ్రం

పాలకవర్గం
పాడి ఆవుకాదు
గాటకట్టి
పాలుపిండి
సేవించటానికి
పాలకవర్గం
గోముఖవ్యాఘ్రం
దోపిడీనిలయం.
అదొక విషవలయం
దానికి అండగా
సామ్రాజ్యవాద దేశాలు
జాతీయఅంతర్జాతీయ
బూర్జువాలు
పెద్ద పెద్ద
భూస్వాములు
ధనిక రైతాంగం
శంకరాచార్య
పీఠాలు
పంగనామాల దేముళ్ళు
భగవదవతార బాబాలూ,
బాకా పత్రికలూ
కాకా రచయితలూ
చెత్త సినిమాలు
సెక్సు పుస్తకాలు
ఎమ్యూజ్‌మెంటు పార్కులు
రిజిష్టరు క్లబ్బులు
సారాదుకాణాలు
ఇంకా
ఇలాంటివెన్నో
ఇవ్వన్నీ
పెట్టనికోటలు
కోటలో
ప్రవేశించాలంటే
కోటగోడలు బ్రద్దలుకొట్టాలి
ఉత్తచేతులతో
యత్నించి యత్నించి
మనచేతులన్నీ
పచ్చిపుండ్లయినా
యి
అందుకే ఇక పై
ఎర్రపిడికిళ్ళెత్తండి
కోటగోడలు
బద్దలుకొట్టండి
గోముఖవ్యాఘ్రాన్ని
సమూలంగా కూల్చండి!

# 9. లేస్తున్నారు జనం!

ప్రజలకుకావలసింది
కబుర్లుకాదు. నేడు
చేతినిండాపని
కడుపునిండా తిండి
కట్టుకోను బట్ట
తలదాచుకోను నీడ
ఇవ్వన్నీ కనీసవసరాలు
కనీసవసరాలే
కరువయిననాడు
దోచబడ్డనాడు
దాచబడ్డనాడు
ఎన్నాళ్ళని
ఎన్నేళ్ళని
ఎందుకొరకని
ఊరుకుంటారు జనం
అందుకే నేడు
లేచారు జనం
లేస్తున్నారు జనం



లేవబోతున్నారు జనం
ఒకర్నించి ఒకరు
ఒకర్ని చూచి ఇంకొకరు
ఒకర్నిమించి మరొకరు
ఉవ్వెత్తున
ఉప్పెనలా
ఒకేబాటగా
ఒకేమాటగా
ఒకేశక్తిగా
ఉరుకుతున్నారు
పోరాటమార్గంలోకి
చెండుతున్నారు
దోపిడీమూకల
తొలుస్తున్నారు
పాలకుల గుండెల.
కదలిపోతున్నారు
విప్లవమార్గాన
సమసమాజ స్థాపనకై
దీక్షాకంకణులై!

# 10. రారోరి పోదాము

రారోరి పోదాము
పోదాము రారోరి
పోరుమినహా దారి
లేదోరి మనకోరి!
॥రారోరి పోదాము॥

మెత్తగుంటే మనల
జలగలా పీల్చేరు
గుత్తనై మనమంత
గురిచూచి కొట్టాలి
॥రారోరి పోదాము॥

పేదవాడలు మనకు
పెట్టనీ కోటలు
కార్మికులు, కర్షకులు
మన అగ్రసైన్యమ్ము
॥రారోరి పోదాము॥

ధనికసామ్యము నేడు
మిడిసిపడుతున్నాది
ఎర్రపిడికిలిఎత్త
దిమ్మతిరిగి చచ్చు
॥రారోరి పోదాము ॥

కాయకష్టపుచెయ్యి
కరుకుతేలున్నాది
పస్తులున్నా కడుపు
భగ్గుమంటున్నాది
॥రారోరి పోదాము ॥

కొండంత అండరా
మనచేతి పనిముట్లు
పెట్టరా పదును
ఎత్తరా ఆయుధము
॥రారోరి పోదాము ॥

పాలనా అడివంతా
ఎండిపోయెనురన్నా
విప్లవాగ్ని రగిల్చి
కాల్చి వేద్దామన్న
॥రారోరి పోదాము॥

# 11. మా మార్గం – పోరాటం

ఆగబోదు – ఆగబోదు
మావిప్లవ మాగబోదు
మారబోదు – మారబోదు
మాపంథా మారబోదు

వేలవేల విప్లవకారుల్ని
అమానుషంగా కాల్చిచంపినా
నాయకులనందర్నీ
జైళ్ళల్లో హింసలకు గురిచేసినా

పోలీసు బలగాల్ని
నిత్యం మాపై ఉసిగొల్పినా
ఆగబోదు – ఆగబోదు
మావిప్లవ మాగబోదు

విప్లవాన్ని కోరేది
కానేకాదు ఒక ప్రాణి
ఇది వేలవేల పీడితప్రజావాణి
లక్షలాది కార్మిక కర్షకభావం

కాదన్న వాజమ్మలను జేజమ్మలను
మేం – ఖాతరుచేయం
ఆరునూరైనా, నూరు ఆరైనా

మా గమ్యం చేరుతాం
మాగుండెల నిండున్నది
మార్క్సిజం – లెనినిజం
మాచేతున్నది – ఆయుధం
అది మావో ఆలోచనా విధానం

అరెస్టులకు ఆగిపోం
తూటాలకు బెదరిపోం
హింసలకు లొంగిపోం
త్యాగాలకు వెనుకాడం

మాకు బలం మహాజనం
మా మార్గం– పోరాటం
మా గమ్యం – సమసమాజం
ముమ్మాటికి .. ఇదే మా ఆశయం

ఆశయాన్ని త్రుంచలేరు
ప్రజాశక్తి నడ్డలేరు
అడ్డునిలచి బతకలేరు
ఇది తథ్యం – ఇది సత్యం

ఆగబోదు – ఆగబోదు
మా విప్లవ మాగబోదు
మారబోదు – మారబోదు
మా పంథా మారబోదు

# 12. విజయం తథ్యము

ఈవిశాల విశ్వంలో
ఎన్నెన్నో దేశాలు

కానీ ఎక్కడా
ఇన్ని మతాలు
ఇన్ని వర్గాలు
ఇన్ని పార్టీలు
ఇన్ని భాషలు

ఇట్టి పాలన
ఇట్టి ఆలన
ఇట్టి న్యాయం
ఇట్టి యంత్రాంగం
ఇంత స్వార్థం
ఇంత దోపిడీ

ఇంత అమానుషం
ఇంత రాక్షసం
ఏదేశంలోనూ
కనిపించదు
ఒక్క భారత
దేశంలో తప్ప
అయితే

ఈ బాధలు
ఈ దుఃఖం
ఈ బ్రతుకులు

కలకాలం
భరించలేరు జనం
మేల్కొంది నేడు
మండుతున్నతరం
అజేయమై నిల్చింది
వర్గపోరాటాన

అంతటా విప్లవాగ్నులు
నివురుగప్పివున్నాయి
తూర్పుగాలికి
రాజుకుంటున్నాయి
తిరుగుబాటుపొగలు
ఆకాశాన్నంటుతున్నాయి

దున్నేవానిదే భూమి
అందరికీ పని
అందరిదీ సంపద
అనే నినాదం
వేళ్ళూనింది జనంలో

ఉవ్వెత్తున ప్రజలు
ఉరుకుతున్నారు.
పోరాటమార్గంలోకి
తుపాకీ మొన మీద
సాముచేయటానికి
ఈ పెల్లుబికే వెల్లువచూచి
బూర్జువాపులులు
భూస్వామ్యవర్గాలు
దోపిడీమూకలు
వీరికి అండగా నిలచే
ప్రభుత్వయంత్రాంగం
బేంబేలు పడుతున్నాయి.

కసాయితనాన్ని సాగిస్తూ
విప్లవతరంగాన్ని కూల్చే
విఫలప్రయత్నాలు
ఎన్నెన్నో చేస్తున్నాయి
కానీ వారి ఆటలు సాగవిక
వాళ్ళేదో ఇంకా
కలలుగంటున్నారు
భ్రమలు పోతూనేవున్నారు

బూటకపు ఎన్నికలతో
సోషలిజం కబుర్లతో
రాజభరణాల రద్దుతో
బ్యాంకుల జాతీయాలతో
కులమత రాజకీయాలతో
ఇళ్ళస్థలాల పంపకాలతో
వృద్ధాప్యపు పింఛనులతో
వీధివీధి సారాడిపోలతో
స్టాకుల్లేని చౌకదుకాణాలతో
కుటుంబనియంత్రణతో

విప్లవశక్తిని, చేవను
నీళ్ళుకార్చవచ్చని
కానీ అదిజరిగేపనేనా
ఎన్నాళ్ళు ఊరుకుంటారు
భగ్గునమండే ప్రజలు

ఈతరంగం ఆపాలంటే అసాధ్యం
కొండను ఢీకొట్టటమే
సముద్రాన్ని ఔపోసనపట్టటమే
బడబాగ్నిని స్వేదంతో ఆర్పటమే

అందుకే అంటున్నాను
ఓటమితప్పదు
మీ దోపిడీవర్గానికి
విజయం తథ్యం
మా పీడితవర్గానికని

# 13. కదలిరండన్నా!

కదలిరండన్నా !
కలసిరండన్నా ! !
ఎన్నాళ్ళు ఈ బ్రతుకు
ఎన్నేళ్ళు ఈ గతుకు
సమత మమతాలేని
శ్రమఫలితమేరాని
అస్తుబిస్తూ బతుకు
పస్తులాబతుకు
వట్టిమాటల బతుకు
వెట్టిచాకిరి బతుకు
ఎన్నాళ్ళు ఈ బతుకు
ఎన్నేళ్ళు ఈ గతుకు
చావులాంటి బ్రతుకు
బతికి బతికి తుదకు
కుక్కలా చావొద్దు
ప్రజా సైన్యముచేరి
భావితరముల కొరకు
నెత్తుర్లు చిందించ
కదలిరండన్నా !
కలసిరండన్నా !!
కార్మికులు కర్షకులు
కలిసికట్టుగఉండి
కరకుగుండెలతోడ
కసిగాను ఉసిగాను
కదలి వచ్చిననాడు
ఎదుట నిల్చిననాడు
నిలుచునా దోపిడీ
మారదా బతుకు
కదలిరండన్నా !
కలసిరండన్నా ! !
ఎన్నాళ్ళు ఈ బతుకు
ఎన్నేళ్ళు ఈ గతుకు



# 14. తూర్పుగాలి

రివ్వురివ్వుమని
తూర్పుగాలివీచె
కొక్కొరొకోయని
తొలికోడి కూసె
ఎర్రజండా బట్టి
విప్లవాగ్నులు లేచె

అమరవీరుల కెల్ల
జోహారులర్పిస్తూ
మార్క్సిజం టానిక్కు
మరిమరీ సేవిస్తూ
చైతన్యశక్తితో
ఉగ్రూతలూగుతూ
మావో సుభాషితాల్
మదినిండ పండగా

కార్మికా కర్షకా
సంఘటితశక్తితో
అణువణువునందున
విప్లవం రగిలించి
ఒకబాటమీదుగా
జనసేన నడిపించి
పల్లెపల్లెలోన
ప్రజాపాలనకొరకు

రివ్వురివ్వుమని
తూర్పుగాలివీచె
కొక్కొరొకోయని
తొలికోడి కూసె
ఎర్రజండా బట్టి
విప్లవాగ్నులు లేచె



# 15. అరుణమార్గం

కదిలాయి ! కదిలాయి !
కొండలూ, కోనలూ !!
పల్లెపల్లెలోన
గుండెగుండెకదిలె

కులము మతము
కల్లయాయెను
పల్లె పట్టణం
ఒక్కటాయెను

మిల్లుకూలి
పల్లెరైతు
పథము కూడెను
చేయి కలిసెను

అమర వీరులు
కూర్చినట్టీ
అరుణమార్గం
దారిబట్టీ

పీడనింకను
సాగదంచు
దోపిడింకను
పొసగదంచు

ఒకేమనిషిగా
ఒకే శక్తిగా
వర్గపోరున
నిలచిపోర

కదిలాయి ! కదిలాయి !
కొండలూ, కోనలూ !!
పల్లెపల్లెలోన
గుండె గుండె కదిలే.

# 16. ఏరువాక

అన్నన్న రైతన్న
ఓ పేద రైతన్న
ఏరువాకొచ్చింది
సాగుచెయ్యన్నా

భూములూ కాదన్న, దున్నేదినీవు
భూస్వామ్యహక్కులూ
దున్నాలి నీవు ॥అన్నన్న రైతన్న ॥

వరినాట్లు కాదన్న, నాటేది నీవు
విప్లవాబీజాలు
నాటాలి నీవు ॥అన్నన్న రైతన్న ॥

నీటినీ కాదన్న, మలిపేది నీవు
పోరుకై జనతనూ
మలపాలి నీవు ॥అన్నన్న రైతన్న ॥

పైరులూ కాదన్న, పెంచేది నీవు
పోరాటపటిమనూ
పెంచాలి నీవు

ఎలుకల్ని కాదన్న
కూల్చేది నీవు
కంటకులనందర్నీ
కూల్చాలి నీవు ॥అన్నన్నరై తన్న ॥

పంటల్ని కాదన్న, కోసేది నీవు
దోపిడీ పీకలూ
కోయాలి నీవు ॥అన్నన్నరైతన్న ॥

గింజల్ని కాదన్న, రాల్చేది నీవు
పాలకుల పీఠాల్ని
రాల్చాలి నీవు ॥అన్నన్నరైతన్న॥

గాదెలూ కాదన్న,
నింపేది నీవు
మండేటి కడుపులా
నింపాలి నీవు ॥అన్నన్న రైతన్న॥

# 17. విప్లవకారుని ఉత్తరం



ఓ నా ప్రియమైన కామ్రేడ్స్
అందుకోండి నా రెడ్ శాల్యూట్

గాలీ వెలుతురూ రాని
శుచీ శుభ్రం లేని
పాలకుల గుండెలా
చీకటి నిలయాలైన
జైలుగోడల వెనుకనుండి
ఈ రక్తాక్షరాలు రాస్తున్నా
మన కర్తవ్యాన్ని
మీముందు అద్దంలోచూపుతున్నా!
దేనికిలే పేరు కామ్రేడ్స్
నేనొక రై తుకూలీ కుటుంబంలో వాడ్ని
బతుకుగతుకుల్లో
కంటికి రెప్పలా పెంచి
పెద్దచేశారు నన్ను
తమ రెక్కలకష్టాన్నీ
వంట్లో వేడిరక్తాన్నీ

రూపాయిలుగా మార్చి
కాలేజీచదువులు చదివించి
నన్నో మనిషినిగా తీర్చిదిద్దారు
ఎన్నెన్నో కలలుగన్న మా తల్లి దండ్రులు
యూనివర్సిటీ డిగ్రీ చేతబట్టుకొని
ఆనందంతో గంతులు వేస్తూ
అమ్మానాన్నల పాదాలముందు వాలి
మనకష్టాలిక గట్టెక్కాయని
ఓ ఉద్యోగం సంపాదించి
పువ్వుల్లో పెట్టి పూజిస్తానని
మంచివరుణ్ని చూచి
చెల్లాయిపెళ్ళి ఘనంగా జరిపిస్తానని
ప్రమాణం చేసినపుడు
ఆనందభాష్పాలు కనుకొనల జార
చిరునవ్వుతో అమ్మా నాన్నలు
పలుకరించుకున్న దృశ్యం
ఇప్పటికీ నాకింకా జ్ఞాపకముంది
కాని అందరిఆశలు అడియాసలయ్యాయి
తిరిగి తిరిగి కాళ్లైతే అరిగాయే కాని
ఉద్యోగం గగనకుసుమం అయిపోయింది
ఏమీ చెయ్యలేని దైన్యస్థితిలో
నిద్రాహారాలు వంటబట్టక

చిక్కి శల్యమైపోయాను నేను
నాయీ అవస్థచూచిన
తల్లిదండ్రుల హృదయాలు
శోకంతో బరువెక్కాయి
పల్లె పేరు ఏదంటున్నారా కామ్రేడ్స్
ఏ పల్లె అయితే ఏముందిలే
ఒకేలా వుంటాయి ఈ దేశపు పల్లెలన్నీ
సన్న సన్నని మురికిసందులు
చాలీచాలని పూరిపాకలు
పిల్లాపీచూ, గొడ్డూగోదా
సమస్తమూ అందులోనే
అలాంటిదే ఓ పూరిపాక మాది
ఇక మా జీవనమంటారా
మాతల్లిదండ్రుల రెక్కలకష్టం
చాలీచాలని కూలి
ఆకాశాన్నంటే ధరలు
నా చదువుకై చేసిన అప్పులు
వీటన్నిటినీ పరిష్కరించలేక
సతమతమయ్యే మేం
ఇలాగడచి పోతున్నాయి రోజులు



## ఓ ఉదయం

నాకింకా గుర్తుంది
మామూలుఉదయం కాదది.
క్రితం రాత్రంతా కునుకులేదు
కన్ను పొడుచుకున్నా కానరాని చీకటిరాత్రి
ఉరుములు, మెరుపులతో జోరుగా వర్షముకురిసిన రాత్రి
అతిభయంకరమైన రాత్రి
ఎలాగో గడిచిపోయింది
బాలభానుని నునువెచ్చని కిరణాల కాంతి
జీవితంలో కరువయిన శాంతి
పడకమీదనించి లేవదీశాయి
కాలకృత్యాలు తీర్చుకొని
ఓ పుస్తకంలో తలదూర్చి
అలా కూర్చుండిపోయాను
అంతలో మాఊరి భూస్వామినుండి
కబురువచ్చింది నన్ను అర్జెంటుగా రమ్మని
ఏదో కొంపమునిగిందే అనుకుంటూ
ఆదుర్దాగా బయలుదేరా

దారంతా వర్షపునీరు
గ్రామపంచాయతీ పుణ్యమాఅని
రోడ్డంతా గుంటలు
గుంటలనిండా మోకాలిలోతు నీరు
నీటిలో కేరింతలాడే పిల్లలు
పిల్లలచేతిలో కాగితపు పడవలు
తల్లుల అనునయింపు కేకలు
చెరువునీటికై వెళ్ళే పడతులు
మేతకై ఉరకలువేస్తూ పోయే పశు సంతతి
ఉత్సాహంతో పరుగులిడే వాటి సంతతి
పొలంపనులకై వెళ్ళే రైతుకూలీజనం
ఆహ్లాదకరంగా ఉంది ఆ ఉదయం
కనుచూపుమేరలో భూస్వామిభవనం
ప్రతిబింబిస్తున్నది భూస్వామి గర్వాన్ని
ఆయన ఆ గ్రామ సొసైటీ ప్రెసిడెంటు
ఆయనంటే ప్రజలందరికీ భయం
ఆయన సుగుణాలు అనేకం
అవన్నీ కథలుగా చెప్పుకుంటారు ప్రజలు చాటుమాటున
మనసులో కసినంతా వెళ్ళగక్కుకుంటారు
భవనం సమీపించాను నేను
గేటు తెరుచుకొని లోపల ప్రవేశించాను
ఎదురుగా భూస్వామి కొలువుతీర్చియున్నాడు.
ఆయనచుట్టూ వంధిమాగధగణము

ఓ నమస్కారబాణం వదలి నిల్చుండిపోయాన్నేను
ఆయనదృష్టి నాపై మరల్చాడు
పైకి క్రిందకుచూచాడు
"ఏమిరా నీచదువుకై మీనాన్న చేసిన బాకీసంగతి"
ఏమాలోచించారు – ఇచ్చేదా ? లేదా ? అన్నాడు
"ఏమిచెయ్యం బాబూ !
ప్రస్తుతం పరిస్థితి బాగాలేదు
మా సంపాదన తిండికే చాలడం లేదు.
నాకా ఉద్యోగం దొరక లేదు
కాస్త గడువిప్పించండి" అని అర్థించా
కాసేపు దీర్ఘంగా ఆలోచించాడు
నాపై ఓ చిరునవ్వు విసరి
మాసొసైటీలో గుమస్తాగిరి చేస్తావా అన్నాడు.
ఆనందంతో కృతజ్ఞతతో నమస్కరించి సరేనన్నా
పరుగెత్తుకుంటూ ఇంటివద్ద వాలి
అమ్మా నాన్నలకు విషయం చెప్పా
వాళ్ళూ ఆనందించారు
కనీసం బాకీఅన్నా తీరుతుందనుకున్నారు
మూడుసంవత్సరాలు కొలువుచేశాను నేను
తీరాచూస్తే ఏముంది?
సొసైటీ ధనమంతా స్వాహాచేశాడు ప్రెసిడెంటు
అధికారులకు లంచాలిచ్చి కేసు నాపై మోపాడు
నా ముసలి తల్లిదండ్రులు కాళ్ళావేళ్ళాబడ్డారు

వాళ్ళ మొర ఆలకించనే లేదు
కనికరం కూడా లేని పశువు
ఫలితం నాకు ఓ సంవత్సరము జైలుశిక్ష
మా పూరిపాక ఆ భూస్వామి స్వాధీనం
శిక్షానంతరం వచ్చి చూద్దునుగదా
నాదంటూ ఏమీ మిగల్లా మా గ్రామంలో
కనిపెంచిన తల్లిదండ్రులు
రోగంతో, రొష్టులతో, దిగులుతో
పోరాడి పోరాడి ఈ లోకాన్నే వదిలారు
ఇక పెళ్ళికై ఎదిగిన నా ముద్దుచెల్లి
భూస్వామి కామానికి క్రౌర్యానికి బలై పోయింది
ఈ లోకాన్ని శాశ్వతంగా వీడిపోయింది
విషయాలన్నీ విన్న నాహృదయంలో
అగ్నిగుండాలు ప్రజ్వరిల్లాయి
కాని ఏమిచేయగలను నేను
వాడా లక్షాధికారి.
వాడికి అండగా గుండాలు, పోలీసులు
వాడి ధనదాహానికి, ద్రోహచింతనకు
ఎంతమంది బలయ్యారో! మాబోటి అభాగ్యులు
గతమంతా కళ్ళముందు మెదిలింది
నాఊహ తెలిసినప్పటినుండి
వాడి పొలంలోనే పనిచేశారు మా తల్లిదండ్రులు
పగలంతా పొలంలో పని

రాత్రి వాడిఇంటివద్ద చాకిరి
ఇలా కష్టమంతా మాతల్లిదండ్రులది
సంపదా సుఖాలు అన్నీ వాడివి
తింటానికి తిండిలేదు మాకు
గుప్పెడు తిన్నా అరగదు వాడికి
ఏమిటీ ఈ వ్యాధికి మందు
ఎన్నాళ్ళిలా ఒకరినొకరు దోచుకోవటం
ఒకరి రెక్కలకష్టాన్ని మరొకరు
రూపాయలుగా మార్చుకోవటం
ఏమిటీ వర్గభేదాలు, కులమతాలు
ఎందుకిన్ని అంతరాంతరాలు మనిషికి మనిషికీ మధ్య
అందరికీ పని, తిండి ఎందుకు దొరకదు
ఒకడు అష్టైశ్వర్యాలతో తులతూగటం
మరొకడు నిష్టదరిద్రాన్ని అనుభవించటం
ఏమిటి పరిష్కారం? ఏమిటి ?
ఇలా ఆలోచనలతో దేశమంతా తిరిగాను
వెదకగా వెదకగా డాక్టర్లు దొరికారు
కామ్రేడ్ భాస్కరరావు, కామ్రేడ్ మల్లిఖార్జునుడు
మార్క్సిజమే దీనికి మందన్నారు
వర్గశత్రు నిర్మూలనమే దారన్నారు.
తుపాకిద్వారానే ప్రజారాజ్యం వస్తుందన్నారు
ఉత్సాహంతో పొంగిపోయాను

గతచరిత్రానుభవాలు చదివాను
మార్క్సిజం నాకు అనంతశక్తి నిచ్చింది
పీడిత ప్రజానీకంతో సంబంధాలు పెంచుకున్నా
దేశంలో కార్మిక కర్షక ఐక్యసంఘటన వర్ధిల్లింది
భూమికోసం, భుక్తికోసం పోరాటాలు తీవ్రమయ్యాయి
భూస్వాములకు దోపిడీవర్గాలకు సింహస్వప్నమైపోయింది
పోరాడే ప్రజలపై ఎన్నో కేసులు బనాయించారు
కోర్టులచుట్టూ విరామంలేకుండా తిప్పుతున్నా
ప్రజలకింకా వర్గకసి పెరిగిపోయింది
"వర్గశత్రు నిర్మూలన" అనివార్యమయింది
కార్యక్రమం అమలుచేస్తూ బయలుదేరాం
దానిలోని భాగమే దుర్మార్గుడైన మాఊరి భూస్వామి భరతం
అతని ఆస్తంతా గ్రామప్రజలు ఆనందంగా జప్తు చేశారు
లక్షలకొలది అప్పుపత్రాలన్నీ అగ్నికి ఆహుతయ్యాయి
పీడితప్రజానీకం కనులు ఆనందంతో మిరుమిట్లుగొల్పాయి
వాళ్ళే మాకు కొండంత అండ
వాళ్ళు గ్రహించారు మనపోరాటాలన్నీ ఎవరికోసమో
మాకష్ట సుఖాల్లో పాలుపంచుకున్నారు
మాకు శాయశక్తులా చేయూతనిచ్చారు
మేం కదలిపోతున్నాము పల్లెపల్లెకు
పోరాటజ్వాలలు పాకిపోతున్నాయి అంచెలంచెలుగా
ప్రభుత్వం, దోపిడీవర్గాలు హడలిపొయ్యాయి

వారి అరాచకాలిక సాగవనుకున్నారు
మాపై పోలీసు బలగాన్ని కిరాయి మూకల్ని ఉసిగొల్పారు
మా ఆచూకీకై – వేలకువేలు ధనాశచూపారు
ధనాశ మహాచెడ్డది ప్రపంచంలో
స్నేహితుల్ని, బంధువుల్నీ దూరంచేస్తుంది
ధనాశకు లోనయ్యాడు ఓ మిత్రద్రోహి
శత్రువర్గాలకు చేరవేశాడు మా ఆచూకీ
నిద్రలోఉన్న మమ్ము చుట్టుముట్టి బంధించారు పోలీసులు
జైళ్ళలోకుక్కి చిత్రహింసలు చేస్తున్నారు
మా తప్పులు ఒప్పుకోమంటారు
వారిదృష్టిలో, మా తప్పులేమిటో మరి
దోపిడీమూకల్ని, చీకటిబజారు జలగల్ని హతమార్చటమా
అయినా మనతప్పేముంది అందులో
వారిహింసలకు ప్రతిహింస జేశాం
హింసించటం తప్పుకానప్పుడు
ప్రతిహింస తప్పెలా అవుతుంది
సరే కానివ్వండి!
మీ న్యాయాన్ని మీ కోర్టులు అమలు చేయనీయండి
మా న్యాయాన్ని మేము, మా ప్రజాకోర్టుల్లో అమలుచేస్తాము
అని ప్రతిన చేశాం
అందుకే కామ్రేడ్స్ మీకీఉత్తరం
ఓ నా విప్లవసోదరులారా
పీడిత జనావళి సంక్షేమం కొరకు

ముందుతరాల భవిష్యత్తుకొరకు
మన రక్తాన్ని చిందిద్దాం
సమసమాజ స్థాపన చేద్దాం
ఎగురవేద్దాం విశ్వమంతా ఎర్రజండా
మరచిపోకండి కామ్రేడ్స్ మన ఈ కర్తవ్యం
మన త్యాగాలు ఊరికేపోవు
చావనేది ఎటూ తప్పదు



“పీడిత ప్రజలకొరకు చేసే త్యాగం మహోన్నతం”
గుర్తుంచుకోండి కామ్రేడ్స్ మన కర్తవ్యాన్ని
వర్గశత్రు నిర్మూలనమే మనమార్గం
మార్క్సిజమే మన ఆహారం

లెనినిజమే మనకు అనంతశక్తి
మావో ఆలోచనావిధానం మొక్కవోని మన ఆయుధం
గుర్తుంచుకోండి మైడియర్ కామ్రేడ్స్
మన గమ్యాన్ని మరచిపోవద్దు కామ్రేడ్స్.

# 1. బిడ్డవా నీవంది

తిండి తిప్పలు లేక
కట్ట బట్టయు లేక
నిలువ నీడను లేక
అల్లాడుచున్నట్టి పేదలను చూచి
ఏమెరుగనట్లున్న నను చూచి
బిడ్డవా నీవంది భరతమాత !

చదువు సంధ్యలు లేక
నీతి నియమము లేక
అదుపు పొదుపును లేక
తిరుగాడుచున్నట్టి సోదరుల చూచి
నిర్వీర్యుడైయున్న నను చూచి
బిడ్డవా నీవంది భరతమాత !

కట్టు బొట్టుయు లేక
వావి వరుసయు లేక
సిగ్గు బిడియము లేక
దనరుచున్న సోదరీమణుల చూచి
బిడియపడుచున్న నను చూచి
బిడ్డవా నీవంది భరతమాత

పృధివిలో తొడగొట్టి
ఘనత నొందిన మనదు
భరత తేజము నేడు
భగ్నమైపోవ – కనులార చూచి
మైమరచియున్నట్టి నను చూచి
బిడ్డవా నీవంది ! భరతమాత ! మే, 1965

# 2. కరిగిన కలలు

పరతంత్రం పోవాలని
స్వాతంత్ర్యం రావాలని
కన్నకలలు ఫలియించి
కళ్ళెదుటే కరిగిపోయె
ఇరువదేడుల పాలనలో
ఇక్కట్టుల డోలికలో

అరువు తెచ్చిన కోట్లు
ఎటు చూచినా లోట్లు
ఏమని చెప్పుదు బీదలపాట్లు
రోజురోజుకు అగచాట్లు
ఇరువదేడుల పాలనలో
ఇక్కట్టుల డోలికలో

అదుపులేని ధరలు
పొదుపులేని గిరులు
పీల్చివేచె ప్రజల
కూల్చివేచె బ్రతుకు
ఇరువదేడుల పాలనలో
ఇక్కట్టుల డోలికలో

# 3. పేక జీవితం

అర డజను జోకర్లుపడి
ఒరిజనల్ లేక ఆల్ కవుంటయినట్లు
పుష్కలంగా ధనముండి తగినంత శాంతిలేక
జీవితం వ్యర్థమైపోయింది.

కవుంటుకి కారణం జోకర్లు ఎక్కువయి –
పెయిర్స్ పూర్ అయినట్లు – అశాంతికి కారణం
ధనం ఎక్కువయి ఆప్యాయత తక్కువయింది.

జోకర్లతో ఒరిజినల్ కానట్లు
డబ్బుతో శాంతి చేకూరదు,
ఒరిజనల్ వుండి – ఒక్క జోకరుంటే చాలు
ఆట రక్తి కడుతుంది.
శాంతి వుండి కొద్ది ధనం వుంటే చాలు
జీవితం సఫలమవుతుంది.
ఆట ఆడుతున్నంతసేపూ ఆట గెలవాలని ఎంత పిచ్చో
జీవితం అనుభవించేకొద్దీ
శాంతితో తులతూగాలని
అంతే పిచ్చి అందుకే
జీవితానికి పేకాటకు
మరీ అంత పోలిక.

*"జయశ్రీ" మాసపత్రిక – 1968*



# 4. కరువు



దేశమంతా వచ్చింది కరువు

ప్రతి జీవికి అయ్యింది బతుకు బరువు

పొలానికి వేయలేదు రైతు ఎరువు

ఓ గుమస్తా చూస్తున్నాడు ఎవడిస్తాడా అని – అరువు

కుచేలుడు ఆలోచిస్తున్నాడు ఎలాగా అని బ్రతుకుతెరువు

అప్పులస్వామి కష్టపడి నిలబెట్టుకోవాలనుకుంటున్నాడు– పరువు

నిరుద్యోగి బ్రతుకు అయ్యింది పెద్ద కన్నీటి – చెరువు

రచనా కాలం – నవంబరు 1966

Note: నవంబర్ 1966 ఈ సంవత్సరం వర్షాలు లేక పంటలు పంటలు పండక రాయలసీమ కరువు అయిపోయింది ఈ బాధలు హరి గోడు వారిది ఆ సంఘటన ప్రేరణ

# 5. పావలా




కడుపు నిండా తిని
తిన్నది అరగక
కాలం గడవక
క్లబ్బులో మెట్టి
పేకముక్కలు
ముట్టి
ఒరిజనల్ సీక్వెన్సు లేక
ఆల్ కవుంట్లయి
పదులు విసిరివేసి
బయటపడ్డ పెద్ద మనిషి
నీరసంతో కాళ్ళీడ్చుకుంటూ
ఓ పర్లాంగు దూరం నడవలేక
దారిన వెళ్ళే రిక్షాను పిల్చి
శరీరాన్ని మెల్లగా చేర్చి
గుమ్మంలో దిగి
కడుపు నింపుకోటానికి
ఏనుగులాంటి మనుషులను
చచ్చీ చెడీ చెమటోడ్చి
పశువులా లాగే రిక్షా కూలీతో
పావలా కోసం
బేరమాడుతున్నాడు.
పెద్దలు గడ్డి తిని

పేదల కష్టాన్ని దోచి
ఆర్జించిన లక్షలు
ఖర్చయ్యే దారిగానక
ఒళ్ళు తిమ్మిరెక్కి
చినదాని కౌగిలిలో
తిమ్మిరి తీర్చుకుందామని
సానికొంపలో దొంగలా దూరి
ఏదో కాస్తంత ఆనందాన్ని బొక్కి
పదులు విలాసంగా విసరి
బయటపడ్డ పెద్ద మనిషి

కడుపునిండా తిండి లేక
కట్టుకోడానికి బట్టలేక
కన్న సంతానానికి
గుప్పెడు మెతుకులు పెట్టుకోలేక
బిచ్చ మెత్తటం తప్ప
గత్యంతరం లేని
నికృష్టపు స్థితిలో
దీనంగా ధర్మం చేయండని
అర్థించే అర్భకురాలిని చూచి
పావలా చిల్లర లేదని
దులపరించుకొని వెళ్తున్నాడు.
ఇదీ లోకం ! మార్చి 1969

# 6. నిరుద్యోగి ఉద్యోగం




ప్రతిరోజు ప్రతి పేపరు చూస్తున్నా.
కనిపించిన ఉద్యోగానికల్లా అప్లై చేస్తున్నా
గాలి మేడలలో పాగా వేస్తున్నా
పోస్టు మేన్‌కై కాపు కాస్తున్నా
ఆఫీసుల చుట్టూ తిరగలేక చస్తున్నా
నిరాశతో తిరిగి తిరిగి వస్తున్నా
ఇంట్లో వాళ్ళతో వేగలేక పస్తున్నా
గదిలోచేరి నిరుద్యోగ కవితలు వ్రాస్తున్నా

6 అక్టోబర్ 1969, మంచిలి

# 7. కొత్త మెరుగులు

రాతి యుగం నుండి
రాకెట్ యుగం దాకా
మారింది ప్రపంచం
ఇంకా మార్పు జరుగుతుందని తెలుసు
ప్రపంచం ఇంత మారినా
మనిషి బుద్ధి మారలేదేమోననిపిస్తుంది
మెరుగులు దిద్దుకున్న బుద్ధి
మారినట్లుగా గోచరిస్తుంది.
రాతియుగపు మానవుని బుద్ధి
కొత్త రంగులు తొడుక్కుంది –
రాతియుగపు మానవుడు
పచ్చి మాంసం తింటే
రాకెట్ యుగపు మానవుడు
పచ్చి నెత్తురు తాగుతున్నాడు –
రాతి యుగపు మానవుడు
క్రూరజంతువుల బారి నుండి
రక్షణకు జాగ్రత్త పడేవాడు –
రాకెట్ యుగపు మానవుని చుట్టూ
క్రూర దానవులే !

## రాతియుగపు మానవుడు

కడుపు నింపుకోవడం కొరకు
గడ్డి తినేవాడు, నేటి మానవుడు
జల్సాల కొరకు
గడ్డి తింటున్నాడు!
అందుకే అనిపిస్తూంది
రాతి యుగం నుండి
రాకెట్ యుగం వరకు
మారనిది మనిషి బుద్దేనని
అయితేనేమి
పాత రూపు గోచరం కాకుండా
కొత్త మెరుగులు దిద్దుకుంటుంది.

6 నవంబర్ 1969

# 8. ఉదయ గానం

పరతంత్రం పోవాలని
స్వాతంత్ర్యం కావాలని
స్త్రీలు పురుషులు భేదమెంచక
మానప్రాణము లెక్కగొనక
తెల్ల దొరల గుండెలదర
ఏకత్రాటిన ఎగసి నడచి
త్యాగధనము ధారబోసి
తెచ్చుకున్న ప్రజారాజ్యం

ప్రగతి బరువై స్థిరత కరువై
కలత పెరిగి కలలు కరిగి
కళ్ళ ఎదుటే కూలిపోయెను
మేలుకోరా ! మేలుకోరా !
మేలుకొని నీదేశ మేలుకోరా!
ఓ శ్రామికన్నా! ఓ కార్మికన్నా!

తిండి బట్ట లోటు లేక
ఒకరి నొకరు దోచుకోక
ఏలుకుందాం వేడ్క మీర
అన్న బాసలు వమ్ముజేసి
స్వార్థమునికి త్యాగమింకి
కష్టజీవుల రాతికండల
ఉక్కు గుండెల వేడినెత్తురు
పీల్చివేచిరి పిప్పిచేసిరి
గద్దెకెక్కిన పెద్ద మనుషులు
మేలుకోరా మేలుకోరా !

మేలుకొని నీదేశ మేలుకోరా !
ఓ శ్రామికన్నా ! ఓ కార్మికన్నా !

సత్య నిరతిని ఆశ్రయించి
దేశప్రగతిపై దృష్టినుంచి
ఆలుబిడ్డలు శ్రమలకోర్చి
కూర్చినట్టి దేశభాగ్యము
స్వార్ధపరుల పాలబడియె
మేలుకోరా ! మేలుకోరా !
మేలుకొని నీ దేశమేలుకోరా !
ఓ శ్రామికన్నా ! ఓ కార్మికన్నా!

దేశభాగ్యము మెక్కి మెక్కి
కండ్ల పొరలు కమ్మినట్టి
స్వార్ధమూకను చీల్చి చెండగ
తరుణ మాయెను
మేలుకోరా ! మేలుకోరా !
మేలుకొని నీదేశ మేలుకోరా !
ఓ శ్రామికన్నా ! ఓ కార్మికన్నా!

భరత జనని చల్లగుండగ
పాడిపంటలు ఇంట పొంగ
పిల్లపాపలు కనులనిండగ
ఆటలాడుతూ పాటపాడుతూ
శాంతి సుఖముల తేలియాడుతూ
భరత పౌరులు నడచు రోజులు
వేగవచ్చును మేలుకోరా !
మేలుకొని నీ దేశ మేలుకోరా !
ఓ శ్రామికన్నా ! ఓ కార్మికన్నా!

# 9. కదలి రండి – కలసి రండి

యువతులారా యువకులారా
భావి భారత పౌరులారా
కదలి రండి కలసి రండి

భరతావని భవితవ్యము
సుందరముగ నందనముగ
తీర్చిదిద్ద ఉప్పెనలా
కదలి రండి కలసి రండి
యువతులారా యువకులారా !

హలము పట్టి పొలము దున్ని
పంట పెంచి ఇంట చేర్చే
పేద రైతులు పూట గడవక
పస్తులుండుట రేబవళ్ళను
ఒళ్ళు గుల్లగ కండ కరుగగ

శ్రమలు చేసి సిరులు పెంచే
శ్రామికులకు పైస కరువై
రాళ్ళు గొట్టి ఇటుక పేర్చి
మేడ మిద్దెలు చెమట చిమ్మి
చేర్చి కట్టే కష్ట జీవులు
ఎండ వానల ఎండి తడచుట

ప్రజా సేవ పేరు చెప్పి
పదవి పట్టి ధనము పేర్చే
పెద్ద మనుషులు భోగలాలస
తేలియాడుట ఎందువలనని
ఎవరివలనని న్యాయదృష్టిని
ఎంచి చూడగ కదలి రండి
కలసి రండి యువతులారా
యువకులారా !

స్త్రీలు పురుషులు రెండే జాతులు
వర్ణ భేదము స్వార్ధ సృష్టి !
సత్యమరసి రూపుమాపగ
కదలి రండి కదలి రండి
యువతులారా యువకులారా !

ధనిక పేదను వర్గ భేదము
ఆది కలదె!
స్వార్థపరుల బెడద కాదె
తరచి చూచి కూల్చి వేయగ
కదలి రండి కలసి రండి
యువతులారా యువకులారా !

జగతియంతయు ఘనత నొందిన
భరత తేజము భగ్నమాయెను
కిం ! కర్తవ్యమ్మని సోమరులై
భీరువులై వెరవకండి
ధీరులై మేరులై, కేసరులై
కదలిరండి కలసిరండి
యువతులారా ! యువకులారా !

పరువు బరువు ధనము మనము
సర్వస్వమ్మును హరియించును !
పని లేదని వ్యసనమ్ముల
నేర్వ బోకుడు !
పని కల్పించుక దేశ భాగ్యము
పెంచి పంచుడు !
యువతులారా ! యువకులారా !

నాగరికత వ్యామోహము
వలదు మనకు ఫలము లేదు
ఇసుమంతయు నాగరికత
పేరు మీద చీట్లాటలు
సురాపానము స్త్రీ మోహము
దరిజేరకు !

నోట్లు చిమ్మెడి పెద్ద మనుషులు
ఓట్ల తోడుత నెగ్గు కొచ్చి
అసలు వడ్డీతో దేశ సంపద
దోచుకుందురు మనదు సంపద
మనదు కష్టము స్వార్థపరుల
నోట నుంచక త్యాగబుద్ధితో
ప్రజల దిద్దెడి మహాపురుషుల
చేతనుంచగ దీక్ష బూని
కదలిరండి కలసిరండి
యువతులారా ! యువకులారా !

రచనా కాలం : 13 ఏప్రిల్ 1970
'మాటకారి" మాసపత్రిక, 1 మే 1977

# 10. బతుకు

బతకండి బతుకును
బతుకుగా బతికి
బతుకును బతికించుకోండి
బతుకును పండించుకోండి




బతకనేర్చిన బతుకు బతికి బతికి
బతుకు మీద తీపి బతకకుండా చేసే
బతుకు బతకొద్దండి 5 జూన్

# 11. చాగంటి భాస్కరా

జోహారు భాస్కరా
చాగంటి భాస్కరా
మా బాధలే నీవి
మా గాధలే నీవి
మా బిడ్డవే నీవు
మా మనిషివే నీవు
మా కొరకు నీవు
పోరాడి నావు ॥జోహారు॥

మాలోన ఒకడివై
మము నడుపు సూత్రమై
మా గుండె వెలిగావు
మా అండ నిలిచావు
మా కొరకు నీవు
త్యాగాలు చేశావు ॥జోహారు॥

మా గుండె మండేటి
బడబాగ్ని వీవు
మా కనుల నిండేటి
వర్గ కసి వీవు
మా కొరకే నీవు
నెత్తుర్లు ఒలికావు ॥జోహారు॥
ఎఱ్రజెండా నెత్తి
ఎగురవేశావు
పోరాటమొక్కటే
దారని చాటావు

మా కొరకె నీవు
ప్రాణాలు ఒడ్డావు ॥జోహారు॥

నీవు నడిచిన బాట
నెత్తురొలికిన బాట
నీవు పలికిన మాట
విప్లవాగ్నుల మాట
నీవు చూపిన దీక్ష
మా కాశ్రయమ్ము ॥ జోహారు ॥

నీ బాటనే మేము
పయనమై పోతాము
నీ మాటనే మేము
కాపాడుకుంటాము
విప్లవశక్తినే
సమకూర్చుకుంటాము ॥ జోహారు ॥

"చాగంటి భాస్కరుడు" సంకలనం



# 12. అరుణ తారలు

ఆలోచనలు మస్తిష్కం నుండి బయల్పడి
ఆవేశం హృదయం నుండి పెల్లుబికి
అవాంతరాలు దాటుకుంటూ
అలలు అలలుగా వస్తున్నాయ్

కోట్లాది సంవత్సరాల పరిణామక్రమంలో
ఎన్నెన్నో వలయాల్లో నిరంతరం మారే సంస్కృతి
సంస్కృతిని పెనవేసుకొన్న సాహిత్య లతలు
సాహిత్య లతల చివర విచ్చుకొన్న చైతన్య మందారాలు
నా ఆలోచనలు
ఆ మందారాల అంగార వర్ణం నా ఆవేశం
ఆలోచనలూ – ఆవేశమూ ఒరుసుకొని
మధించబడి కుదించబడి
బయల్పడింది ఓ సమతాభావం
దానికి ఎవరి భాష్యం వారిది

తమ ప్రలోభాలకు అనువుగా మార్చుకొని
అసలు భావాన్ని మరచిపోయారు భాష్యకారులు
అందుకే భాష్యకారుల జోలికి పోవద్దు

నా భావాల్ని బాటలుగా దిద్దుకొని
అజేయంగా వెలుగునిస్తున్న అరుణతారల్ని చూడండి.
ఆ దీపాల కాంతిలో
ప్రయాణం సాగించండి. ఫిబ్రవరి 1976 – అరుణతార

# 13. లంగరు ఒదులుము

చాలు చాలును
లంగ రొదులుము
చావో రేవో
తేల్చుకుందాం
అలలు చూచి
భయమదేలా
వాలు చూచి
నడపవేల
తూర్పు దిక్కూ
అరుణమాయెను
చీకటేమో
పారిపోయెను

నీటి మెకముల
నరుక్కుంటూ
మెల్ల మెల్లన
సాగిపోదాం
కంటి కునుకు
తీసి నావో
సుడిని తగులు
నావ యేమో
ఒడ్డు చేరు
వేళ ఆయెను
ఓపికంతా
కూడగట్టుము.

“కొత్తపాళీ” ఈనాడు దినపత్రిక, మార్చి 1976



# 14.ఆరని మంటలు



ఈ మంటలు ఆరవు
తూర్పుగాలి జోరుగావుంది
ఈ నెత్తురు గడ్డ కట్టదు
లోపల ఎంతో వేడిగా వుంది
ఈ కత్తి తెగక మానదు
ఎంతో పదునుగా వుంది
ఈ జనత లేవక మానదు
రోజ రోజుకు కసిగా వుంది
ఈ వ్యవస్థ మారక తప్పదు
కుళ్ళి కంపుగా వుంది.
"కొత్తపాళీ" ఈనాడు దినపత్రిక
26జూన్ 1976

# 15. అమర సుధానిధి

జోహారు ! జోహారు , జోహారులమ్మా

అమర సుధానిధి –నీకు జోహారులమ్మా
స్నేహ సుధాలత –నీకు జోహారులమ్మా
స్నేహలతా రెడ్డి –నీకు జోహారులమ్మా

కలంపట్టి నాడు –కవితలల్లిన రేడు
రాగాల పట్టాభి– కరదీపికవు నీవు జోహారు

చిత్ర సీమకు ఎగసి –"సంస్కారము" న మెరసి
బహుమతుల నందిన –చిత్రచిత్రాని వీవు జోహారు
కళలు, సాహిత్యమ్ము –ఇంట వెలయించి
స్నేహ చంద్రికలిచ్చు –చంద్రవంకవు నీవు జోహారు

సృష్టిలో తియ్యనిది –స్నేహమని తలచి
స్నేహలతల పెంచి –సార్ధకత చెందావు జోహారు

పాలకుల పాపాలు–పండు కాలము వచ్చి
నిను పట్టి హింసించె–మృత్యువుకు గురిచేసె జోహారు






ఒక అమ్మ పాలనలో –ఒక తల్లి పొందిన
ఇడుమలకు గుర్తుగా –నిలిచి వెలిగేవు జోహారు

స్నేహసుధలు పంచ –ఏ లోక మరిగావో
నిను మరువలేనట్టి –జనత హారతులివ్వి
అరుణ హారతులివ్వి జోహారు

6 ఏప్రిల్ 1977

# 16. "మే డే"

నేడే ! నేడే ! మేడే! మేడే!
తరతరాల దోపిడిలో
నరనరాల రాపిడిలో
అణగారిన జనులంతా
అగ్నికణాలైన దినము నేడే ! నేడే !
చికాగోలో కార్మికులు
దోపిడిపై ధ్వజమెత్తి
శ్రమజీవుల నయనాల్లో
వెలుగురేఖలైన దినము
సకల దేశ శ్రామికులు
పోరుతల్లి బిడ్డలని
గుండె గుండె ఎరుపెక్కిన
అరుణోదయ మీనాడే నేడే ! నేడే !
ప్రజల పోరు గెలుచునని
దురాగతము సాగదని
పీడితప్రజ లొక్కటై
ఎర్రపిడికి లెత్తినరోజు నేడే ! నేడే !
సమసమాజ స్థాపనకై
అమరవీరు లందించిన
ఎర్రజండా ఎగిరినరోజు
చరితలోన చెరగనిరోజు నేడే ! నేడే !

"సాంఘిక వ్యవస్థ" పక్ష పత్రిక
1 మే 1977

# 17. ఏమి రాజ్యం

ఏమి రాజ్యం ! ఏమి రాజ్యం !
బతుకు పూజ్యం ! బ్రతుకు పూజ్యం !
పనియంటే చేయమంటరు
రూకలంటే కూక లిడుదురు
ఆకలంటే ఆలకించరు
పస్తులుండీ చావమంటరు || ఏమి ||

సోషలిజం తెస్తమంటరు
తిండిబట్ట ఇస్తమంటరు
పేకమేడల మాటలాయె
పేద బతుకులు బండలాయె || ఏమి ||

ప్రజారాజ్యం మనది అంటరు
హక్కులన్నీ ప్రజలవంటరు
కడుపునిండే మాటలాయె
కూడులేక చస్తిమాయె || ఏమి ||

కులము మతము కల్ల యంటరు
వర్ణ భేదము శూన్యమంటరు
వల్లమాలిన మాటలాయె
వల్లకాటి బతుకులాయె

గొప్ప చరిత మనది అంటరు
గొప్పలేమో దేముడెరుగు
అప్పులేమో గొప్పవాయె
తిరిపెగాండ్ర దేశమాయె ॥ ఏమి॥

రామరాజ్యం మనది అంటరు
రామరాజులు అడవికేగిరి
కోతిమూకలు పట్టమొందిరి
కొంపలార్పి కులుకుచుండిరి ॥ ఏమి॥

శాంతి పాలన మనది అంటరు.
బతుకు ఇచ్చట గొప్పయంటరు
అలవిమాలిన మాటలాయె
చీకుచింతల బతుకులాయె ॥ ఏమి॥

చూచి చూచి అలసినాం
వేచి వేచి రోసినాం
పోరుబాట నందుకుంటాం
చావో రేవో తేల్చుకుంటాం ॥ ఏమి॥

14 ఆగస్టు 1977

# 18. జనపథం

హింసతో ఏలే రాజ్యాన్ని
కూల్చాల్సింది
బూటకపు ఎన్నికలతో కాదు
జన చైతన్య స్ఫూర్తితో
గుప్పెడు మెతుకుల కొరకు
పోరాల్సింది
చెత్తకుండీలపై పందులతో కాదు
కొవ్వెక్కిన ధనస్వామ్యంతో
శ్రమఫలితం కొరకు
కట్టాల్సింది
కార్మిక సమ్మెలు కాదు
దోపిడీ వ్యవస్థ సమాధులు
దున్నేవానిదే భూమంటూ
చేయాల్సింది.
దేహి అని యాచన కాదు
భూదేవి విమోచన
పౌర హక్కుల కొరకు
జరపాల్సింది
సభలు సమావేశాలు కాదు
నిరంతర పోరాటాలు.

5 మార్చి 1978

# 19. పోరుదారి

అన్నన్న మాయన్న
ఓ మిల్లు కూలన్న
రాళ్ళు గొట్టేటన్న



నేత నేసేటన్న
కారు నడిపేటన్న
బండిలాగేటన్న
బరువు మోసేటన్న



దుక్కి దున్నేటన్న
నాట్లు వేసేటన్న



కలుపు తీసేటన్న
కోత కోసేటన్న
కుప్ప నూర్చేటన్న
పస్తులతో చావేల
పోరాడ రావేల
పోరాట మొక్కటే
దారనీ తెలియరా !
మాటలతో కడుపులు
నిండవని తెలియరా !
ఓట్లతో ఈ వ్యవస్థ
కూలదూ చూడరా !
ఏమి న్యాయంబిది
ఏమి పాల నమ్మిది
ఏమి రాజ్యం బిది

ఎవడబ్బ సొమ్మని
దోచి కులికేవని
పాలకుల నందరినీ
నిలవేసి అడగాలి
దోచినా సొమ్మంతా
రాబట్టి తీరాలి
దాచినా సంపదల్
కక్కించి తీరాలి
నక్క జిత్తులుపోతే
బుద్ధి చెప్పాలి
సంపదలు మనమంత
సమముగా పొందాలి
హక్కులన్నీ మనకు
భుక్తమై పోవాలి
దేశ ప్రజలందరూ
సుఖముగా మెలగాలి.
బిడియమేలన్న

భయము వీడన్న
పల్లె పల్లె ప్రజల
మండేటి గుండెల్లో
మన అన్నలున్నారు
మనకండ వచ్చేరు
మన కొరకు త్యాగాలు
చేయ నిలిచారు
పోరాట జ్వాలలు
రగిలించుతున్నారు.
వట్టి మాటలు కావు
కారుకూతలు లేవు
వారు నడిచేదారి
మార్క్స వేసిన దారి
లెనిన్ చూపిన దారి
మావో నడచిన దారి
ఎర్ర జండా దారి
అదె మనకు రాదారి

2 ఆగస్టు 1978

# 20. కబోదికి జవాబు

ఆలోచనకు ఆనకట్ట వెయ్యాలని
చైతన్యాన్ని చిత్రవధకు గురిచెయ్యాలని
తిరుగుబాటుని అధః పాతాళానికంటా తొక్కాలని

కల గంటూంది కిరాతకం – కాని
దీన్ని దహింపజేస్తూంది పోరాటాగ్ని
ఇదే రేపటి గెలుపుకి నేటి హామీ!

కళ్ళుండీ కబోదులున్నారు చూపు సారించరు
నోళ్ళు ముయ్యకుండా 'అరాచక మరాచకమం'టున్నారు
అరిచి అరిచి అణగారనీ, పూర్తిగా కళ్లు పొడుచుకోనీ!

రొమ్ములు బాదుకుని బాదుకుని చావనీ!
గీపెట్టనీ గోలెట్టనీ వదరనీ వణకనీ !
వారిది ఘోష ! మనది విజయ హయ హేష!

మరో ఝంఝ మారుతం

కవితా సంకలనం

అక్టోబరు 1980

# 21. చుక్కాని

కల్ల కపటము లేని
అడవి బిడ్డలందరూ
దోపిడీ పీడనల
నలుగు వారందరూ



శ్రమజేయుటే తప్ప
ఫలము ఎరుగనివాళ్ళు
కడుపు మంటలే తప్ప
కడుపు నిండని వాళ్ళు
సంఘాలు పెట్టుకొని
సభను జేద్దామని
ఇక్కట్లు పోయేటి
విధము విందామని
బాధలు తీరేటి
బాట నడవాలని
గూడేలు గూడేలు
గుంపులై రాగా
గోండు ప్రజలందరు
కదలియై పొంగ
భీతిల్లి దొరలంత
ఒక్కటై నిలిచి
పోలీసు బలగంతో
రాకాసి వోలె
లాఠీలు తూటాలు
కురిపించినారు
పిట్టలా చందాన
కాల్చేసినారు
నిండు ప్రాణాలెన్ని
పైకెగసి పోయెనో
ఎర్రనీ రక్తమ్ము
వరదలై పారెనో
పడమరా దిక్కున
సూర్యుడూ వాలె
ఇంద్రవెల్లిలోన
అన్నలూ ఒరిగిరి

ఒరిగినా అన్నలను
ఒడి చేర్చలేక
పోయినా ప్రాణాల్ని
తిరిగి తేలేక
కొండలూ కోనలూ
కన్నీరు కార్చె
గిరిజనుల గుండెలు
చిచ్చులై మండె
మండినా గుండెల్ల
అన్నలూ నిలచిరి
ఒరిగినా అన్నలకు
ఎర్రదండాలంచు
గుండెలూ వుప్పొంగ
కండ్లలో కసి నింద
కంట నీరొత్తుకొని
కన్నెర్రజేసిరి
పొరకలన్నల కూడి
పోరాడ నడచిరి
కొమరం భీంను దలచి
కొదమ సింగములైరి
తూటాలు లాఠీలు
పోరాపలేవనిరి

శ్రామికా రాజ్యమూ
సాధించు నందాక
బాధలూ తీరేటి
బతుకు పొందేదాక
ఎన్ని ఘోరాలైన
ఎదిరించుతామనిరి
ప్రాణాల కెరువకా
పోరాడుతామనిరి
ఎర్ర జెండొక్కటే
వెలుగు బాటనిరి
ఎర్ర జెండొక్కటే
బ్రతుకు బాటనిరి
పోరుబాటను నడవ
వెరపెందుకనిరి
వెరపు బ్రతుకెందుకూ
పనికి రాదనిరి
గోండు జనులంతాను
కొండగా నిలిచిరి
పోరు ప్రజలందరకు
చుక్కాని ఆ కొండ
ఎర్రనీ ఆ కొండ
ఇంద్రవెల్లి నేడు

విరసం కవితా సంకలనం "తుడుం" 1981

# 22. "చెరగని చెర"



తల్లి భారతి
చెరలు దీర్చ
"చారు" దారిన
సాగినావు

కష్టనష్టాల్
ఓర్చి నీవు
వర్గ కసివై
రగిలినావు

విప్లవిస్తే
జయం మనదని
యువతనేమో
నడిపినావు

విరసమంటే
నిగ్గుతేల్చి
కళం గళం
విప్పినావు
చిటికెవేస్తూ
చిందులేస్తూ
ప్రజాకళలను
ఎత్తినావు

ప్రజా సంస్కృతి
పాదు చేయ
పల్లె పల్లె
తిరిగినావు

జన విముక్తే
ధ్యేయమంటు
నెత్తురంతా
విత్తినావు

శ్రమగీతము
ఆలపించి
గుండె గుండె
రాజినావు

పోరుగుండెల
నింది నీవు
అరుణతారగ
వెలిగినావు

మార్గమేమిటో
మాకు చూపి
క్రాంతి దర్శిగ
నిలిచినావు.

రాడికల్ మార్చ్
10 జూలై 1982

# 23. చంద మామయ్య

మామయ్య మామయ్య చందమామయ్య
మా మాట వినవయ్య చందమామయ్య
పేదసాదలమయ్య చందమామయ్య
కష్టజీవులమయ్య చందమామయ్య
కల్లకపటం లేక చందమామయ్య
శ్రమలు జేసి మేము చందమామయ్య
సిరులు పెంచేమయ్య చందమామయ్య
జాతి వెన్నూ మేము చందమామయ్య
ఎన్ని చేసినగాని చందమామయ్య
ఏమి ఫలితము దక్కె చందమామయ్య
కూటికే కరువయ్య చందమామయ్య
గుడ్డకే కరువయ్య చందమామయ్య
నీడకే కరువయ్య చందమామయ్య
చదువు సంధ్యలు కరువు చందమామయ్య
ముప్పదేండ్లు గడిచె చందమామయ్య
తెల్ల దొరలు పోయి చందమామయ్య
నల్ల దొరలూ వచ్చే చందమామయ్య
వెతలు తీరనేలేదు చందమామయ్య
బ్రతుకు భారమ్మాయె చందమామయ్య
అగచాట్లకన్నిటికి చందమామయ్య
కారకులు పాలకులు చందమామయ్య
పాలకులు గాదయ్య చందమామయ్య

మాపాలి పీడకులు చందమామయ్య
అయిదేళ్ళకో మారు చందమామయ్య
ఓట్లడగవచ్చేరు చందమామయ్య
ప్రజల బాధలు చూచి చందమామయ్య
కన్నీళ్ళు పెట్టేరు చందమామయ్య
కల్లబొల్లి కబుర్లు చందమామయ్య
ఎన్నెన్నో జెప్పేరు చందమామయ్య
కల్లు సారా రూక చందమామయ్య
ఎరను వేసి మాకు చందమామయ్య
ఓట్లన్నీ గుంజేరు చందమామయ్య
సీట్లలో ఇరికేరు చందమామయ్య
గ్రూపులే కట్టేరు చందమామయ్య
పదవులే పట్టేరు చందమామయ్య
అసలు వడ్డీ తోడ చందమామయ్య
పోగేసుకుంటారు చందమామయ్య
ప్రజల గోడే వారు చందమామయ్య
ఆలకించరు చూడు చందమామయ్య
దేశదేశాలు తిరిగి చందమామయ్య
అప్పులే దెచ్చేరు చందమామయ్య
ప్రజలపై భారంగా చందమామయ్య
పన్నులే వేసేరు చందమామయ్య
ప్రణాళికలని వారు చందమామయ్య
ఎత్తులెన్నో వేశారు చందమామయ్య

కోటానుకోట్లయ్య చందమామయ్య
రూక లెద బెట్టారు చందమామయ్య
రూకలెటు బోయెనో చందమామయ్య
నూకలకే కరువయ్య చందమామయ్య
ఎన్ని ప్రణాళికలయిన చందమామయ్య
మా బ్రతుకు లిట్టానే చందమామయ్య
బుగ్గి అయ్యాయయ్యా చందమామయ్య
సోషలిజం అంటేను చందమామయ్య
పొంగిపొయ్యామయ్య చందమామయ్య
భరణాలు రద్దంటే చందమామయ్య
భళి భళీ అన్నాము చందమామయ్య
దున్నేవానికి భూమంటే చందమామయ్య
ఎగిరి గంతేశాము చందమామయ్య
అందరికీ ఇళ్ళంటే చందమామయ్య
ఆనందపడ్డాము చందమామయ్య
సంపదలు మనవంటే చందమామయ్య
సంతోషమందాము చందమామయ్య
ఆకాశవాణంతా చందమామయ్య
అరుపులే విన్నాము చందమామయ్య
పత్రికల నిండాను చందమామయ్య
రాతలే చూశాము చందమామయ్య
వేదికలా మీదనూ చందమామయ్య
కూతలే విన్నాము చందమామయ్య

మా బ్రతుకు పండునని చందమామయ్య
కలలెన్నో కన్నాము చందమామయ్య
కలలన్నీ కల్లాయె చందమామయ్య
వల్లంతా గుల్లాయె చందమామయ్య
చుక్కలంటే ధరలు చందమామయ్య
కడుపు మండే పనులు చందమామయ్య
పొదుపులేని గిరులు చందమామయ్య
దోపిడీ రాజ్యమూ చందమామయ్య
లంచాల రాజ్యమూ చందమామయ్య
పోలీసు రాజ్యమూ చందమామయ్య
ఎన్నాళ్ళు మేమిట్లు చందమామయ్య
బతుకు నీదేమయ్య చందమామయ్య
చూచిచూచి మేము చందమామయ్య
వేసారి పొయామయ్య చందమామయ్య
వేచి వేచీ మేము చందమామయ్య
వేగిపొయ్యామయ్య చందమామయ్య
విసిగిపోయిన మేము చందమామయ్య
ఒక బాటకొచ్చాము చందమామయ్య
చావో రేవో మేము చందమామయ్య
తేల్చుకుంటామయ్య చందమామయ్య
అందుకే పట్టాము చందమామయ్య
పోరుమార్గమ్మయ్య చందమామయ్య
చచ్చి బ్రతికిన మేలు చందమామయ్య
బ్రతికి కుడిచిన వేలు చందమామయ్య

– విరసం కవితాగోష్ఠి

# 24. ఉగాది

కోట్లాది పీడిత ప్రజల పునాదిన్నేను
చైతన్యతరపు ఉగాదిన్నేను
ఎన్నాళ్ళయిందో
నా శక్తిని నే తెలుసుకోలేక
ఇన్నాళ్ళు నా ఎర్రపిడికిలి బిగించనేలేదు.
నా గొంతును విప్పనే లేదు
ఇప్పుడు కోట్లాది గొంతులతో
నా సమరగానం వినిపిస్తా



నా ఎర్రపిడికిలి విప్పుతా
నా కండల్ని పెంచి
కొండల్ని పిండిచేస్తా
బంజర్లను సాగుచేసి
రాజనాలు పండిస్తా
పీడనను రూపుమాపి
ప్రజలకడుపు నింపుతా
అరుణారుణ కిరణాలతో
అందరి కపోలాలు సృజిస్తా
మనసు మనసుకు మధ్య
కారుచీకట్లను తొలగిస్తా
మనిషి మనిషిలో
సంపూర్ణ చైతన్యాన్ని నింపుతా
అణువణువునా

సమతామృతాన్ని ఒంపుతా
వర్గ చైతన్యంతో
భువినంతా స్వర్గమయం చేస్తా
ఆటంకాలను కూర్చే
వాజమ్మలను జేజమ్మలను అంతంచేస్తా
ఈ నా స్వర్గంలో
వ్యర్థ గీతాగానాలుండవు
రంకు రామాయణాలుండవు
బొంకు భారతాలుండవు
ఉన్మత్త భాగవతాలుండవు
అపర బాబా అవతారాలుండవు
కులమతాల మత్తులుండవు
వర్ణభేదాల అభేద్యగోడలుండవు
అన్నార్తుల ఆకలి చావులుండవు
నిరుద్యోగుల నిరాశలుండవు
ఆత్మాభిమానపు అమ్మకాలుండవు
ఆత్మహత్యలుండవు
అధికార ప్రాబల్యాలుండవు
ధనమదాంధత వుండదు
ఎర్రటోపీల వున్మత్తత వుండదు
కటకటాల కాఠిన్యా లుండవు
వీటన్నింటికీ నిలువనీడుండదు
మనుటకే తావుండదు
నా దేవలోకంలో

అందరూ అమృతమయులు

జరామరణ సంజయులు
అందరూ అందరే అజేయులు
నిష్కామకర్మ యోగులు
పరిపూర్ణ జ్ఞానులు
ఆడుతూ పాడుతూ పనులు చేస్తారు
అన్నదమ్ముల్లా మసలుతారు
చదువుసంధ్యలు చవిచూస్తారు
ఆనందాన్ని అమృతత్వాన్ని
ఎదనిండా పొందుతారు

అచ్చట

పతితులు – భ్రష్టులు
బాధా సర్పదష్టులు
రోగాలు రొష్టులు
అధికారుల అంతస్తులు
అరాచక రాజకీయాలు
బతకనేర్చిన బ్రతుకులు
బతకలేక చావులు
అర్థాయుస్సులు
అరమరికలు
ఒంగి ఒంగి సలాములు
ఒంటరితనాలు
నక్క వినయాలు
నయవంచకులు
వీటికి తావుండదు
ముమ్మాటికి వీలుండదు

నా స్వర్గంలో

స్వచ్ఛమైన మనస్సులు – చరిస్తాయి.

చందమామ వెలుగులు – విరుస్తాయి

బాలభాను తేజస్సులు – కురుస్తాయి

కోకిల గానాలుంటాయి

వసంత రుతువులుంటాయి

పచ్చని మనుష్యులుంటారు

కాని అచ్చట

కడుపు కక్కుర్తికి అమ్ముకునే మానాలు

సంసార సాగరాన్ని ఈదలేక పడే అవమానాలు

రాజకీయ నాయకుల ఉన్మత్త వాగ్దానాలు

పుణ్యం కోసం పాపులు చేసే దానధర్మాలు

ఆస్తులు అంతస్తులు పులుముకున్న ఆదరాలు

అంటరానితనపు మహారోగాలు

అవిద్య, అజ్ఞానపు గాయాలు

వీటికి చోటుండదు

పెరుగుటకే వీలుండదు

అచ్చట

అంతా అద్వైతమే

ద్వైతానికి తావుండదు

అంతా యోగమే

అదంతా భోగమే

అందరూ భోక్తలే

అది ఒక మహా యజ్ఞం

ప్రపంచమంతా వ్యాపించి
ఆ యజ్ఞఫలాన్ని పంచుతా
అణువణువునా సమంగా ప్రసరిస్తా
భువి నుండి దివి దాకా చరిస్తా
అంతటా నేనై నిలుస్తా
నేనే అంతటా వెలుస్తా

సూర్యునిలా వెలుగునిస్తా
తూర్పు పవనంలా ఆనందం కురిపిస్తా
వటవృక్షంలా సేద తీరుస్తా
అమృతాన్నంలా కడుపు నింపుతా
అవసరమైతే
అగ్నిలా దహించి వేస్తా
సాగరునిలా వుప్పొంగుతా
ప్రచండ వాయువులా చుట్టబెడతా
అజేయుడ్ని నేను
అజరామరుణ్ణి నేను
ముక్కంటిని నేను
ముల్లోకాల ఏలికను నేను
సమాజ సంపూర్ణ చైతన్యాన్ని – నేను
నేను – సంపూర్ణ సమసమాజాన్ని
కోట్లాది పీడిత ప్రజల పునాదిని నేను
చైతన్యతరపు యుగాదిని నేను

**ఉగాది / వెక్కిరించిన వేలిముద్ర – 1984**
**జులై, 2005**

# 25. ఓ పేద రైతా... ఓ కూలి రైతా

ఓ పేద రైతా ! ఓ కూలి రైతా !
ఆలుబిడ్డలు శ్రమలకోర్చి , స్వేదమెంతో ధారబోసి
నెట్టుకుంటూ దుక్కి దున్ని, కంపరాళ్ళు ఏరివైచి
ఆకు అలము ఎరువువేసి, సాలు సాలు తిరగతిప్పి
వాటమెరిగి నీరుమలిపి ,విత్తనాలు విసరి చల్లి
కంటి రెప్పగ పైరుసాకి
కలుపు మొక్కలు పెరికివైచి
చీడపీడల చేరనీయక
పంటకోసి నూర్చివేసి
షావుకారు ఇంటచేర్చి
అమ్మబోతే అడవి ఆయెనా
అప్పులేమో తీరవాయెనా
కన్న కలలు కరగిపోయెనా
అస్తుబిస్తు బ్రతుకులాయెనా
పస్తులతో చావులాయెనా
కిటుకు ఏమిటో తెలుసుకోర
కీలు తెలిసి వాత బెట్టిన
కరువు బరువు తీరిపోవును
చీకుచింతలు పారిపోవును
చీకటంతా తొలగిపోవును
తూరుపేమో ఎర్రబారును
వెలుగురేఖల బతుకు పండును. 2 సెప్టెంబర్ 1988

# 26. స్వగతం

వచ్చావా ఉగాదీ ! ఠంచనుగా
ఏమని పలుకను నీకు స్వాగతాన్ని
అయినా కాస్తంత విను నా స్వగతాన్ని
రైతన్నల శ్రమఫలితం
చేతికేమొ దక్కకుండా
వెన్నెముకలు విరిచేస్తే ॥ ఏమని పలకను ॥

కార్మికుల కష్టఫలం
కడుపులేమో నింపకుండ
కడగండ్లకు గురిచేస్తే ॥ ఏమని పలకను ॥

నేతన్నల మగ్గాలు
బ్రతుకు బండి నీడ్వలేక
ఉరితాళ్ళుగ మారుతుంటే ॥ ఏమని పలకను ॥

కూలినాలి జనం బతుకు
కుమిలి కుమిలి కనలి కనలి
కుంపటై మండుతుంటే ॥ ఏమని పలకను ॥

విషసంస్కృతి పడగవిప్పి
నగ్నంగా మానవతను

నడిబజార్లో హరిస్తుంటే ॥ ఏమని పలకను ॥

అశాస్త్రీయ విద్యేమో
జాతి ముద్దుబిడ్డలను
నిర్వీర్యం చేస్తుంటే ॥ ఏమని పలకను ॥
ప్రజాస్వామ్యం పేరుజెప్పి
గద్దెకొరకు నాయకులు
కుక్కల్లా వురుకుతుంటే

భూమి కొరకు భుక్తి కొరకు
జనసంస్కృతి పెంపుకొరకు
పోరన్నలు రాలుతుంటే ॥ ఏమని పలకను ॥

ఉగాది కవితాగోష్ఠి – 2007
నాగార్జున విశ్వవిద్యాలయం నిర్వహణ

## 27. బతకాలిగా!

మా చేతులు ఖాళీగా వున్నాయి
పనిచేయటానికి లేదా పనిలేకుండా
చేసినవాళ్ళ పని పట్టడానికి
తప్పదు మరి
బతకాలిగా అందరం !
చినుకు మాసపత్రిక – 2007



# 28. తల్లి భాష

తెలుగు జాతి పౌరులారా
తెలుగు భాష మరువకండి
తెలుగు భాష పలుకరండి
తెలుగు భాష చదవరండి
మాతృభాష పరిరక్షణ
మనందరి కర్తవ్యం.

సర్వధారి సాక్షిగా
ఈ ఉగాది బాస చేసి
కదులుదాం ! కలసిరండి !

తెలుగు భాష కమ్మదనం
తెలుగు జాతి ఔన్నత్యం
దశదిశలా ప్రాకాలి

శిరమెత్తి తెలుగుతల్లి
వెలుగులెన్నో విరియాలి
క్రాంతిపూలు పూయాలి.

సర్వధారి సాక్షిగా
ఈ ఉగాది బాసచేసి
కదులుదాం ! కలసిరండి!

తరతరాల తెలుగుభాష
తరగనిదని తెలియండి
తెలుగు కీర్తి ఇనుమడింప
తెలుగుదనం పరిమళింప
తెగువ చూపి రారండి
తెలుగు చరిత చాటండి.

సర్వధారి సాక్షిగా
ఈ ఉగాది బాసచేసి
కదులుదాం ! కలసిరండి!

అన్య భాషల మోజులొద్దు
అమ్మ భాషను మరువవద్దు
ఎన్ని సిరులు కూడబెట్టిన
మాతృమూర్తికి దీటురావు
ఎన్ని భాషలు నేర్చుకున్న
తల్లి భాషకు సాటిరావు.

సర్వధారి సాక్షిగా
ఈ ఉగాది బాసచేసి
కదులుదాం ! కలసిరండి !!

**ఉగాది కవితాగోష్టి – 2008**
**నాగార్జున విశ్వవిద్యాలయం నిర్వహణ**

# 29. తెలుగు – వెలుగు

తీయతేనియ లొలుకు
మన తెలుగు భాష
తరతరాల నాడె
వాసికెక్కిన భాష.
ఆదికవి నన్నయ్య
తీర్చిదిద్దిన భాష
తిక్కన కందాల
విందుచేసిన భాష
శ్రీనాధు సీసాల
తీర్థమాడిన భాష
పోతన్న భక్తిలో
ముక్తి నొందిన భాష
రాయల కొలువులో
రాణకెక్కిన భాష
మొల్లమ్మ మెచ్చిన
ముచ్చటైన భాష
అన్నమయ్య పదములా
అందమొలికిన భాష

త్యాగయ్య గానాన
పరవసించిన భాష
వేమన్న యోగియై
నీతి చెప్పిన భాష
ముద్దుపళని నోట
ముద్దులొలికిన భాష
ఆదిభట్ల దాసు
ఎరుకచేసిన భాష
గురజాడ జాడలో
ప్రగతి గాంచిన భాష
విశ్వనాథుని ఎడద
వేయిపడగల భాష
శ్రీశ్రీ కవితలో
కదం తొక్కిన భాష
దేశ భాషలందు
లెస్సయిన భాష
భాషలందున వెలుగు
మన తెలుగు భాష

5 ఏప్రిల్ 2008

## 30. చిన్నతనమే చాలు

జీవితం అంటే తెలియని వయసులో
పది మందితో కలిసి తిరుగుతూ
ఆటలు ఆడుతూ పాటలు పాడుతూ
అమ్మ ఒడిలో తల దాచుకుంటూ
నాన్న ప్రేమామృతాన్ని గ్రోలుతూ
సోదరుల వాత్సల్యములో మునుగుతూ
సోదరీమణుల ప్రేమల తేలుతూ
పెద్దల మధుర వాక్కుల ఆనందిస్తూ
హాయిగా ఆనందంగా గడిచింది
అదంతా చిన్నతనము

జీవితమంటే తెలుసుకున్న తరువాత
పదిమందితో కలిసి తిరగాలంటే బాధ్యతల బరువు
ఆటపాటల పొద్దు పుచ్చుదామంటే
సంసారపు సాధక జ్ఞాపకాలు
అమ్మ ఒడిలో తలదాచుకుందామంటే
అర్ధాంగి రుసరుసలు, విసవిసలు
నాన్న ప్రేమామృతం గ్రోలుదామంటే



నాన్నా అంటూ తయారు చంటోడు
సోదరుల వాత్సల్యములో మునుగుదామంటే
వదినల బెడద
సోదరీమణుల ప్రేమల తేలుదామంటే
బావల గోడు
పెద్దల మధుర వాక్కుల ఆనందిద్దామంటే
రాజకీయాల కంపు
నరకంలా గడుస్తుంది జీవితం
ఇదంతా పెద్దతనం

అందుకనే
ఈ పెద్దతనము
వద్దురా భగవంతుడా
చిన్నతనమే చాలు
నా కంటున్నా. **18. 9. 1969. మంచిలి**

# 31. అదృష్టవంతులు

అదృష్టవంతులు మీరు
చీకటిని ప్రేమిస్తారు
వెలుతురుకు భయపడతారు
మీ స్వార్థానికి రాస్తా వేసి
మీ త్యాగానికి తాళము వేసి
పాపం! ఏమీ ఎరగనట్లు
బహు దొడ్డమనుషుల్లా
చెలామణి అవుతున్నారు
అదృష్టవంతులు మీరు
జ్ఞాని సర్వత్రా ఈశ్వరుని
గాంచినట్లు
మీరు మీ ప్రతి కర్మలో స్వార్థాన్ని
చూస్తారు
మాకు అదీ చేత కాదు
ఇది అంతకంటే చేదు
అందుకే ఈ నిర్భాగ్యపు
బ్రతుకులు

జ్ఞాని ప్రేమతో అంటాడు
'అంతా మాయ'
ఉన్నదొక్కడే ఈశ్వరుడు
చూడు ఈశ్వరుని సర్వత్రా
పొందు శాంతిని, ఆనందాన్ని
అని
మీరు అంటారు
ప్రపంచమంతా స్వార్థము
భార్య లేదు, బిడ్డ లేదు
నీ సుఖము నువ్వు చూసుకో
ఎదుటి వానికి సుఖము కొరకు
ఏమాత్రము పాటుపడ్డా
నీ సుఖము తరిగిపోతుందని
మాకు ఎటు నడవడానికి
కాళ్లు రావటం లేదు
మా నిర్భాగ్యం! ఏమిచేస్తాం
అదృష్టవంతులు మీరు

8. 12. 69. మంచిలి

## 32. నిరీక్షణ

యుగయుగాల నుండి
శాంతి కోసం కాంతి కోసం
జరుగుతూనే ఉంది
పోరాటం

పురాణ పురుషులు
పుణ్యపురుషులు
అందరూ అందుకే

తమ జీవితాలను
అర్పించారు
రాచ బాటలు నిర్మించారు
వెలుగులు నింపి
వెళ్ళిపోయారు

ఎవరికోసం?
తమ స్వార్థానికా?
కాదు! కాదు!
భవిష్యత్ తరాల కోసం

ఆ వెలుగు బాటల
నడిచే నాథుడే లేక
పుస్తకాలలో
మూలుగుతున్నాయి.

అందరం, అంధకారంలో
అయోమయంలో

ముళ్లపొదల మధ్యన
క్రూర జంతువుల సరసన

బాధలతో, గాథలతో
కన్నీళ్లతో
ఆనంద మెరుగక
పయనిస్తున్నాం.

ఇన్ని వ్యథల పాలెందుకు
వెలుగు బాట నందుక
నడుద్దామని
సోదరులారా రండి
వెలుగులోకి పోదామని
ఎలుగెత్తి పిలిచినా
ఒక్కడూ రాడు

అథవా ఎవడైనా వచ్చినా
వాడు చివరంటా ఉండడు.
ఒక్కొక్కరు ఒక్కొక్క
మజిలీలో
చల్లగా జారుకుంటున్నారు
పస్తులున్న ఒంటికి

పంచభక్ష్యాలు రుచించనట్లు
క్షణం క్షణం

బాధామయ జీవితాలు
వెల్ల మార్చు సోదరులకు
వెలుగు బాటలు
వెగట నిపించి

భాషా వాదాలతో
కులమతాల తత్వాలతో
ప్రాంతీయ భేదాలతో

సమస్యలతో, ఘర్షణలతో
తేలియాడుతూ
తమ కంటిని తామే
పొడుచుకుంటున్నారు
వాళ్ళలోని మానవుని
మొదలంటా ఖూనీ చేసి
దానవుని
నిలుపుకుంటున్నారు

అయినా ఫర్వాలేదు
సుఖంగా సంతోషంగా
బ్రతుకులు వెళ్ళ మారిస్తే
అదే పదివేలు

లేదు– అదీ లేదు
వాళ్లకు వెలుగుబాటన
నడిచే ఓపికా లేదు
చీకటి మార్గాన
నడిచే ధైర్యం లేదు

వెలుగున రాలేక
చీకటిన దారి గానక
సతమతమయ్యే
నా సోదరుల చూచి
కన్నీరు విడవటం తప్ప
నేను
చేయగలిగిందేమీ లేదు

అయినా,
వాళ్ళు ఏనాడో ఓనాడు
ఈ వెలుగు బాటల
వస్తారనే ఆశమటుకు
నాలో చావలేదు.

ఏనాడు అనే దానికి
సమాధానం
కాలమే చెప్పాలి మరి!
అప్పటివరకు
ఈ నిరీక్షణ తప్పదు మరి?

***జూన్ 1969***

# 33. వస్తున్నా! వస్తున్నా!



వస్తున్నా! వస్తున్నా! వస్తున్నా!
మీ ఎడద తంత్రులు మీటగా
మీలో శాంతి బాటలు నాటగా
మీ కల్మష ప్రవృత్తికి వేటగా
ఇదే ఇపుడే వస్తున్నా! వస్తున్నా!

అభ్యుదయ భావాలు సంతరించుకొని
విశ్వ సౌభ్రాతృత్వాన్ని ఎద నిండా నింపుకొని
నాలోని రాగద్వేషాలు చంపుకొని
వచన కవితా రీతులు పుంజుకుని
వేగమే! వేవేగమే! వస్తున్నా! వస్తున్నా!

నాస్తికుడైన, ఆస్తికుడైనా

ధనికుడైనా,పేద అయినా
స్త్రీ అయినా, పురుషుడైనా
ఎవరైనా, ఏమైనా పర్వాలేదు
త్వరగా, త్వరగా వస్తున్నా! వస్తున్నా!

కానీ, ఓ చిన్న షరతు
మీరు ఆమోదిస్తే చాలు
కనీసం భేషరతు గానైనా

మీ హృదయ తంత్రులను మీటగలను
హృదయం అనేది మీలో ఉంటే
శాంతి కలిగించగలను
ఏమాత్రం కాంక్ష మీలో ఉన్నా
మీ గృహాన్ని ఆనందసీమగా మార్చగలను
ఏమాత్రము ప్రేమభావం మీలో ఉన్నా
వడి వడిగా వస్తున్నా! వస్తున్నా!

*21. 12. 69. మంచిలి*

# 34. సోదర భారత వీరా!

సోదర భారత వీరా!

ముందుకు సాగి రారా
శక్తికొలదీ పోరా
వైరి వీరులు పారా ॥సోదర॥

మనదు పచ్చను చూచి
పొరుగు కనులు వాచి
విషపు కోరలు చాచి
సరిహద్దులు కాచే ॥సోద॥

మానవత్వము వీడి
భాతృభావము వాడి
చేశారు మనపై దాడి
ఆత్మరక్షణే మనకు పాడి

జాతి జాతి కూడి
ఏకకంఠమున పాడి
శత్రుమూకల దాడి
తిప్పికొట్టుట పాడి
॥సోదర॥

వెన్న మనసు కరుకై
బుద్ధిబలము చురుకై
దేశరక్షణ కొరకు
వైరిబలముల నరకు।సో॥

చేసింది శత్రువు తప్పు
తెలియజేయాలి రాబోవు
ముప్పు
చేయాలి వెంటనే
కనువిప్పు
అప్పుడే సర్వజనులు
మనల నొప్పు ॥సోదర॥

*Note: 1964 వ సంవత్సరం పాకిస్తాన్ సోదరవాత్సల్యం వీడి హిందూదేశముపై యుద్ధానికి తలపడిన సంఘటన ప్రేరణతో*

# 35. పాపాయి

పుట్టింది పాపాయి
మా ఇంట మహాలక్ష్మి
వెలసిందా నేటికని
మురిసిపోయితిమి.

నవ్వింది పాపాయి
పాపాయి నవ్వులా
వెండి వెన్నెల తడసి
సంతోష మొందితిమి.

నడిచింది పాపాయి
పాపాయి నడకలా
తప్పటడుగులు చూచి
తబ్బిబ్బు పొందితిమి.

పలికింది పాపాయి
పాపాయి పలుకులో
పసిడి ఊహలు గాంచి
ఆశ్చర్యమొందితిమి.

ఆడింది పాపాయి
ఆటలో పాపాయి
ఆనందమును చూచి
జోలలాడితిమి.

పాడింది పాపాయి
పాపాయి పాటలో
గానమాధుర్యమునకు
పరవశము చెందితిమి.

చదివింది పాపాయి
చదువులో పాపాయి
తెలివితేటలు చూచి
తేలిపోయితిమి.

ఎదిగింది పాపాయి
వాసంత లక్ష్మిలా
వన్నె కెక్కుట గాంచి
వరునికై వెతికాము.

వధువాయె పాపాయి
పాపాయి వరునికై
కట్నకానుకలు పోసి
డస్సి పోయితిమి

# 36. పాప



మా పాప నవ్వులు– మల్లె పూవుల్లు

మా పాప మాటలు–ముద్దు మూటల్లు

మా పాప ఆటలు–ప్రగతి బాటల్లు

మా పాప కనులు–కాంతి రేఖల్లు

మా పాప ప్రశ్నలు–చిలిపి ఊహల్లు

మా పాప చేష్టలు–నవ్వుల జల్లుల్లు

# 37. కాంక్ష

నవ్వులు...
వెన్నెల...
చెలి నవ్వులు...
చల్లని వెన్నెల...

వెన్నెల చీరిక లాంటి
నవ్వులు
నవ్వుల కుప్ప లాంటి
వెన్నెల

చెలి నవ్వులలో వాడి ఉంది
చల్లని వెన్నెలలో వేడి ఉంది

చెలి నవ్వులకు తనువంతా
పులకరించింది
చల్లని వెన్నెలకు
విశ్వమంతా ఒళ్ళు
విరిచింది
చెలి నవ్వులు మధురిమల
కైవారము

చల్లని వెన్నెల గతస్మృతుల
భారము

చెలి నవ్వులలో అనవసరము
చల్లని వెన్నెల
చల్లని వెన్నెలలో కావాలి చెలి
నవ్వులు

అందుకే చల్లని వెన్నెల కంటే
చెలి నవ్వులే కోరతాను నేను.

***మే 1965 లేపాక్షి***

## 38. ఓ చెలీ! రా చెలీ!

ఓ చెలీ! రా చెలీ! నా చెలీ!

ప్రణయ పథమున
ప్రకృతి రథమున
హాయిగా తీయగా
పయనమై పోవుదాం
రా చెలీ! ఓ చెలీ! నా చెలీ!

తరుల నీడన
పూలబాటన
ప్రేమ గాలులు పీల్చుకుంటూ
మెల్లమెల్లన సాగిపోదాం
రా చెలీ! ఓ చెలీ! నా చెలీ!

నీవు గీతం పాడుతుంటే
నేను లయను కూర్చుతుంటే
ప్రేమ దేవత పూలవర్షము చల్లుతుంటే
స్వర్గధామం చేరుకుందాం.
రా చెలీ! ఓ చెలీ! నా చెలీ!

ప్రేమ కంటెను పెన్నిధేది
పెదవి కంటను మధుర మేది
తోడు లేకను సాగదేది
రా చెలీ! ఓ చెలీ! నా చెలీ!

స్వర్గధామం మేరలో
మధుర ప్రేమ తీపిలో
సోలి తూలి సమసి పోదాం
రా చెలీ! ఓ చెలీ! నా చెలీ!

పరిధి కలిగిన దేహమియ్యది
పరిధి లేని ప్రేమలోకం
త్వరితగతిని చేరుదాం
రా చెలీ! ఓ చెలీ! నా చెలీ!

నేడు రేపు కాదు ఎప్పుడు
గడిచిపోయిన రాదు మరల
ఆయువల్పము నిత్య సత్యం
రా చెలీ! ఓ చెలీ! నా చెలీ!

కాలయాపన చేయుటెందుకు
గడచినాక వగచుటెందుకు
ఆలసింపక సాగు ముందుకు
రా చెలీ! ఓ చెలీ! నా చెలీ!

# 39. మాటాడబోకే

మాటాడబోకే మాటలా మధువులు
ఒలకబోతే చెలీ తరుగునేమో
మధువు నీ అధరమందున



చూడబోతే చూపుల కాంతులు
కురువబోకే చెలీ తరుగునేమో
వెలుగు నీ ఓర చూపులో

నడవ బోకే నడకలా నాట్యాలు
వలకబోకే చెలీ తరుగునేమో
జవము నీ పసిడి మేనులో

## 40. బాల

అందీయవే బాల
అందియవే మోవి
అధర సుధను గ్రోలి
అమృతుడనే నౌదు



చిందించవే బాల
చిందించు చిరునవ్వు
మనసు నూయల లూప
నే తెలియాడుదు

కురిపించవే బాల
కురిపించు ప్రేమల
నే తడసిపోయి
నీ గుండె దాగుందు

కౌగిలీయవే బాల
బిగియార నామేను
నీలోన నే కరిగి
అణువణువు నేనౌదు

మాటాడవే బాల
మాటలా ముత్యాలు
గొంపోయి నేను
ధనవంతు నేనౌదు

చిలకరించవే బాల
చిలకరించు సుధలు
మెల్లమెల్లన గ్రోవి
స్వర్గాల నే నుందు.

# 41. సఖియ

సఖియ
నీవు చూచిన చూపు
నా మనసునే వేపు
స్వాంతమును బాపు.

చెలియ,
నీదు ప్రణయకు దారి
చేసింది నను చోరి
వేసె మన్మధు బారి.

లలనా
నీవు నవ్విన నవ్వు
సువాసనల రువ్వు
చేర్చే నను నీకు దవ్వు.

మధుర,
నీదు మోవి తీపి
సర్వదుఃఖముల బాపు
హృదయ లోతుల చూపు.

మగువా
నీవు ఆడిన మాట
నాదు హృదయపు
మూట
ప్రేమ రాజ్యపు బాట.

ప్రియ,
నీది కౌగిలి తాపు
మనసు నూయల లూపు
కోటి సౌఖ్యములు చూపు

# 42. నా చెలియ

నిండు పున్నమి వెలుగు
నా చెలియ మనసు

గండు కోయిల పిలుపు
నా చెలియ పలుకు

పువ్వు రేకుల సొగసు
నా చెలియ తనువు

మెరుపు తీవెల తలుపు
నా చెలియ నగవు

ప్రేమ చూపుల తొనలు
నా చెలియ కనులు

కటికి చీకటి కొనలు
నా చెలియ కురులు

*10.3. 1965. లేపాక్షి*

# 43. చినదానా! హై చినదానా!

కొత్త చీర కట్టుకొని
మల్లెపూలు పెట్టుకుని
నీవు జోరుగా పోతుంటే
నా మనసంతా పులకరించె
చినదానా, హై చినదానా!

కులుకులతో ఊరించి
నవ్వులన ఉసిగొల్పి
అందినట్లే అంది
అందకుండెద వీవు
చినదానా, హై చినదానా!

చిలుకలా పలికేవు
హంసలా నడిచేవు
ఓరచూపుల తోడ
తనువంతా పొడిచేవు
చినదానా, హై చినదానా!

మరుని శరముల కాచి
గుండె కోరికలు దాచి
దూర దూరముగా నీవు
ఎన్నాళ్ళు తిరిగేవు.
చినదానా, హై చినదాన



# 44. వనితా లోకం

వనితలు వనితలు వనితలు
వసుధన మమతల గుళికలు
పురుషుల బ్రతుకుల మధువులు

చూపులు చూపులు చూపులు
వనితల వంకర చూపులు
పురుషుల బలిమికి తూపులు

పలుకులు పలుకులు పలుకులు
వనితల తియ్యని పలుకులు
పురుషుల ఎదలకు చెణుకులు

నడకలు నడకలు నడకలు
వనితల నాట్యపు నడకలు
పురుషుల మనసుల చిలుకలు

కులుకులు కులుకులు కులుకులు
వనితల వలపుల కులుకులు
పురుషుల తనువున పులకలు

మమతలు మమతలు మమతలు
వసుధన వనితల మమతలు
హిమశిఖరపు వెలుగులు

తళుకులు తళుకులు తళుకులు
వనితల మేనున తళుకులు
పురుషుల యవ్వన కొలుకులు

*2.1.1970, మంచిలి*



# 45. ఇదే నా భరతదేశం

రామచంద్రుడాది రాజాధిరాజులు
సత్య హరిశ్చంద్రుడు ఆది సత్యవ్రతులు
పొలుపారనేలిన భరతదేశం
ఇదే నా భరతదేశము

వ్యాస వాల్మీకాది రుషివరేణ్యులు
నన్నయ తిక్కన పోతనాది కవులు
జనన మందిన భరతదేశము
ఇదే నా భరతదేశము

సీత సావిత్రాది పతివ్రతామ తల్లులు
బుద్ధ గాంధీ ఆది అహింసా మూర్తులు
ఒనరగకన్న భరతదేశం
ఇదే నా భరతదేశము

హంపి అమరావతి శిల్పకళాఖండాలు
కాశీ రామేశ్వరము కాళహస్తి పుణ్యక్షేత్రాలు
వెలసిన భరతదేశము
ఇదే నా భరతదేశము

శ్రీశైల తిరుమల ఉన్నతగిరిలు
గంగ కృష్ణ యమున మహనీయ నదులు
పొసగు భరతదేశము
ఇదే నా భరతదేశము

## 46. ఎందుకు ఈశ్వరా ! ఎందుకు ?



ఈ జగతిన అందము సృష్టిస్తావు
ఆ అందముతో ఆనందము చిగురిస్తావు
మరి తృటిలో తుంచేస్తావు
ఎందుకు ఈశ్వరా ! ఎందుకు ?

ఈ తనువున మనసును సృష్టిస్తావు
ఆ మనసున మమతలు రగిలిస్తావు
మరి తృటిలో తుంచేస్తావు
ఎందుకు ఈశ్వరా ! ఎందుకు ?

ఈ బ్రతుకుల బంధము సృష్టిస్తావు
ఆ బంధముతో ఆశలు మొలిపిస్తావు
మరి తృటిలో తుంచేస్తావు
ఎందుకు ఈశ్వరా ! ఎందుకు ?

# 47. వద్దు ప్రభూ

జీవం లేని
సారం లేని
యంత్రము లాంటి
ఈ బ్రతుకు
వద్దు ప్రభూ... వద్దు



ప్రేమ లేని
పెన్నిధి లేని
నరకము లాంటి
ఈ బ్రతుకు
వద్దు ప్రభూ... వద్దు

భక్తి లేని
ముక్తి లేని
మురికి కూపము లాంటి
ఈ బ్రతుకు
వద్దు ప్రభూ.... వద్దు

రేగిన మమతల
తీరని ఆశల
ఎండమావి లాంటి
ఈ బ్రతుకు
వద్దు ప్రభూ... వద్దు

# 48. ప్రభూ... ఈశ్వరా

ప్రభూ – ఈశ్వరా
పగలనక
రేయనక
నిరంతరము
నీ స్మరణే
నా సర్వస్వమో
ఆ ఇంచుక
భక్తి నుంచు నాలో !

ప్రభూ ఈశ్వరా
కష్టమనక
సుఖమనక
సర్వత్రా
నీ రూపురేఖల
సృజించగలనో
ఆఇంచుక
శక్తి నుంచునాలో

ప్రభూ – ఈశ్వరా
నా ఆటలో
పాటలో
బాటలో
నిన్నెప్పుడూ

ఏ మారనో ఆ ఇంచుక
జ్ఞా నాన్నుంచు నాలో

ప్రభూ – ఈశ్వరా
నీదు పిలుపు
నాదు వలపు
నిరంతరము
వెన్నెల వాకలా
స్రవించునో
ఆ ఇంచుక
ప్రేమనుంచు నాలో

# 49. ప్రియా! ఈశ్వరా!

ప్రియా ఈశ్వరా
నిన్నెరుగుదునని పలికాను ప్రజ్ఞల్ని
నాచేతలన్నింటిలో చూపాను నీ ప్రతిబింబాన్ని
నా ప్రజల్ని విని
నీ ప్రతిబింబాన్ని చూచి
ఎక్కడ ఏడి ? చూపమంటారు నిన్ను
నేను ఆశక్తతో వూరుకుంటాను
నవ్విపోతారు నా చర్యలను చూచి
నీవూ నవ్వుతావు వాళ్ళతోపాటే

నీ క్రీడల్ని, నీ కథల్ని
పాటలుగా అల్లుతాను.
తీయగా పాడుకుంటాను
వెల్లువై ముంచెత్తుతుంది
ప్రపంచాన్నంతా నాపాట
ఆ పాటలకు అర్థాలను చెప్పమంటారు
నేను ఆశక్తతతో వూరుకుంటాను
నవ్వి పోతారు నా చర్యలను చూచి
నీవూ నవ్వుతావు వాళ్ళతో పాటే

– (గీతాంజలి నుండి)

# 50. ఈశ్వరా

నా ప్రేమను
నా అనురాగాన్ని
నా విరహాన్ని
తెలుసుకోవాలని
పరీక్షించాలని
వచ్చావు బిక్షునిగా
ఓనాడు నా ముందుకు
పిలిచాను – పలికావు
బిక్ష పెట్టాను – పుచ్చుకున్నావు
దేవుడవు నీవని దెప్పిపొడిచావు
నా కనులు అశ్రుపూరితాలయ్యాయి
నీవు మనసులో నవ్వుకొని

మరలి పోతున్నావు
లీలగా కన్నీటి తెరలలో
మసలుతున్నావు
కేక వేద్దామనుకున్నా
గొంతు పెగలలేదు
ఏమి చేయను – నీవు దాటిపోయావు

# 51. దయామయుడు

ప్రభూ ఈశ్వరా !

ఎంతటి దయామయుడవయ్యా నీవు
తల్లివై, తండ్రివై
గురువై, దైవమై
మిత్రుడై, దాతవై
రోగివై, భిక్షువై
పండిన పంటవై
అమృతాన్నమై
మధుర జలమై
సూర్యుడై, చంద్రుడై
భూమియై, భామయై
గాలివై, ధూలివై
అణువై, మేరువై
అంతయు నీవై
నీ బిడ్డలకు వ్యక్త పరుచుకుంటున్నావు
ఎంత దయామయుడవయ్యా నీవు
ప్రభూ ఈశ్వరా !

★ నవంబర్,1968 “వేదాంత భేరి” లో ముద్రితము

# 52. ఆరని జ్యోతి

కాలచక్ర గమనంలో
ఒక్కో నిముషము గడిచే కొలది
మృత్యువు చేరువవుతుంది
ఇన్ని వసంతాల జీవితానుభవము
ఇంత సంసార భీకర సంగ్రామం
చేసిచేసి అలసి సొలసి సాధించినదేమా అని
ఓ నిముషము ఆలోచించిన క్షణము
కనపడలా కాస్తంత ప్రయోజనము
క్షణము శాంతి లేక
అరక్షణము విశ్రాంతి లేక
గమ్యం లేని ఆశల వెంట
పరుగులెత్తి అలసిపోయాను
నీపాద పద్మములే శరణ్యమని
ఇప్పుడు తెలుసుకున్నాను ఈశ్వరా !
దయామయుడవైన నీవు
అనుక్షణం వ్యక్త పరుచుకుంటునే వున్నావు
కాని అజ్ఞానముతో తెలుసుకోలేకపోయాను
ఇప్పుడు నీ పాదాల చెంత చేరి
అవ్యక్తానందాన్ని పొందుతున్నాను.
అదే నాకు మిగిలిన ఆరని ఆనందజ్యోతి
ఇక నాకే చీకూ చింతా లేదు
ఇంతటి మధురానందాన్ని
ఇన్ని వసంతాలు పొందలేదనే
అణుమాత్రపు వ్యధ తప్ప.

★ మే, 1969 “వేదాంత భేరి" లో ముద్రితము

# 53. ఇంద్రజాలము

ప్రియా ఈశ్వరా !
పరిమళ పుష్పంలా
నీ ప్రేమామృతము
నా చిన్ని హృదయము పై

నిరంతరము వర్షిస్తూనే యున్నది
నీ విక్కడెక్కడో దాపులోనే వున్నావని
నీ కొరకు ప్రపంచమంతా వెదికాను
నీవు కనుపించలేదు సరే
ప్రపంచమంతా లోపాలే కనుపించాయి
గత్యంతరము లేక
నీ కొరకు వెతకటము మానుకున్నాను
అప్పుడు తెలుసుకున్నాను
నీవు నా హృదయములోనే వుండి వర్షిస్తున్నావని
ఇన్నాళ్ళ నా వెర్రితనానికి
నవ్వనా ! ఏడ్వనా !
మరల ప్రపంచములో తిరిగి చూచాను
అణువణువునా నీవే కనిపించావు
ఈ ఇంద్రజాలానికి ఏమని చెప్పను
నా ఆశ్చర్యానందాల్ని

★ సెప్టెంబరు, 1969 "వేదాంత భేరి" లో ముద్రితము

# 54. ఎలా ఈశ్వరా

గుర్రం లాంటి మనసు
ప్రపంచ వ్యామోహాల వైపు
గుంజుతుంటే
ఎలా ఈశ్వరా !
ఎలా నిన్ను దర్శించను !

భార్యా బిడ్డలు
ప్రేమానురాగాల
ముంచుతుంటే
ఎలా ఈశ్వరా !
ఎలా నిన్ను తెలుసుకోను

పూర్వపు వాసనలు
పూల బాణాలై
మత్తు గొల్పుతుంటే
ఎలా ఈశ్వరా !
ఎలా నీ కర్పణ కాను

# 55. ఎన్నాళ్ళు ఈ బ్రతుకు

ఎన్నాళ్ళు ఈ బ్రతుకు
ఎన్నాళ్ళు స్వామి
బ్రతుక నేర్చిన బ్రతుకు
బ్రతికి బ్రతికి
బ్రతుకు మీద తీపి
బ్రతుకకున్నది స్వామి

గమ్య మెరుగని బ్రతుకు
గతుకులంటను తిరిగి
కాంక్ష తీరిన నాకు
నిను కూడ మనసాయె

నీటి బుడగ తనువు
నిలుచునో నిలువదో
వేగవచ్చి నాదు
కోర్కె బాపరా స్వామి

2-7-1968

# 56. రారా మురళీధరా

రారా ! మురళీధరా !
మధురాధర నిన్నే
మనసార పిలచింది
రారా ! మురళీధరా !

బృందావనిలో
నీ బిగికౌగిట
కరగాలని
కోరిక రగల
మధురాధర నిన్నే మనసార పిలచింది రారా !

తనువు మనసు
నీకర్పణ చేసి
తరించవలెనని
తమకము మీర
మధురాధర నిన్నే మనసార పిలచింది రారా !



# 57. అశక్తత

నా క్షణికానందాల్ని వదలి
నిన్నర్థంచి
నిరతానంద స్రవంతిలో
నిలుకడ వహిద్దామనే తలంపు

నా ఈ చిన్ని గుండెయ
భరించలేదేమోనని
ఇట్టే ఎగిరిపోతుంది ప్రభూ !

నా జీవన దాతవు నీవేనని
నా జీవన సౌరభానివి నీవేనని
నా జీవన గమ్యానివి కూడ నీవేనని

రూఢిగా తెలిసి కూడా నీవేనని
ఈ నాబుద్ధి విషయవాసనల
బారి నుండి తప్పుకోవటం లేదు

ప్రభూ ఏమి చెయ్యను!
అశక్తుడను ప్రభూ
అశక్తుడను

# 58. మహాత్ములు

నిన్న విచ్చిన గులాబీ
కన్నె నేడు పసివాడిపోతే
నిన్న వెన్నెల స్రవంతులు
వెదజల్లిన చందమామ
నేడు కనుమరుగైపోతే
నిన్న బోసినవ్వులు
కురిపించిన పసిపాప
నేడు జీవన స్రవంతిలో కొట్టు
మిట్టాడుతుంటే
ఈ జీవితాలకు అర్థమే
లేదేమోననిపిస్తుంది
వ్యర్థమేమోననిపిస్తుంది

కాని నిరంతరము
ఈ జీవన సరళిలోని
అర్థాలను తెలుసుకోవాలని
ప్రతి ప్రాణి పుట్టినప్పటి నుండి
ప్రయత్నిస్తుంది
ఆ అన్వేషణే సంసారమై
నిరంతరము సమస్యలతో
సంఘర్షణలతో

సుఖ దుఃఖాలతో
వెలుగు చీకటులతో

ప్రపంచమంతా వెల్లివిరిసి
అణ్వేషణ అడుగున బడి
వాసనా జగత్తులో మునిగి

పంజరములో చిలుకలా
చిక్కుకు పోయింది ప్రతిప్రాణి

ఎక్కడో ఒక ప్రాణి
పూర్వజన్మ సంస్కారము
వలన
భగవాను నపార కరుణ
వలన
ఈ చర్విత చరణ జీవితాన్ని
చూచి
విషయ వాంఛలపై రోసి
ఇంద్రియాల నొశపరచుకొని
మూలతత్వాన్వేషణలో
తమ జీవితాలను గడిపి
సర్వత్రా ఈశ్వరుని గాంచి
ధన్యత చెందుతున్నారు
వారే మహాత్ములు
మన మార్గ దర్శకులు

# 59. చెలి - ఈశ్వరుడు

చెలియ
నీదు ముఖారవిందము గాంచుటే
ఆనందమని తలచితి నొకనాడు
సర్వజీవులందు ఈశ్వరుని గాంచుటే
ఆనందమని తెలిసితినాడు

చెలియ నీదు అధరామృతము
గ్రోలుటే
మధురమని తలచితి నొకనాడు
రామనామామృత పానమే
మధురాతి మధురమని
తెలిసితినాడు

చెలియ నీదు భావనచే
ఎడద నుప్పొంగు నొకనాడు
భగవాను భావనచే
ఎడద నుప్పొంగు నీనాడు

చెలియ నీదు స్పర్శచే
తాత్కాలికముగా దుఃఖములు
బాసితి నొకనాడు
భగవాను భావనచే శాశ్వతముగా
దుఃఖములు బాసితీనాడు.

చెలియ
నీదు రూపమే
విశ్వమంతయు గాంచి
సంతసించితి నొకనాడు
భగవాను రూపమును
విశ్వమంతయు గాంచుటే
సంతోషమని తెలిసితీనాడు

12-10-1969

## 60. **చెలి**



ఈ ఎముకలు కొరికే చలి
నే రొమ్ముల కుంపటి తొలగించుట
ఈ కరుడు గట్టిన హృది
నే ఎర్ర అంచుల చిరునవ్వు కరిగించుట
ఈ బ్రతుకుబాట నోడిన జీవి
నే కొనకన్నుల ఆశలు చిగురించుట
ఈ మొద్దు బారిన తనువు
నే చల్లని చేతుల పులకించుట
ఈ శుక్కిన యవ్వనము
నే నున్నని పొక్కిలి రగిలించుట.

(అక్టోబర్ 64. హిందుపురంలో ఉద్యోగంలో చేరాను. చలికాలం. చలి భరించ లేక పడిన క్షోభా రూపం ఈ గేయం )

# 61. ఆనాడు – ఈనాడు

## ఆగష్టు 15



అన్య దేశ పతాకచాయల
కాలు నిలుపలేక
పరాయి ప్రభువుల
పాదాల మ్రోల
తలవంచి బ్రతకలేక
శాంతి అహింసల రాజబాటన
పూజ్య బాపు దారి చూపగ
కులము వీడి మతము వీడి
స్త్రీలు పురుషుల భేదమెంచక
మానప్రాణము లెక్క కొనక
తెల్లదొరల గుండెలదర
ఏకత్రాటిన ఎగసి నడచి
త్యాగధనము ధారబోసి
కూర్చుకున్న స్వారాజ్య
ఆవిర్భవించిన శుభోదయం
భరతజాతికి నవోదయం

ఆనాడు ఆగష్టు 15, 1947
ప్రజాస్వామ్య పాలనలో
స్వార్ధపరుల ఆలనలో
శాంతిలేక కాంతిలేక
తిండిలేక, బట్టలేక
నీడలేక తోడులేక
ప్రాణమాన రక్షణ
అసలే లేక
విభేదాల విచ్ఛిత్తిలో
క్షణక్షణం
భయంతో బాధతో
జాతి జాతి విలపించే
తిరోగమన మీనాడు
భరతజాతి కథోగమనము
ఈనాడు ఆగష్టు 15, 1972

# ౬౨. రారా! మువ్వగోపాలా



రారా! మువ్వగోపాలా
నీపై మోజాయరా, (మనసాయెరా)

మన్ను తినుట మాని తిన్నగా మా ఇల్లు చేరు
వెన్న ముద్దలు చేసి నీ నోటి కందింతు. ॥రారా॥

ముద్దు ముద్దుగా నాకు ముద్ద కొాక ముద్దీయి
ముద్దలిడుదును నీకు వద్దు వద్దను దాక ॥రారా॥

గోప బాలురు దవిలి నీ వెంట పడునేమో
ఇదె ఇపుడె వత్తునని మాయమాటలు చెప్పి॥రారా॥

దారి కాచి రాధ అడ్డు పడునేమో
తప్పు త్రోవను బట్టి తప్పక మా ఇలు చేరు ॥రారా॥

# 63. సత్యనారాయణా

ఏమోయి సత్యనారాయణా
మరీ కనిపించటమే
మానివేశావో
ఏమిటబ్బా విశేషాలు
ఏమిటీ?
నిన్ను గురించి కవితలల్లనా
మరీ చప్పగా ఉంటుందోయి
పెగ్గు బిగించినా
సిగరెట్టు ముట్టించినా
ఏమి చేసినా
భావాలు రావద్దటోయి!
ఓ బేసిక్ హెల్తు వర్కరు మీద
ఓ చిన్న సైజు ఉద్యోగి వేద
ఏమి వ్రాయనోయి!
ఏదో వ్రాస్తే నవ్వరటోయి
చదివిన వాళ్లు విన్న వాళ్లను
చక్కని చుక్క మీదనో
నిండు చందురుని మీదనో
ఏ మహా నాయకుని మీదనో
భగ్న ప్రేమికుల జంట మీదనో
అయితే గియితే
నిరభ్యంతరముగా
నిరాటంకముగా
పేజీలు పేజీలు
కమ్మని కవితలల్ల గలను
కానీ నీ గురించి
అయ్యో రామ
ఏమి వ్రాయనోయి
సత్యనారాయణా!
ప్రతిరోజూ ఉదయాన్నే లేచి
ఇంటింటికి తిరిగి
ఏ ఇంట్లోనైనా మలేరియా
మహమ్మారి
ఉందేమోనని విచారించి
కాకపోతే కేసులు తగిలితే
నాలుగు రక్త పరీక్షలు
తీసుకుంటావు
అంతేగదటోయి
సత్యనారాయణా
ఇంకేమయినా ఉందా నిన్ను
గురించి
కవితలల్లటానికి.
మరిచాను ఒక విషయము
ఇంటింటికి వెళ్లినపుడు
అంతా బాగున్నారా అని
విచారణ సల్పుతుంటావు
కదూ!
డబ్బులతో బాగా బలిసిన
పశువులు
నిన్ను చూచి పెదవి విరుస్తారు

కూటికి లేక అల్లాడే
మనుషులు
నిన్ను చూచి ఆనందిస్తారు.
పాపం! ఇతనే మేలు
ఇరుగువారు పొరుగువారు
కనీసం పలకరించకపోయినా
పది రోజులకాక తూరి వచ్చి
అంతా బాగున్నారా అని
పలకరిస్తాడు
దానికి సంతోషపడతారు
ఎంతోమంది దరిద్ర
నారాయణులు
అంతేకదటోయి
సత్యనారాయణా
ఇంకేమయినా ఉందా
నీపై కవితలల్లటానికి
కానీ నీవు వంద
రూపాయలతో
చావు లాంటి బ్రతుకు
బ్రతుకుతున్నావని
ఒక పూట తింటే మరో పూట
లేదని
ఇంటికి వస్తే రుస రుసలాడే
అర్ధాంగి
తినుబండారాలకై సంచులు
వెదకే సంతు
వాళ్ళని లాలించలేక నీవు
పడేతంతు
నెల తిరక్క ముందే అద్దెకై
వచ్చే యజమాని
వీధిన బడితే అప్పుల వాళ్ళను
తప్పించుకు తిరిగేది ఎలా అని
బుర్ర బద్దలు కొట్టుకునే
ఆలోచనలు

అప్పుడప్పుడూ పెళ్ళాము మీద అలిగి
నీ మీది సూపర్వైజర్ కై వచ్చే
అధికారి అరుపులు అక్షింతలు
వీటన్నింటినీ భారంగా భరించుతూ
గుక్కెడు టీ నీళ్లకు కూడా
పది పైసలు జేబులో లేకుండా
ప్రొద్దస్తమానము ఇంటింటికి తిరిగి
క్షేమాలు విచారిస్తుంటావని
ఎంతమందికి తెలిసినోయి
సత్యనారాయణా!
అంతేకదటోయి
ఏమి వ్రాయనోయి! నీ గురించి!

Note: *మా మిత్రుడు సత్యనారాయణ మలేరియా శాఖలో పనిచేస్తున్నాడు. ముగ్గురు పిల్లలు గొర్రె తోక లాంటి జీవితం కుటుంబ పోషణకై అప్పుల పాలయ్యాడు ఒకరోజు పాపం పది పైసలు టీ నీళ్లకు కూడా జేబులో ఉండని కష్ట జీవితం అతని భావాలు ఈ గేయ రూపం.*

20.12.1969

--------------

# 64. అరుకులు

రండి రండి రండి
అరకులండీ అరుకులు
భలే భలే అరుకులు
పసందైన అరకులు
రంగు రంగుల అరకులండీ
రకరకాల రుచులండీ
ఫార్మసిస్టు నారాయణ
స్పెషల్ తయారీ అరకులండి
మీ జబ్బులన్ని పారద్రోలు
అమోఘమైన అరకులండి
కడుపునొప్పి, కాలు నొప్పి
వళ్లు నొప్పి, తలనొప్పి
ఏ జబ్బయినా, ఏమైనా
ఒక్క డోసు త్రాగితే
జబ్బు పోయి ఉషారొచ్చు



అమృతపు అరకులండి
పైసా ఖర్చు లేదండీ
టైం వేస్ట్ కాదండీ
మా డాక్టరు చీటీ చాలండీ
సొంత సీసాలు ఉంటే మేలు
అరకు వేసి చేతికిచ్చి
వెంటనే పంపేస్తామండీ
రండి రండి రండి
జబ్బులతో చావకండి
అమృతపు అరకులండి
బలే బలే అరకులండి
రంగురంగుల అరకులండి
రకరకాల రుచులండ
మీ జబ్బులన్ని
కచ్చితంగా పోవునండి.

(16.3. 70:(నలభై యేళ్ల క్రితం అల్లోపతి ఆసుపత్రుల్లో డిస్పెన్సరీలు ఉండేవి. రకరకాల మిక్చర్లను వైద్యుని సలహా పై కాంపౌండరు కలిపి ఇచ్చేవాడు. అవే అరకులు)

# 65. జీవిత సమీక్ష



నాలో ఉన్నాయి సుగుణాలు అనేకం
అంతమాత్రాన దుర్గుణాలు లేవని కాదు
ఒకదానికొకటి ఏమీ తీసిపోవు
ఈ ద్వంద్వాల మూలకంగానే కదూ!
ఎడతెగని కురుక్షేత్ర సంగ్రామం నా ఎదలో
నిరంతరము రామనామ స్మరణ చేస్తాను నేను
కానీ మన్మధు బారి పడతాను అప్పుడప్పుడు
ఎక్కువగా వేదాంత గ్రంథాలు వల్లె వేస్తుంటాను
అయినా చెత్తరకము సెక్స్ బుక్స్ కంటపడితే వదలను
పెద్దలతో కూడి వేదాంత చర్చలు చేస్తాను
మిత్రులతో కూడి పేకముక్కలు ముట్టుతాను
ఏకాంతములో మోక్షకన్యను గూర్చి కలలు కంటాను
కాస్తంత ఇంద్రియ సుఖానికి అప్పుడప్పుడు బజారు కెళతాను
అందుకే నేను ఎవరికీ అర్థం కాను

నాకు నేను అర్థం కాని నేను ఎవరికి మాత్రం అర్థం అవుతాను?

నా జీవిత సూత్రం ఏమిటో

నా జీవన సిద్ధాంతం ఏమిటో

నాకే అర్థం కాని సమస్య

సత్పురుషులు నన్ను గూర్చి అంటుంటారు

'చిన్నవాడు గట్టివాడు మంచి మార్గంలో పడ్డాడని'

పత్రికల వాళ్ళు అంటారు నేను గొప్ప అభ్యుదయ రచయితనని

పేకాట రాయుళ్లు అంటారు నేను ఒక గొప్ప రమ్మీ ప్లేయరు నని

స్నేహితులంటారు నేను గొప్ప స్నేహపాత్రుడనని

నాపై అధికారి అనుకుంటాడు నేను మంచి వర్కర్ అని

నా అర్థాంగి అనుకుంటుంది సంసారాన్ని నేను పట్టించుకోనని

నా ప్రియురాలు అనుకోవచ్చు నేను గొప్ప రసిక చక్రవర్తినని

అందుకే నేను ఎవరికీ అర్థం కాను

నాకు నేనే అర్థం కాను

చీకటి వెలుగుల కలయిక నేను

పరిసరాలకు వెలుగునిస్తాను

నేను చీకటిలో కొట్టుమిట్టాడుతాను

ఈ చీకటి నుండి బయట పడాలని

నిరంతర పోరాటం చేస్తూ ఉంటాను సల్పుతుంటాను

కానీ కాలు కదపనే లేక పోతున్నాను

ఏమి చేయను  అసక్తుడను నేను

తీరలేదేమో నా కర్మానుబంధం

ఈ బంధాలు ఎప్పుడు వదులుతాయి

ఈ చీకటి నుండి ఎప్పుడు బయట పడతానో

ఏనాటికైనా ఈ జీవితములో వెలుగు నిండుతుందా

అప్పటివరకు ఈ అంధకారములో మ్రగ్గవలసిందేనా

నన్నీ ఊబిలో నుండి ఈ నరకము నుండి ఏ మహాత్ముడు

ఏ పుణ్యపురుషుడు

ఏ కరుణామయుడు

ఏ ప్రేమ మయుడు

చేయూతనిచ్చి వెలుగులోకి నడుపుతాడో

ఎప్పుడు వస్తాడా అని వేయి కళ్ళతో

కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తున్నా

వరదలై పారేలా కన్నీరు కారుస్తున్న

ఈ కన్నీరు తుడిచి పన్నీరు చిలికి

మూడు పూవులు ఆరు కాయలుగా

ఈ జీవితం ఎప్పుడు చిగురిస్తుందా

అని వేయి కళ్ళతో ఎదురు చూస్తున్నా



# ౭౮. ఆదివారం స్వర్గము



ఆదివారం వస్తే చాలు

భయమేస్తుంది మరీ!

ఆ రోజు ఆఫీసుకు సెలవు
ఇంటి వద్ద గడపాలి
అది అసలు ముఖ్య కారణం
అందరి మాటేమో కాని
నాకు ఉద్యోగానంతరం
అయింది పెండ్లి
పెండ్లయిన కొత్తలో
' యవ్వనపు తొలి బాటన
యుగాంతరాలైన
భార్యామణి ముఖారవిందాన్ని
కన్నులారా గ్రోలుతూ
గడపొచ్చు' అనుకునేవాడిని
ఆ రోజుల్లో
ఆఫీసు అంటేనే ఓ జైలు లాగా
ఉండేది
ఐదు గంటలు అయితే చాలు
అర్ధాంగి ముందు వాలే వాడ్ని
కాలము పది వసంతాలు
గడిచింది
మా ఆవిడ కాన్పులతో
సన్నగిల్లింది
నలుగురు ఫిరంగుల్లాంటి
పిల్లలను కన్నది
కాలంతో పాటు ధరలతో పాటు
జీతం పెరగలా
పెరగని జీతంతో
పెరిగిన సంసారం
తీరని కోరికలు.
వీటిని ఛేదించలేక
సతమత మయ్యాము మేము
ఇంతకూ అసలు
సమస్యకొద్దామా?
ఆదివారం నాడు
ఓ అరకప్పు కాఫీ సేవించి
అలా కుర్చీలో కూలబడటం
ఆలస్యం
అర్ధాంగి గారు అతివినయంగా
వచ్చి
ఏమండోయ్!
ఓ నిమిషం కళ్ళు తెరవండి
నేను చెప్పే మాటలు
కాస్త ఆలకించండి అని
కోరచూపులతో

ప్రేమ చూపులతో
కాఫీ పొడి నుండి
కంచి చీరల దాకా
ఇండెంట్ ఇస్తుంది
ఈ ఇండెంట్లు వినలేక
వీధిన పడటమే మేలని
ఇంటి వద్ద కూర్చోవటము
మానేశాను
అదే ఈ మచ్చ
వీధిన పడ్డా పెద్ద వీధులంట
తిరగాలంటే
భయమే మరి
అప్పుల వాళ్ళు
ఎక్కడ తగిలి
హంగామా చేస్తారోనని
ఓ ఆదివారం
ఇలానే బయటపడి
చివరి రూపాయిని పాకెట్లో
భద్రపరుచుకొని
పార్కుకి చేరి
రేడియో సంగీతం వింటూ
చల్లగాలి తింటూ
స్వర్గలోకాల తేలే
అతి విలువైన సమయంలో
ఓ లాటరీ వాలా వచ్చి
నన్ను బలవంతాన దింపి
ఓ టిక్కెట్టు అంటగట్టాడు
కాఫీ కి కూడా లేవన్నా
వదిలితేనా వెధవ
వారం తిరిగింది
నా అదృష్టం పండింది
లాటరీలో ప్రైజు తగిలింది
సంతోషాన్ని పట్టలేక
అరనిమిషంలో
అర్ధాంగి ముందు వాలి
అమాంతం కౌగిలిలో
బంధించాను
ముద్దులలో ముంచేశాను
అబ్బా! వదలండీ!!
ఏమిటి మరీ!
పసిపిల్లలవుతున్నారని
పక్కకు ఒక నెట్టు నెట్టింది
మంచం పైనుంచి కింద పడ్డాను
లేచి చూద్దును కదా!
ఏముంది అంతా కల!
పక్కన పార్కులో బెంచి ఉంది
డామిట్ కథ అడ్డం తిరిగింది.

బంగారం లాంటి కల చెదిరిపోయింది, ఎవరూ చూడకుండా లేచి దుమ్ము దులుపుకుంటూ ఇంటి ముఖం పట్టాను.

# 67. పిలుపు

రారండోయి! రారండోయి
యువతులారా! యువకులారా!
తల్లులారా! తండ్రులారా!
రారండోయి! రారండోయి
పెరుగుతున్న జనాభాను
ధీరులమై అరికట్ట
తరుగుచున్న జీవనవ్యయమును
మెల్లమెల్లన పెంపపొందించ
రారండోయి! రారండోయి
ఏటేటా కాన్పులతో
ఎదుగుతున్న పిల్లలతో
వంటినిండా జబ్బులతో
ఊరినిండా అప్పులతో
అల్లాడే! అల్లాడే!
తల్లులారా! తండ్రులారా!
యువతులారా! యువకులారా!
రారండోయి! రారండోయి
మితసంతానమే
అతిసంతోషమని
తెలిసిన అమలుపరచ
వేగిరముగా
రారండోయి! రారండోయి

# ౬8. ఈశ్వరా

సర్వాంతర్యామివి కదా అని
నీ కొరకు ప్రపంచం వైపు చూడకుండా



నీవు కనుపించలేదు సరే!
ప్రపంచమంతా
బహుసుందరంగా
ప్రేమవాహినిగా
గోచరించి
వాటి ఆకర్షణలో
పడిపోయా–
నిన్ను తెలుసుకుందామంటే
తీరా ఇవే నాకు
గొప్ప ప్రతిబంధకాలయ్యాయి.
ఈ దాగుడు మూతలెందుకు?
ఎందుకిలా నన్ను మాయ చేస్తావ్? 8–2–89

**కరిగిపోనా ప్రభూ**
వెతలు విడచి తనువు మరచి
మనసు తరచి కలలా నీలోన
కరిగిపోనా ప్రభూ కరిగిపోనా? 6–12–69వ

# ౬౯. వాన వెలసిన రాత్రి



ఆ రాత్రి
నాకింకా గుర్తుంది
మామూలు రాత్రి కాదది
కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి రాత్రి
ఉరుములు, మెరుపులతో జోరుగా వర్షం కురి
ఉద్యోగ అన్వేషణలో విసుగెత్తిన రాత్రి
కంటిమీద కునుకు లేని దీర్ఘరాత్రి
అతి భయంకరమైన రాత్రి–ఎలాగో గడచిపోయింది
బాలభానుని నునువెచ్చని కిరణాల కాంతి
జీవితంలో కరువైన శాంతి
పడక మీది నుంచి బలవంతాన లేవదీశాయి
కాలకృత్యాలు తీర్చుకొని
కడుపులోకి కాసిని కాఫీ పోసుకొని ఊరి మీద పడ్డా
పంచాయతీ పుణ్యమాని–రోడ్డంతా గుంటలు
గుంటల నిండా మోకాళ్లలోతు నీరు
నీటిలో కేరింతలాడే పిల్లలు
పిల్లలచేతిలో కాగితపు పడవలు
తల్లుల అనునయంతో కేకలు
ముంగిళ్ల తుడుపులు
కళ్లాపి తుడుపులు
చెరువు నీటికై వెళ్లే పడతులు
నీళ్లు చిందుతాయోమోనని ఎగబట్టిన ఉడుపులు
పొలం పనులకు వెళ్లే రైతు బిడ్డలు
మేతకై ఉరకలు వేస్తూ పోయే పశుసంతతి
ఉత్సాహంతో పరుగులిడు వాటి సంతతి
శోభలు చిందుతూ ఉంది ఊరంతా.

ఊరి వెలుపలకు నడిచాను
కొత్తపెళ్లి కూతురులా పచ్చని పంటపొలాలు
కన్నవారిని వదలి వెళ్లేటప్పుడు
పెళ్లి కూతురు కార్చే కన్నీటి వరదలా
పచ్చని పంటపొలాలపై రాత్రి కురిసిన వర్షపు నీరు
ఆహ్లాదకరంగా ఉంది ప్రకృతి అంతా.
ముందుకు నడిచాం కనుచూపు మేరలో
పచ్చని అడవి
కిందకు జారే వర్షపు నీటిధారలు నయనానందకరంగా ఉంది.
అంతలో తుపాకీ గుండులా హృదయాన్ని పట్టి పిండేలా
మనసులోకి దూసుకొచ్చింది నా నిరుద్యోగపు సమస్య.
పగలనకా రేయనక ఎండనక వాననక
చెమటోడ్చి కష్టించి తమ రక్తాన్నంతా
రూపాయిలుగా మార్చి నేనేదో ఉద్ధరిస్తానని
వాళ్లనేదో అందలము ఎక్కిస్తానని
మా తల్లితండ్రులు కన్న కమ్మని కలలు
కలలు గానే ఉండిపోయినాయి.
పెండ్లికై ఎదిగిన చెల్లి రోగంతో బాధపడే తల్లి
ఇవన్నీ తీరని సమస్యలు పరిష్కారము చూపలేక
అద్దపు చట్రంలో బందీ అయిన నా విశ్వవిద్యాలయ పట్టా
ఇదీ మా పరిస్థితి
ఎవడికి కావాలి ఇవన్నీ కావివేవీ ఉద్యోగానికి అర్హతలు
పచ్చకాగితాలు సిఫారసులు– కావాలి.
ఇలా ఉంది ఉద్యోగాల గతి.
ఇలా ఉంది అధికారుల స్థితి
ఇది ప్రజారాజ్యం
అడిగినా ఆలకించని రామరాజ్యం

ఇంకా ఎన్నాళ్లు ఇలా
పేదసాదలు తమ రక్తాన్ని
డబ్బుగా మార్చాలి
అధికారుల ధన
దాహం తీర్చాలి?
అంతు పట్టని సమస్య ఇది
ఇలా పరుగెడుతున్నాయి
నా ఆలోచనలు.
నడుస్తూనే ఉన్నాను నేను.
వచ్చేశాను



కొండచరియల దాపుకు
దూరముగా ఓ నీటిమడుగు
ఒడ్డున కూర్చొని పలకరించే
ఓ బండరాయి
సమీపించాను
ఆశ్చర్యపోయాను

అది ఓ మానవాకారం
చిరిగిన పేలికలు
ముడతలు పడ్డ కళ్లు
ఆకలితో పీక్కు పోయిన కళ్లు
జీవన భారాన్ని మోయలేక
వంగిన నడుము
చేపలు పడుతుంది ఆ అస్తిపంజరం
పలకరించాను.
వెనుకకు తిరిగి ఆశ్చర్యం నుంచి తేరుకొని

ఏమిటన్నట్లుగా ప్రశ్నిస్తున్నాయి
ఆ ఆకారపు కనుబొమ్మలు
ఇంత ఉదయాన్నే ఇంత ఓపిక
ఎలా వచ్చింది నీకు అనే నా ప్రశ్న!
బలాన్నంతా కూడగట్టుకొని
చెప్పలేక చెబుతుంది సమాధానం
ఆ అస్తిపంజరం మెల్లగా
ఏమి చేయను బాబూ!
నిన్నంతా పనిలేదు చేత కానీ లేదు
రాత్రి కూడు లేదు
దేవునికి కూడా కరుణ లేదు



ఉంటే ఎందుకు రాడు?
ఆయన చల్లని పిలుపుకై
ఎదురు చూస్తున్నా అప్పటి వరకు
ఈ ఎదురుచూపులు
ఈ జీవనపోరాటం ఈ శరీర పోషణకై ఏదో ఒక పని
తప్పదుగా మరి?
జ్ఞాని నోటివెంట వెడలిన ముత్యాల లాంటి మాటలు
దించేసినవి నాలోని నిరుద్యోగపు మూటలు
కాసేపు అలా అలా తిరిగాను ఇంటికి తిరిగి వచ్చాను
*నాన్నా నేనూ వస్తాను ఈరోజు నుండి కూలిపనికన్నా*
ఆశ్చర్యంగా చూశాడు నావైపు ఎన్నెన్నో కలలు గన్న మా నాన్న!

5-12-69

# వ్యాసాలు

## 1. విప్లవ నవల – వస్తువు – శైలి – అవగాహన

### చెరబండరాజు నవల "మా పల్లె" – విశ్లేషణ

విప్లవ నవల కానీ, ఏ నవల అయినా కానీ వస్తువు ప్రధానం. కథావస్తువును ఎంచుకోవడంలో రచయితకు– ముఖ్యంగా ప్రజల కోసం తమ రచనలను రాసే విప్లవ రచయితలకు– ఎంతో జాగ్రత్త అవసరం. మన జీవితంలో మన సమాజంలో జరుగుతున్న అనేకానేక సంఘటనలే నవలకు ఇతివృత్తాన్ని అందిస్తాయి. దీనినే సహజంగా వస్తువు అంటాం. రచయిత వస్తువును స్వీకరించి భాషలో వ్యక్తీకరించే విధానాన్ని శైలి అంటాం. రచనలో వస్తువు ఎంత ముఖ్యమో, శైలికూడా అంత ముఖ్యమే. కాని విప్లవ రచయితకు వస్తువు మరీ ముఖ్యం. ప్రజలే విప్లవకారులు, చరిత్ర నిర్మాతలు కాబట్టి పీడిత ప్రజలు విప్లవ నవలలో కేంద్రస్థానాన్ని ఆక్రమించుకోక తప్పదు.

అలాగే "మా పల్లె" నవలా రచయితను పురికొల్పిందేమిటో ముందు మాటలో చెప్పారు. 1972 ప్రాంతంలో కా॥ కొల్లిపర రామనరసింహారావును సంఘర్షణ పేరుతో చంపిన పోలీసులు అపోహతో కె.జి.సత్యమూర్తి సంఘర్షణలో చనిపోయారని ప్రకటించడంతో అనేక మంది విద్యార్థులు మా మాష్టారును కాల్చేశారని విషాదంతో మునిగివున్న దృశ్యం చూసిననాడే "మా పల్లె" నవలకు అంకురార్పణ జరిగిందని, దానికి తోడు నిత్యం తెలుగుదేశంలో వెల్లువలా

పాల్గొంటొన్న విద్యార్థుల పోరాటాలు – ఇవన్నీ కథలో వస్తువుగా స్వీకరించడం జరిగిందని రచయిత ముందు మాటలో రాయడం జరిగింది.

"మా పల్లె" నవలా కథను ముందు క్లుప్తంగా చెప్పుకొందాం. రంగనాయకులు అనే సి.ఆర్.పి. పోలీసు మాధవరావు అనే నక్సలైటు నాయకుడ్ని, అతని తలపై ప్రభుత్వం ప్రకటించిన 50 వేల రూపాయల కోసం ఆశించి కాల్చి చంపుతాడు. మాధవరావు మాష్టారుగారి శిష్యుడు, పోలీసు రంగనాయకులు మేనల్లుడు అయిన చంద్రం రంగనాయకులు ఇంట్లోనే ఉండి చదువుకుంటూ నగరంలోని విద్యార్థి వుద్యమంలో ప్రధానంగా పాల్గొంటూ వుంటాడు. మాధవరావుగారి స్థానంలో పనిచేసే కార్యకర్త వరదయ్యను కూడా పోలీసులు అరెస్టు చేసి చిత్రహింసలకు గురిచేసి చంపేస్తారు. వరదయ్య కుటుంబానికి పనిపాటలలో సిద్దారెడ్డి అనే మరొక కామ్రేడ్ గ్రామ కమిటి నిర్ణయానుసారం సహకారాన్ని అందిస్తూ వుంటాడు. వరదయ్య చెల్లెలు బాలామణిని భూస్వామి గురునాధరెడ్డి గుండాలు చెరిచి చంపేస్తారు. కోపోద్రేకులైన గ్రామప్రజలు పార్టీ నాయకత్వంలో గురునాధరెడ్డిని చంపేస్తారు. అదే గ్రామానికి క్యాంపుకు వచ్చిన పోలీసు రంగనాయకులుకు పిచ్చెక్కుతుంది. రంగనాయకులు కుటుంబం ఆర్థికంగా దెబ్బతింటుంది. వేశ్యావృత్తికో, లేక పోలీసుల గూఢచారి వృత్తికో వెళ్ళటం తప్ప వేరే గత్యంతరం లేదని భావిస్తూ రంగనాయకులు కుమార్తె "రమ" బావ చంద్రానికి ఉత్తరం రాస్తుంది. అప్పటికే గ్రామంలో విషమించిన పరిస్థితులతో అజ్ఞాతవాసానికి పోయిన చంద్రం, తన గుండెలో లేక తనుంటున్న అడవి తల్లి వడిలో తప్పక రమకు స్థానం ఉంటుందని విప్లవానికి పునరంకితం కావాలని సమాధానం రాస్తాడు – ఇదీ సూక్ష్మంగా

కథాంశం – ఈ కథాంశాన్ని తీర్చి దిద్దటంలోనే అవగాహనంతా వుంది. అందలి పాత్రలను, ఆ పాత్రల సామాజిక జీవితాన్ని చిత్రీకరించటంలో రచయిత అవగాహన ఏ మేరకు సఫలీకృతమైందో మనం ముఖ్యంగా పరిశీలించవలసిన ఆవశ్యకత వుంది.

ఈ నవలా చిత్రణలో పోలీసు రంగనాయకులు ఒక ప్రధాన పాత్ర. రచయిత పాటగా రాసి విరివిగా ప్రచారం పొందిన పోలీసు పాటకు ఈ నవలలోని పోలీసు పాత్ర కొనసాగింపని దానికి రచయిత విపులీకరణం మనం ముందు మాటలో చూస్తాం. కాని పాటలో "పొట్టకూటికి నీవు పోలీసువైనావు" అన్నచోట ఆ పాటలోని పోలీసు పట్ల మనకు ఏర్పడే సానుభూతి ఈ నవల లోని పోలీసు రంగనాయకుల పట్ల ఏర్పడదు. దీనికి ప్రధాన కారణం పాత్ర చిత్రీకరణే. ఈ నవలలో పోలీసు రంగనాయకులు 50 వేల రూపాయల కోసం ఆశపడి రామన్నను వెదికి చంపుతాడు. కాని ఆ డబ్బు రంగనాయకులుకు దక్కకుండా పై ఆఫీసరు మింగేస్తాడు. నవలలో చివరిదాకా రంగనాయకులు ఈ డబ్బుకోసమై ఏడుస్తుంటాడు. చివరకు పిచ్చివాడవుతాడు. తన చేతుల్తో విప్లవ కారుణ్ని చంపిన పోలీసు సంతోషంగా లేకపోవటానికి కారణం తాను చేసిన పనికి సిగ్గుపడటమో, పశ్చాత్తాపడటమో కాదు, కేవలం తనకు రావలసిన 50 వేల రూపాయలు పై అధికారి కాజేశాడనే. అలానే ఇతర పోలీసులందరికీ పై ఆఫీసరు పట్ల ద్వేషం కల్గడం – రంగనాయకులకు రావలసిన డబ్బును పై అధికారి కాజేసినందుకే కాని మరో వైరుధ్యమున్నట్లు చిత్రీకరించటం జరగలేదు. పైగా దాదాపు 20 సంవత్సరాలు పోలీసు వుద్యోగంలో వుండి పోలీసు అధికారుల నైజం రంగనాయకులుకు తెలియనట్లు చిత్రీకరించడము జరిగింది.

నిజంగా రంగనాయకులకు ఆ 50 వేలు డబ్బే వచ్చిఉంటే హాయిగా పిల్లలను పెద్ద పెద్ద చదువులు చదివించుకొని రమకు మంచి కట్నం ఇచ్చి ఓ వరుణ్ని తెచ్చేవాడేకాని పశ్చాత్తాప పడేవాడు కాదు. రంగనాయకులు పశ్చాత్తాపం, విచారంగా వుండటం అంతా తనకు డబ్బు రాలేదనే. అలా కాకుండా పై అధికారుల వత్తిడికి లొంగిపోయి నక్సలైట్ నాయకుడ్ని చంపినందుకు రంగనాయకులు పశ్చాత్తాప పడుతున్నట్లో, బాధపడుతున్నట్లో చిత్రీకరించడం జరిగి ఉంటే మనకు "పొట్టకూటికి పోలీసైన" రంగనాయకులు పాత్రపైన సానుభూతి వుండేది.

మనం మొదటిగా నవల పేరు "మా పల్లె"ను గురించి వినగానే స్పందిస్తాం. మనది ప్రధానంగా వ్యవసాయక దేశం. పల్లెలు ఎక్కువ, గ్రామ ప్రాంతాలలోని పీడిత ప్రజానీకం నేడు భూమికోసం, భుక్తికోసం, విముక్తికోసం, ఈ భూస్వామ్య వ్యవస్థపైన ఈ దోపిడీ పాలనపైన పోరాటాలు చేస్తున్నారు. విప్లవ రచయితలు, ప్రజా కళాకారులు ఆ పోరాటాలలో పాలుపంచుకుంటున్నారు. కాని ఈ నవలలో వీటి చిత్రీకరణ సమగ్రంగా లేదనేది మనకు "మా పల్లె"లో ప్రవేశిస్తే తెలుస్తుంది. విప్లవ నవలలనేవి విప్లవ పోరాటాలను మాత్రమే వర్ణించేవిగా వుండాలనుకోవటం వలన పోరాట ఉపరితలాన్ని మాత్రమే ప్రతిబింబించి పోరాటానికి భూమిక అయిన ప్రజా జీవితాన్ని, వైరుధ్యాలను, ఆర్థిక, రాజకీయ, సాంఘిక, తాత్వికపరమైన సమస్యలను చిత్రీకరించటం అనే ప్రధాన భాగాన్ని వదిలి వేయటం జరుగుతుంది. మన సాహిత్యం, కళలు ముఖ్యంగా పీడిత ప్రజానీకానికి వుపకరించాలి. మన లక్ష్యాన్ని మనం చేరుకోవటానికి మన మార్క్సిస్టు సిద్దాంత పునాదిని, భావజాలాన్ని పునరాలోచించుకోవలసిన అవసరం

ఎంతైనా ఉంది. అందుకై నిండు మనసుతో ఏ ప్రజల కొరకై మనం సాహిత్యాన్ని చేపట్టామో వారి నిత్య పోరాటాల్లో భాగం పంచుకోవలసిన అవసరం వుంది. అందుకై మనం మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచన విధానంతోపాటు మన సమాజాన్ని అధ్యయనం చేయటం ప్రధానం.

మన రచనలు పరిపూర్ణంగా వుండాలన్నా, మనం నిజంగా ప్రజలకు సేవ చేయాలన్నా విప్లవ రచయితలు అయిన ప్రతి ఒక్కరూ తప్పక (1) మార్క్సిజం లెనినిజం మావో ఆలోచనా విధానాన్ని అధ్యయనం చేయటంతో పాటుగా. (2) సమాజాన్ని అధ్యయనం చేయటం, (3) ప్రజా పోరాటాల్లో పాలుపంచుకోవడం అనే మూడు ముఖ్య కర్తవ్యాలను నిర్వహించవలసి ఉంది. ఇందులో మనం దేనిని నిరాకరించినా మంచి రచనలు చేయలేమనేది వాస్తవం.

ముఖ్యంగా మనం మార్క్సిజాన్ని చదవటం మన రచనల్లో శాస్త్రీయ భావాలను, వుపన్యాసాలను గుప్పించటానికి మాత్రం కాదు. సమాజాన్ని గతితార్కిక భౌతికవాద దృష్టితోను, గతితార్కిక చారిత్రక దృష్టితోను, పరిశీలించి అర్ధం చేసుకోవటానికి మాత్రమే

అలానే సజీవ పాత్రలను, సంఘటనలను చిత్రించాల్సిన విప్లవ రచయితలు, కళాకారులు సమాజాన్ని కూడా అధ్యయనం చేయాలి. ప్రాంతీయ జీవిత విధానాన్ని ఆచార వ్యవహారాల్ని కూలంకషంగా అవగాహన చేసుకోవాలి. సమాజంలోని వివిధ వర్గాలు, వాటి సంబంధాలు, ప్రధాన వైరుధ్యాలు అంతర్గత వైరుధ్యాలు వాటి స్థితిగతులు, స్వరూప స్వభావాలు క్షుణ్ణంగా తెలుసుకోవాలి. శాస్త్రీయంగా అవగాహన చేసుకోవాలి.

ప్రజా పోరాటాల్లో పాలుపంచుకోవడం ద్వారా ఆచరణలో పరిక్షించుకొని సరిదిద్దుకోవాలి. వీటిని మనం నిర్లక్ష్యం చేస్తే మన రచనలు పేలవంగా నిర్జీవంగా కేవలం నినాదప్రాయంగా సిద్ధాంత చర్చగా, వుపన్యాస వేదికగా తయారవుతాయి.

ఇందుకు మనం "మాపల్లె"లో అనేక ఉదాహరణ లివ్వవచ్చు. ముఖ్యంగా "మా పల్లె"లో దోపిడి వర్గాలకు – ప్రజలకు మధ్యనున్న వైరుధ్యాలు కాని, దోపిడి వర్గాల మధ్యనున్న అంతర్గత వైరుధ్యాలు కానీ, లేక ప్రజల మధ్యనున్న అంతర్గత వైరుధ్యాలు కానీ సమగ్రంగా చిత్రీకరించటం జరగలేదు. అందుకు ప్రతిగా వుపన్యాసాలు, నినాదాలు, ఊరేగింపులు, విరివిగా చోటుచేసుకొని నవల వూరేగింపులను, బహిరంగ సభలను చూపిన డాక్యుమెంటరీగా చిత్రీకరించటం జరిగింది.



ప్రధానంగా పీడిత ప్రజలు చైతన్యం కావటానికి, పోరాటక్రమంలో సన్నద్ధం కావటానికి, విప్లవించటానికి సమాజంలోని వర్గ వైరుధ్యాలు ప్రధాన కారణం – అనగా సమాజంలోని వుత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మధ్యగల వైరుధ్యాలు, ఈ వైరుధ్యాల పెరుగుదలే పీడిత ప్రజలను చైతన్యవంతం చేసి విప్లవ పోరాటాలవైపు నడిపిస్తాయి. గ్రామాలలో ప్రధాన వుత్పత్తిశక్తి అయిన భూమి కొద్దిమంది చేతిలో ఉండటం – ఈ వ్యవస్థకు కీలకమైన అంశం. ఈ కీలకాంశాన్ని తుత్తునియలుచేసి, ఉత్పత్తి సంబందాలలో మార్పు తేవటమే విప్లవ ప్రజానీకం ముందున్న కర్తవ్యం. వర్గ చైతన్యానికి ఇరుసులాంటిది ఈ భూ సమస్యే. నేటి వరకు దేశంలో వచ్చిన తెలంగాణా, నక్సల్బరీ, శ్రీకాకుళం, కరీంనగర్, ఆదిలాబాద్ తదితర చోట్ల ప్రజల్లో వచ్చిన చైతన్యం, ఆ క్రమంలో వచ్చిన వుద్యమాలు, పోరాటాలు అన్నీ కీలకమైన ఈ భూసమస్య చుట్టూ తిరిగినవే. అలానే 'మాపల్లె' నవల్లో ఈ కీలకాంశం చుట్టు కథను నడిపించటంపోయి కేవలం భూస్వాములను, దోపిడీ దారులను ప్రస్తావించి, వైరుధ్యాల పెరుగుదలను పోరాట క్రమాన్ని సమగ్రంగా చిత్రీకరించకుండా పరిష్కారం చూపడం; అంటే గురునాధరెడ్డిని (భూస్వామ్యం) ప్రజలందరూ కసితో చావబాదటం చిత్రీకరించం జరిగింది. అలా కాకుండా దోపిడీ వర్గాల మధ్యనున్న వైరుధ్యాలను పెంచి, విశాల ప్రజానీకానికి, దోపిడీ వర్గాలకు – మధ్య నున్న ప్రధాన వైరుధ్యం భూసమస్యపైన కేంద్రీకరించి, భూమిని కాపాడుకోవటానికి, పీడిత ప్రజానీకం తమ ప్రాణాలకు తెగించి చైతన్యవంతంగా ఎలా నిలుస్తారో, పోరాడుతారో చిత్రీకరించి, దానికి శాస్త్రీయమైన పరిష్కారాన్ని సూచించటం జరిగి వున్నట్లయితే "మాపల్లె" "విప్లవాల యుగం మనది – విప్లవిస్తే జయం మనది" అనే సత్యానికి ప్రతీకగా నిలచివుండేది.

అలాగే గురునాధరెడ్డితో విశాల ప్రజానీకానికి గల వర్గ వైరుధ్యాలతో ప్రజలను చైతన్యపరచి బాలామణిని గురునాథరెడ్డి గూండాలు చెరచిన సంఘటనతో ప్రజలందరూ వర్గకసితో గురునాథరెడ్డిని చావబాదటం జరిగి ఉంటే వాస్తవంగా వుండేదేమో. ఒక వైపు ప్రజలందరితో "అమరవీరుల ఆశయాన్ని నెరవేరుద్దాం" అని అనిపించి "ఖతము" చెయ్యాలనే సెన్స్‌ను బయటకు లాగాలి. కాని, ప్రజలు చంపాలనుకోలేదు, తలోదెబ్బ వేసేటప్పటికి గురునాథరెడ్డి చచ్చాడని చిత్రీకరించటం జరిగింది. ఇందుకు ప్రధాన కారణమేమిటో మనందరకు తెలిసినదే. కాని ఇచ్చట "దళాలు" ప్రజాసమీకరణ లేకుండా చేసే ఖతం కార్యక్రమానికి, ప్రజలందరూ చైతన్యవంతమైన తరుణంలో చూపిన వర్గకసికి తేడాను రచయిత విస్మరించామేమోననిపిస్తుంది.

అలానే చివర వరకు "రమ" పాత్రను చైతన్యవంతంగా చిత్రీకరించి చివరలో తన కుటుంబ ఆర్థిక పరిస్థితినిచూసి వ్యభిచారమో లేక పోలీసులు కోరినట్లు సి.ఐ.డి. పని చేయటమో ఏదో ఒకటి చేయాలనుకుంటునట్లు భావిస్తూ చంద్రానికి ఉత్తరం రాయటం ఆ పాత్రకు న్యాయం చేకూర్చటము కాదు. అలానే "రమ వంటపనిలోని తృప్తి"ని శ్రామిక సౌందర్యంగా, శ్రమశక్తివలన పొందే చైతన్యంగా చంద్రంలాంటి విప్లవ చైతన్యంగల పాత్రకు గోచరం కావటము చంద్రం పాత్రను కూడా ఓ మెట్టు క్రిందకు దిగజారుస్తుంది. మరలా "రమ" పాత్ర శ్రమకూ తనకూ వేల మైళ్ళ దూరం – అనుకోవటం చూస్తాం.

ఇలా పాత్ర చిత్రీకరణలో కొన్ని లోపాలున్నా మొదటి ప్రయత్నంగా విప్లవ నవలకు ఒక రూపును, ఊపును దిద్దిన ఘనత కా॥ చెరబండ రాజుకు దక్కుతుంది. "నూతన" మాసపత్రిక 1980 జనవరి & ఫిబ్రవరి ★★★

# 2. కొలిమంటుకున్నది

"మన సాహిత్యం, కళ ప్రజలకు సేవజెయ్యాలి" – "లెనిన్"

అఖండమైన శ్రామికవర్గ వుద్యమంలో అంతర్భాగమైనప్పుడే పై ఆదేశం వాస్తవం కాగలుగుతుంది. దాని కోసం జనం భాషనీ భావాన్నీ రచయిత సంతరించుకోవడం తప్పనిసరి. సిరిసిల్ల, జగిత్యాల ప్రాంతాలలో సాగుతూన్న రైతాంగ పోరాటం, భారతదేశంలో వ్యావసాయిక విప్లవానికి ఇప్పట్లో ఆశాజ్యోతి. ఈ ప్రాంతానికి చెందిన మాండలికంలో, పోరాట ప్రజలకోసం, అల్లం రాజయ్య "కొలిమంటుకున్నది" నవల – నిజానికి, దీర్ఘకాలిక విప్లవ పోరాట క్రమంలో ప్రజ్జ్వరిల్లేముందు రగులుకుంటున్న ప్రజా జీవిత వాస్తవానికి సూక్ష్మమైన సాహిత్య ప్రతిబింబం. అట్టడుగు స్థాయిలో కష్టాలకూ, కన్నీళ్ళకూ గురౌతూనే పోరాట చైతన్య రూపమైన రైతు– కూలి సంఘాలద్వారా వ్యవస్థనే ఎదిరిస్తూన్న ప్రజా జీవితానికి అక్షరచిత్రం.

ఈ నవలలో పాత్రలైనా ఘటనలైనా కల్పితాలు కావు, అబద్ధాలంతకంటే కావు. పదునెక్కుతున్న నేటి సామాజిక వాస్తవంలోని అంశాలన్నీ యిందులో నిలిచాయి. దానికితోడు రచయితకుగల అవగాహన సమస్తం, ఈ పోరాటాన్ని దృఢంగా నిలుపుకుని, విప్లవ శ్రేణుల్ని ఐక్యంచేసి, వర్గ శత్రువును ఎదుర్కొనే రాజకీయ శక్తులకు సాంస్కృతిక శక్తి బాసటగా నిలవాలనేది గనక, ఆచరణకు సంబంధించింది. అప్పుడు రచయితకూడా పోరాటకారుడౌతున్నాడు సాంస్కృతిక సైనికుడు. అందుచేతనే ఆ జనం భాషా, యాసా పట్టుబడ్డాయి.

ఒకానొక మాండలికంలో వుండటంవల్ల ఈ నవలను అనేకులు చదవటం లేదని, ఇది సీరియల్ రూపంలో 'సృజన' లో వచ్చినప్పటి వుత్తరాలు కొన్ని తెలియజేశాయి. "పాఠకులు తగ్గి శ్రోతలు పెరిగిన్రు" అని వరవరరావు గారు రాసిన పీఠిక చెప్పేది. అదొక్కటేగాక, పోరాటప్రాంత ప్రజలు ఈ నవలను చదువుకోలేక చదివించుకుని వింటున్నారనే "అద్భుతమైన" విషయాన్ని కూడా. ఇతర ప్రాంతాల పాఠకుల సంఖ్య తగ్గితే (అసలే లేకుండా పోలేదు) అంతగా నష్టపోయేది లేదు. ఈ మాండలికం మూలంగానే జనం చదివించుకుని వింటూ, తమ పోరాట పటిమను పెంచుకుంటున్నారు. ఆ నష్టంకంటే ఈ లాభం ఎన్నోరెట్లు పెద్దది, పైగా అవసరమైనదీ. మామూలు పత్రికా సీరియల్ భాషలోనే నవల రాసివుంటే, పోరాటానికి దూరంగా వున్న పాఠకులు చదివి సెబాసనేవారేమో, అంతే! సాహిత్య పరంగా విప్లవోద్యమానికి కావలసిన చేవనీ సత్తానీ కలిగించేది కాదు. ఎంతో దీక్షగల రచయిత కాబట్టే, మిత్రులతో చర్చించీ, పాత్రలకు మూలాలైనవారితో తిరిగి మాట్లాడీ, మార్చీ, సంఘటనాక్రమాన్ని గుర్తించి శాస్త్రీయమైన అవగాహనను క్రమక్రమంగా వాడెక్కించుకునీ, సాంస్కృతిక సైనికుడుగా కృతకృత్యుడయ్యాడు రాజయ్య.

భూమి వుత్పత్తి సాధనాలలో ముఖ్యమైన మన వ్యావసాయిక దేశంలో, భూమిమీద తమ సొంత ఆస్తి హక్కుని, భూమి తక్కువగానున్న వారిమీద, అసలే భూమిలేని వారి మీద, పెత్తనానికి దౌర్జన్య దుర్మార్గాలనే ఆధారంగా చేసుకుంటున్న భూస్వాములు – ఆ ప్రాంతంలో 'దొరలు' – , వారి కెదురుగా రైతులు, రైతుకూలీలు సాగిస్తూన్న యీ సంఘర్షణ గురించి, దీని పరిష్కారం గురించి, సవ్యమైన దృక్పథం సాధించడం చాలా కష్టం. రాజయ్య చాలా వరకు దీన్ని సాధించాడు.

ఓటమి– గెలుపు, ఆటూ– పోటూ– యిలా పడుతూ మరింత పైకి లేచే వుద్యమ తరంగం గతి భేదాలను గుర్తించాడు. ప్రజల అనుభవాలను ప్రజల భాషలోనే చెప్పించడం అవసరమై చెప్పించాడు.

నేటి పోరాటానికి ముందుండిన పరిస్థితులతో ప్రారంభించి, క్రమంగా పదునుదేరి మార్పుకు లోనౌతూ వచ్చిన పరిస్థితులను చిత్రిస్తూ, చివరకు పోరాటనికే తయారైన చైతన్యదీప్తితో యీ నవల యితివృత్తం ముగుస్తున్నది. పోరాటం గతి– తర్కం సూక్ష్మరూపంలో అక్షరబద్ధమైన యీ నవల, నిజంగా గొప్పది. రాజుకుని రాజుకుని గానీ రగుల్కోదు గదా. మంట రగుల్కొన్నాక అంటుకోవడమే తరువాయి. ఈ ఆశాభావం సూచనగా కనిపిస్తుంది చివర్లో.

గ్రామీణ వ్యవస్థలో ఉత్పత్తి సాధనాల సొంతదార్లై, వడ్డీలనీ, తగవు తీర్పులనీ, తప్పుల దండగలనీ, కానుకలనీ దిక్కు దెసలేని పేదసాదలనుంచి డబ్బు గుంజి మరీ జులుం సాగించే దొరలూ, వారికింద పటేల్, పట్వారీ, షావుకార్ వగైరాలు, వీరందరి వెనక నిలిచి వీరి ప్రయోజనాలకు రక్షకభట కవచాన్నీ లాఠీ– తూటా సాయాన్నీ అందించే ప్రభుత్వం ఒకవైపున–

చెమట నుంచి సంపద సృష్టించి తాము పండించిన బంగారు పంటలు సమస్తం తమకు దూరమైపోతుంటే, తిండి నందించే తమకే ఈ కనీసావసరం దక్కకపోతుంటే, దోపిడీకి గురౌతున్న జనసామాన్యం ఇంకొక వైపున –

చారిత్రక శక్తులు అనిర్దిష్టంగా గాక, వ్యక్తులుగా నిర్దిష్టంగా కనిపిస్తున్నాయి. కలదెలుసుకుని కూడబలుక్కుని కట్టుగట్టినప్పుడు ఈ వ్యక్తులే మహా చారిత్రక శక్తుల సమష్టి స్వరూపంగా రూపొందుతున్నారు.

“ఒక్కీత ఆవును సుక్క రకుతం బొట్టు అడువకుంట తిని మీసాలు తుడుసు కుంటున్న పెద్దపులుల తీర్గ సూత్తనే ఉచ్చపడేటట్టుగున్న” ప్రతాపరెడ్డి లాంటి దొరలు – గ్రామం అరణ్యం అయితే, అందులో బెబ్బులులు.

“నోరిప్పితే తిట్లు, సెయ్యెత్తితే ఎవనీపో పగలటము, కనుబొమలు ముడిస్తే ఎవని కొంపలో ముంచటము,” లాంటి దౌర్జన్యాలు చేసే బాలమల్లు లాంటి షావుకార్లు – తోడేళ్ళు.

“దొర చేతులకు, మాటలకు అడ్డంరాని” మాలిపటేళ్ళు, దొరెనక దొరంతటి వాళ్ళు ముకుందరెడ్డి లాంటి వాళ్ళు – కొర్నెపోతులు.

“ఊల్లో ఉన్నోల్లందరి సెమటను, సెత్తలను మింగిన గల్లపెట్టె” కలిగిన రామలింగంలాంటి షావుకార్లు – వూరబందులు.

“దొరల రోమం బీకను” చేతగాక కానూన్లెక్కువయ్యాయని విసుక్కుంటూ, పేదలను “నకురాల్ సేత్తె దొడ్లె దొల్త” ననే పోలీసు అమీను సాబ్ – రేచుకుక్కలు.

దొరల పనులంటే మారుమాట మాని చేతులు కట్టుకుని జనం మీదికి కాలూ చెయ్యీ యెత్తే ప్రభుత్వోద్యోగులు – క్షుద్ర మృగాలు.

వీళ్ళంతా దోపిడి గడీ దొరల సాధనాలైతే, మరోపక్క –

‘భూదేవర’ నే నమ్ముకుని 'కండ్లల్లకు రకుతం తెచ్చుకుని సోలెడు నెత్తురు పురిసెడు సెమట కారంగ ఆరుగాలం కొట్టి పోసుకున్న కంచంలకు

బువ్వరాక'', దున్నేటోనికే భూమి రానంతవరకూ ఈ అన్యాయం అంతం కాదని గ్రహించిన రైతుకూలీ నర్సిమ్ములు.

"జీతం గొంటబోయి గౌండ్లిల్లల కల్లుకు పారబోసుచ్చి పెండ్లాన్ని గొడ్డును గొట్టినట్లు కొట్టే గుడ్డెగాల్ల సెందిరులు''.

"రాత్రి పగలు కంట్లె కనిపాపలు ఒంపుకొని ఇంట్ల పోరగాండ్ల నిడిసిపెట్టి దొరల పొలాలు పసిగుడ్డీలె సాదుకచ్చి'', సకాలానికి జీతాలందక కటకటపడే బొత్తయ్య లాంటి 'నీరటికాండ్లు'

దొరల కామానికి క్రౌర్యానికి బలై, "కడుపులో సొద కడుపులోనే వుంచి కొసరాయి రవ్వోలె బ్రతకునీడుస్తూ", అదే దొరలు కానిపనికి పురమాయిస్తే సరేననే నిస్సహాయులు ఎంకమ్మలాంటి అప్పజెల్లెళ్ళు.

"రాత్రి పగలు పన్జేసి పన్జేసి కూడులేక నిరిగెబడి– '' రోగాలొచ్చి సచ్చిన ఎదిగిన కొడుకుల్నీ కట్టుకున్న భార్యనూ పోగొట్టుకొని "గుడిసెల సిప్ప సుత లేక'' – భూమైనా వుండాలి లేదా, తుపాకిలతోనైనా దాన్ని తెచ్చుకోవాలనుకునే గుడ్డిగట్టయ్యలు.

ఎన్నెన్నో తిప్పలుబడి "కాకుల గద్దల నుండి బల్లి తీర్గ'' తన పెరడికి అంటిపెట్టుకుని కాపాడుకునే సాంబయ్యలాంటి పేద రైతులు.

సాలు సాలుకూ కర్రకర్రకూ చెమట కాలువలు గట్టి పారుతూంటే, పెళ్ళపెళ్ళకీ నెత్తురు కారుతూంటే, చిలకల్నీ నక్కల్నీ తరిమికొట్టి సాక్కున్న పెరట్లో... ఆకలి కాగలేక నాలుగు కంకుల్ని కోసుకుని తిందామని, దొరకంట్లోబడి ప్రాణాలే పోగొట్టుకున్న రాయెపోశాలులు.

ఇలాంటివాళ్ళు——"పండిచ్చేది మనం తినేది ఇంకోళ్ళు" అని తెలుసుకున్నారు. వెయ్యిమందిని ఒక్కదొర ఆడుత్తుండంటె – ఎయ్యి సేతులు ఒక్కటయితే ఏమవతదో" నని, "సత్తె కొట్లాడుకుంటనే సత్త" ననే కుర్రకారు చంద్రయ్యలు.

ఇలా ఎన్నో! ఇవన్నీ సంఘటనలతో పడుగుపేకల్లా అల్లుకుపోయాయి. ఈనాడు చెన్నారెడ్డి "కల్లోలిత ప్రాంతం"గా ప్రకటించిన యీ ప్రాంతంలోని ప్రజల ఏడుపులు, గుండె చప్పుళ్ళు, అరుపులు, కేకలు, నినాదాలు యీ నవలలోని మాటలు. ఇవే నేడు ఈటెలు, రేపు తూటాలు. ఇందులోంచే పెరగాలి అజేయమైన జనందండు... వట్టికోట ఆళ్వారుస్వామి ప్రజల మనిషి, గంగు మళ్ళీ యిప్పుడు రూపాంతరం చెంది, సంస్కరణల గురించిగాక, భీషణ విప్లవ పోరాటాలలో పాల్గొంటున్నారా ? తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం రివిజనిస్టులు కట్టిన సమాధి నుంచి సింహంలా గర్జిస్తూ లేచి నడుస్తూందా ?

– "అరుణతార" త్రైమాస పత్రిక (1980 మార్చి)

★★★

"విప్లవ రచయితలూ, కళాకారులూ

రచ్చకు లాగేది ప్రజలను కాదు

వారిపై దౌర్జన్యమూ, దోపిడీ చేసి, హింసించి,

తమ దుష్ప్రభావాన్ని ప్రజలపై చూపే వారిని మాత్రమే". – మావో

## 3. ఇన్ క్రెడిబుల్ గాడెస్ నవల– ఒక పరిశీలన

డాక్టరు కేశవరెడ్డిగారు “క్షుద్రదేవత” నవలకు దళితుల దాస్య ప్రవృత్తిని కథావస్తువుగా స్వీకరించి చిత్తూరు జిల్లా వ్యవహారిక భాషలో ప్రతిబింబించారు.

భారతదేశంలో కనీసం రెండువేల సంవత్సరాలుగా, అమానుషంగా, పరమ నీచంగా పీడనకు, దోపిడీకి గురువుతున్న వర్గం పంచములనే మాల మాదిగలు. వీరు దేశ జనాభాలో దాదాపు 15 శాతం వరకు ఉంటారు. అత్యధికులు గ్రామాల్లోనే నివసిస్తున్నారు. పేదరికం వీరి సొత్తు. మన గ్రామీణ వ్యవస్థలో వీరికోసం నిన్న మొన్నటి వరకు కొన్ని ప్రత్యేకమైన పనులు కేటాయించబడి వుండేవి. ప్రస్తుతం దేశములో పాదుకొనివున్న వ్యవస్థలో వీరిలో ఎక్కువ భాగం గ్రామాల్లోని భూస్వాములు, ధనిక రైతుల భూములలో కూలీలుగా, పాలేళ్ళుగా పనిచేస్తున్నారు. వీరంతా ఇప్పటి వరకు ఈ దేశంలోని అగ్రవర్ణాలుగా వున్నవారిచేత సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా దోచబడుతున్నారు. ఈ దోపిడీకి, పీడనకూ వ్యతిరేకంగా దళితుల్లోని కొంతమంది అప్పుడప్పుడూ తమ అసంతృప్తిని, తిరుగుబాటును వ్యక్తం చేయటం జరిగింది. కాని రాజకీయాధికారం ఈ దేశంలోని అగ్ర వర్ణాల చేతిలో వుంటూ ఈ తిరుగుబాటు ధోరణులను, అందుకు కారకులైనవారిని అనేక ఘోరమైన చిత్రహింసల పాలుచేసి అణచివేసిన సంఘటనలు మన సామాజిక చరిత్రను తరచిచూస్తే మనకు గోచరమవుతాయి.

హిందూ రాజుల పాలనలోగాని, మహమ్మదీయ రాజుల పాలనలోగాని వీరి జీవితాల్లో చెప్పుకోదగ్గ మార్పేమీ రాలేదు. ఇంగ్లీషువారి పాలనలో అధిక సంఖ్యాకులుగా ఉన్న దళితుల్ని తమవైపు ఆకర్షించుకోవడం కోసం బ్రిటిష్ సామ్రాజ్యవాదులు వీరిని క్రైస్తవ మతంలో చేర్చుకొని విద్యగరిపి, ఆర్థిక సహాయం చేశారు.

కాని సామ్రాజ్యవాదులు ఈ దేశంలోని రాజ్యాధికారాన్ని ప్రత్యక్షంగా వదులుకోవలసి వచ్చినప్పుడు తప్పనిసరిగా ఈ దేశంలోని దోపిడీ అగ్రవర్ణాలకే అధికారాన్ని దఖలుపరిచారు.

జాతీయోద్యమ కాలంలోను, ఆ తరువాతను కొంతమంది సంస్కరణ వాదులూ, అభ్యుదయవాదులూ వీరి అభ్యున్నతికి పాటుపడటం జరిగింది. వారుకూడా తమ ఉనికికి చలనం లేనంత వరకు మాత్రమే చేసారనే విషయం సత్యం. ప్రస్తుత దశలో వీరి సాంఘిక జీవితంలో కొంత వెసులుబాటు కలిగినా అదీ నామమాత్రమే అయ్యింది. “అంటరానితనం నేరం” అనే చట్టం అమలులోవున్నా ఇప్పటికీ అనేక గ్రామీణ ప్రాంతాలలో భయంకరంగా ఈ జాడ్యమున్న విషయం మనందరకు తెలిసిందే. చట్టం చేసిన ప్రభుత్వమే ఇదొక భయంకర జాడ్యంగా ఈ మధ్యనే గుర్తించిన చందంగా “అంటరానితనం నేరం” అనే నినాదాలను ప్రచారం చేయ్యటం మన “జాతీయ” బస్సులపై చూస్తున్నాం.

దేశంలో పెరుగుతున్న యంత్ర పరిశ్రమల వలన పట్టణ కార్మిక వర్గంలోని దళితుల్లో కొంత చైతన్యం పెరిగినా, గ్రామాలలోని ఈ వర్గంలో చైతన్యంపాలు తక్కువే. బూటకపు ఎన్నికలు, సోషలిజం కబుర్లు, గరీబీ హటావో నినాదాలు, రాజభరణాలు రద్దు, బ్యాంకుల జాతీయం, ఇళ్ళస్థలాలు, మిగులుభూమి పంపకం, హరిజన, గిరిజన అభ్యుదయ పథకాలు, దళితుల్లో దినదినం ప్రజ్వరిల్లుతున్న చైతన్యాన్ని ప్రక్క దోవ పట్టిస్తూ పాలక వర్గాల దోపిడీ ప్రయోజనాలను కాపాడుతున్నాయి.

ఈ దేశంలోని ‘వామపక్షాలు’ వర్గపోరాటానికి తిలోదకాలిచ్చి, వర్గ సామరస్యాన్ని బోధిస్తూ, దోపిడీ పాలక వర్గాల బూటకపు ఎన్నికల రొంపిలో కూరుకుపోయి, దోపిడీ వర్గాలకు తోకలుగా తయారయి వర్గ పోరాటంలో ప్రధాన పాత్ర వహించవలసిన ఈ దళిత వర్గాల్ని చైతన్యపరచటంలో విఫలమైపోయాయి.

ఇటువంటి క్లిష్టదశలో నగ్జల్బరీలో భూమికోసం, భుక్తికోసం, ఈ దోపిడీ వర్గాలపై పీడిత ప్రజలు పోరాటాన్ని ప్రారంభించారు. ఆ పోరాట సాంప్రదాయ చైతన్యంతో దేశవ్యాపితంగా పీడిత ప్రజలు తమ విముక్తి బాటను ఎంచుచున్నారు. ఈ పీడిత ప్రజల్లో దళితులు ప్రధాన పాత్ర వహిస్తున్న విషయం గమనార్హం.

ఈ పది సంవత్సరాల కాలంలో దేశవ్యాపితంగా ప్రత్యేకంగా దళితులపై జరిగిన దారుణ హింసాకాండ, మానభంగాలు, గృహదహనాలు దళితుల పోరాట చైతన్యాన్ని అణచాలనే యత్నంలోని భాగాలే. ఆంధ్రదేశంలోని చిన ఓగిరాల, కరావులపల్లి, కంచికచర్ల, మోదుకూరు, పెరవలి, ఈమని మొదలగు అనేక గ్రామాల్లో దళితులపై జరిగిన దారుణ మారణ హోమానికి, దోపిడీ అగ్రవర్ణాల దురహంకారానికి ఛాయామాత్రపు ఉదాహరణలు మాత్రమే. ఇలా దేశ వ్యాపితంగా దళితుల్లో రెక్కలు విప్పుకుంటున్న చైతన్యాన్ని పాలక వర్గాలు, భూస్వాములు, హింసచే అణచాలనుకుంటున్నారు.

కాని ఈనాడు వారు ఒంటరిగా లేరు. ప్రపంచ వ్యాపితంగా దేశాలు స్వాతంత్ర్యాన్ని, జాతులు విముక్తిని, ప్రజలు విప్లవాన్ని కోరుకుంటున్న చరిత్ర గమనంలో ప్రపంచ పీడిత ప్రజ పోరాటపంథాలో తమ ఉనికిని దిద్దుకొంటున్నది. అందులో భాగంగానే భారత దేశంలోని పీడిత ప్రజానీకం అందులోని ప్రధాన పక్షమైన దళితులు చైతన్యంతో తమ విముక్తికై గ్రామీణ ప్రాంతాల్లో కూడా ఉప్పెనలా ముందుకు వస్తున్నారు. భూస్వాములు, దోపిడి పాలకులు వణకిపోతున్నారు. ఈ పరిస్థితికి అనుగుణంగా దేశ వ్యాప్తంగా ప్రజా కళలు, సాహిత్యము, పీడిత ప్రజా పోరాటాలను ప్రతిబింబిస్తూ అభివృద్ధి చెందుతున్నాయి – ఇదీ నేటి భారతం.

ఈ నేపథ్యంలో హరిజనుల దాస్య ప్రవృత్తిని కథాంశంగా తీసుకొని వెలువడిన నవల ఇది. సూక్ష్మంగా కథాంశాన్ని పరిశీలిద్దాం.

గంగపట్నం హరిజనవాడలోని ఓ వ్యవసాయ కూలి "రామచంద్రుడు". గ్రామ పెద్దరెడ్డి గారి పొలంలో రెండు సంవత్సరాలు రెక్కలు ముక్కలు చేసుకొని కొంప కట్టుకోటానికి కాస్తంత పోరంబోకు జాగాను పొంది ఇల్లు కట్టుకొని వుంటూ వుంటాడు – ఓ కేసులో పెద్దరెడ్డిగారి తరఫున దొంగ సాక్ష్యం చెప్పనందుకు రామచంద్రునిపై కంటు పెట్టుకున్న పెద్దరెడ్డిగారు పై అధికారులకు తెలియపరచి ఇల్లు ఖాళీ చేయమనే తాఖీదు పంపుతాడు – పెద్దరెడ్డిగారు కంటుతో ఇంత పని చేయటం న్యాయం కాదని అర్థించటానికి వెళ్ళిన రామచంద్రుడ్ని కదలించి కజ్జాకు దించి అచ్చట పనిలో నిమగ్నమై వున్న దాదాపు ఇరవై మంది మాలలు రామచంద్రుని స్పృహలేకుండా కొట్టి పంపిస్తారు. మరుసటి దినం అధికారులు పోలీసుల సమక్షంలో పెద్దరెడ్డిగారి పనిలోని మాలలు రామచంద్రుని ఇంటిని కూలుస్తారు. రామచంద్రుడు పెండ్లాం "నాగ" కొడుకు "కృష్ణుడు"తో మిగిలిన ఆస్తి అయిన ఇరవై పందులను తోలుకొని దూరంగా ఏదైనా గ్రామం పోయి బతకాలని ప్రయాణమై పోతూ వుంటాడు. దారిలో ఓ లారీ డ్రైవర్ నీళ్ళు పోసుకోవటానికై వీళ్ళు విశ్రాంతి తీసుకుంటున్న దాపులో ఆగి వీళ్ళ పరిస్థితికి జాలిపడి రామచంద్రుని కుటుంబాన్ని, పందులను లారీలో ఎక్కించుకొని ఓ రెండు వందల మైళ్ళ దూరంలోని ఓ బాటలో దించుతాడు. దాపులోనేవున్న "వొంటిల్లు" గ్రామం చేరి అచ్చటగల సత్రంలో ఆ రాత్రికి తలదాచుకుంటారు. ఉదయమే కూలిపని కోసం వెళ్ళిన రామచంద్రుడు ఆ గ్రామ మునసబుగారి కొబ్బరి చెట్లు నరికేపనిలో కుదురుతాడు. రామచంద్రుని కొడుకు "కృష్ణుడు" కొబ్బరి తోట వద్దకు వస్తాడు. దారి ప్రయాణంలో వేడిచేసి ఎన్ని చిట్కా వైద్యాలు చేసినా తగ్గకపోవటంతో కృష్ణుడుకు ఓ కొబ్బరికాయ కొట్టి నీళ్ళివ్వాలనుకుంటాడు రామచంద్రుడు. కాని మునసబు గారి తొత్తు మాల "కుట్టిగాడు" ససేమిరా కాయ ముట్టడానికి వీలుకాదంటాడు. కొడుకును సత్రానికి పంపి చెట్లు నరికే పనిలో నిమగ్నమవుతాడు రామచంద్రుడు. అంతలో సత్రంలో కాపురముండే తత్వాల తాతయ్య ఒగర్చుకుంటూ పరుగెత్తివచ్చి రామచంద్రుని పందులన్నీ

కానలోని కుంటవద్ద చచ్చిపడుండాయి అని చెప్తాడు. ఆ వార్త విన్న రామచంద్రుడు రివ్వున చెట్టు దిగి బాణంలా కానలోని కుంట దగ్గరకు దూసుకుపోయి చచ్చిపడివున్న పందుల్ని చూసి, పందుల్ని వదిలి ప్రక్కకు వెళ్ళిన భార్యను తిట్టి, కొట్టి కోపాన్ని తాపాన్ని దిగమ్రింగుకొని దిగాలుగా పందుల శవాల వద్ద కూర్చొని వుంటాడు. దారిన వెళ్ళే రైతులు ఈ ఘోరానికి సానుభూతి చూపి రామచంద్రుని ఊరడించి చచ్చిన పందుల్ని అమ్మిపెడ్తానంటాడు ఒక రైతు. ఆ రైతుకు ఆ పందుల శవాల్ని అప్పచెప్పి సత్రానికి చేరతారు రామచంద్రుడు, భార్య నాగ. సత్రం చేరిన కొంచెం సేపటికి మునసబుగారి ట్రాక్టరు వచ్చి సత్రం ముందు ఆగుతుంది. అందులోని హరిజనులంతా క్రిందకు దిగి చివరగా కృష్ణుని మృత శరీరాన్ని దించుతారు. ఆ దృశ్యాన్ని చూచిన రామచంద్రుడు అవాక్కయిపోతాడు. నాగ స్పృహ కోల్పోతుంది. టెంకాయ చెట్టెక్కి విరగబడ్డ వుదంతాన్ని ఓ హరిజనుడు చెబుతాడు. మునసబుగారు రామచంద్రుడ్ని ధైర్యంగా వుండమని చెప్పి, జరగాల్సిన పని చూడమని చెప్పి వెళ్తాడు. మసక చీకటిలో కృష్ణుడ్ని సమాధిచేసి రామచంద్రుడు, నాగ విలపిస్తారు.

ఉదయమే భార్యభర్తలు మరో వూరికి ప్రయాణం. దారిలో ఓ బండి రైతు తారసపడతారు – ఆ ఎడ్లబండిపై కొంత దూరం ప్రయాణించి ఓ మట్టి రోడ్డువద్ద దిగి దగ్గరలోని ఓ పురాతన దేవాలయం వద్దకు చేరుతారు – ఆ దేవాలయం ప్రాకారపు హద్దుగా వున్న ఓ తాటియాకుల పాకలో వుంటున్న తాగుబోతు అయిన అర్జునరెడ్డి వీళ్లకు తలదాచుకోవటానికి జాగా ఇస్తాడు. తెల్లవారు జామున గుడిచుట్టూ ప్రదక్షిణాలకై ఆ గ్రామ హరిజనవాడలోని మాలలంతా వచ్చి భజనచేస్తూ ప్రదక్షిణంచేసి తిరిగివెళ్ళి మాలపల్లెలోని భజన మందిరాన్ని చేరతారు – వాళ్ళతోపాటు మాలపల్లెలోకి వెళ్ళిన రామచంద్రుడ్ని సాతాని పూజారి పరామర్శించి ఎక్కడ వున్నది తెలుసుకొని అవాక్కయిపోతాడు. ఉదయమే తామంతా మాల రామచంద్రుడువున్న పాకచుట్టూ దేవుడి గుడితోపాటు ప్రదక్షిణం చేయటం వలన ఆంజనేయ స్వామికి ఉగ్రం వస్తుందని మాలపల్లి హతమై పోతుందని చెప్తూ వుంటాడు.

అంతలో "కలరా" మాలపల్లిలోకి కలరా వచ్చిందని జనం చచ్చిపోతున్నారని గగ్గోలుగా జనం పరుగెత్తి వస్తుంటారు. దీనంతటికి కారణం రామచంద్రుడు ఆ పాకలో వుండటం. తామంతా ప్రదక్షిణ చేయడం అని నిర్ధారించి రామచంద్రుడ్ని వెంటనే ఖాళీ చేయమంటాడు సాతాని పూజారి. సరేనంటు రామచంద్రుడు పరుగెత్తి వెళ్ళి పాకలోని సామాను తీసుకొని బయటపడతాడు. ఇది చూచిన అర్జునరెడ్డి రామచంద్రుని వారించి "ఈ పాకలో నేను కాపురముండగా లేని పాతకం నువ్వు కాపురముంటే వచ్చిందా" అంటూ వారిస్తున్న సమయంలో అచ్చటకు వచ్చిన సాతాని పూజారి కలుగజేసుకొని రామచంద్రునిపైకి కొట్టేదానికి దుముకపోతున్న సమయంలో అర్జునరెడ్డి సాతాని పూజారిని చితగొట్టి పంపిస్తాడు. ఆ రోజు రాత్రి ఆ పూరి కొంపకు ఎవరో నిప్పంటించగా లోపల అరుస్తున్న అర్జునరెడ్డి కేకలకు బయట నిద్రిస్తున్న రామచంద్రుడు లేచి రక్షించబోతాడు. తలుపుకు తాళం బిగించి వుంటుంది. ఓ రాతితో బద్దలుకొట్టి కాల్పులకు గురియైన అర్జునరెడ్డిని మోసుకొని వైద్యం సహాయం కొరకు గ్రామంలోకి బయలుదేరబోతాడు – అర్జునరెడ్డి వారించి తాను అట్టేసేపు బతకనని శరీరమంతా కాల్పులలో అమితతాపంగా వుందని లోపల గర్భగుడిలోని దీపపుసెమ్మెలోని ఆముదము తెచ్చి శరీరంపై పోసి తన తాపాన్ని తీర్చ మంటాడు – మాలవాడు గర్భగుడిలోకి పోకూడదని తిరస్కరించిన రామచంద్రుని దగ్గరకు రమ్మని పిలిచి సర్వశక్తులు కూడదీసుకొని కాండ్రించి రామచంద్రుని మొఖాన వుమ్మి కుప్పలా కూలిపోతాడు అర్జునరెడ్డి. ఇది సంక్షిప్తంగా కథాంశం.

ఈ కథాంశాన్ని తీర్చిదిద్దటంలో రచయిత సఫలతను, విఫలతను బేరీజు వేయవలసి ఉంది. పీడిత తాడిత వర్గాలకే అంకితమైన రచయితగా చెలామణి అవుతున్న రచయిత ఈ నవలలో హరిజనుల సమస్యలనీ, బాధల్నీ, కష్టాల్నీ, సుఖాల్నీ, ఏ మేరకు వాస్తవంగా చైతన్యవంతంగా చిత్రించి హరిజనుల ప్రయోజనాలను కాపాడిందీ, ఏ మేరకు హరిజనుల్ని

చైతన్యహీనులుగా చేసే భావాలను ప్రచారం చేసిందీ ముఖ్యంగా పరిశీలించాలి.

సాహిత్యానికి ముఖ్యంగా రెండు ప్రధాన లక్షణాలున్నాయి. పీడిత ప్రజలలో వైరుధ్యాలను తొలగించి ఐక్యత సాధించటానికి తోడ్పడేది, పీడనను ప్రతిఘటించేది అభ్యుదయం కలిగించేది ఇదంతా ప్రజా సాహిత్యం. పీడిత వర్గానికి పనికివచ్చే సాహిత్యం. పీడిత వర్గాల పక్షాన నిలచే సాహిత్యం.

ఐక్యతకు, ప్రతిఘటనకు, అభ్యుదయానికీ పీడిత ప్రజలను వెనక్కులాగేది, చైతన్యరహితంగా చేసేది, ప్రక్కదారి పట్టించేదీ – ఇదంతా పీడిత తాడిత వర్గాలకు వ్యతిరేకమయిన సాహిత్యం. ఈ రెండు రకాల సాహిత్యానికి గల తేడాను ముఖ్యంగా పరిశీలించాలి.

ఆదర్శవాదులు, యధాతథవాదులు వస్తువుకూ, శిల్పానికే ప్రాధాన్యత ఇచ్చి ఫలితాలను నిర్లక్ష్యం చేస్తారు. హేతువాదులు, యాంత్రిక భౌతికవాదులు ఫలితాలకు ప్రాధాన్యతనిచ్చి వస్తువును, తృణీకరిస్తారు.

ఈ ఉభయులకు వ్యతిరేకంగా వస్తువుకూ, ఫలితానికి మధ్య ఐక్యత పీడిత ప్రజల పక్షం వహించే రచనలకు వుండాలి. పీడిత ప్రజలకు సేవ చేయాలన్న ఆశయానికి, వారి ఆచరణ ఫలితాన్ని సాధించటానికి అవినాభావ సంబంధముంది. కేవలం పీడిత ప్రజలను సేవించాలని ఆశయంవుండి, వారికి లాభం చేకూర్చటం అన్న ఫలితాన్ని విస్మరించితే ఆ రచన నిరుపయోగమే అవుతుంది.

ఈ నవలలో రచయిత ప్రధానంగా గ్రామీణ పీడిత వర్గమైన హరిజన దాస్య ప్రవృత్తిని చక్కగా తీర్చిదిద్దారు. అదే సమయంలో భూస్వాముల దురాగతాలను హింసాత్మక చర్యలను ప్రత్యక్షంగా చూపక వారిని కేవలం అలంబనగా చిత్రీకరించి చిమ్మచీకటిలాంటి హరిజనుల జీవన వ్యవస్థలోకి ఒక్క కాంతి కిరణాన్నైనా ప్రసరింప చేయటానికి ప్రధాన ఆటంకం దోపిడి

వర్గాలకన్నా, తన వర్గంలోని వారిచేత జరిగే అపచారమే ప్రధానమైనదని చిత్రించి పీడిత, తాడిత వర్గాల పక్షాన నిలబడటంతో రచయిత వైఫల్యం చెందాడు. ఈ నవలలో రామచంద్రుడు తన కష్టనష్టాలకు ప్రధాన కారణం తనకు దారిలో సహాయపడిన లారీ డ్రైవర్‌తోను, బండి రైతుతోను, అర్జునరెడ్డితోను వాపోతాడు – రామచంద్రుడు పుట్టి పెరిగిన గ్రామమయిన "గంగపట్నం"లో ఇంటిని కూల్చే సందర్భంలోగాని, పెద్దరెడ్డి ఇంటివద్ద రామచంద్రుడ్ని చితక గొట్టటంలోను ప్రధాన పాత్ర మాలలదేనన్నట్లు చిత్రించి, దోపిడి వర్గాలకు ప్రతీకయైన పెద్దరెడ్డి అత్యాచారాలను కేవలము ఉవాచ ద్వారా కొద్దిగా పరామర్శిస్తాడు రచయిత. అలాగే "వొంటిమిట్ట" గ్రామంలో రామచంద్రుడు తన కొడుక్కి కొబ్బరి నీళ్ళు ఇవ్వటానికి కూడా ప్రధాన ఆటంకం మాల "కుట్టిగాడు"గా చిత్రించి, రామచంద్రుని పందులనన్నింటినీ చావబాదింది మునసబుగారి పనిపాట్లలోని మాలలేనన్నట్లుగా చిత్రించారు రచయిత. పందులు చనిపోయినప్పుడు గాని, కొడుకు చనిపోయి కుమిలి పోతున్నప్పుడుగాని కనీసం సానుభూతి వాక్యాలు కూడా మాలలచేత పలికించక రామచంద్రుడ్ని వాపోవ చేస్తాడు రచయిత. చివరగా అర్జునరెడ్డి పాకను ఖాళీ చేయవలసివచ్చినప్పుడు కూడా అందుకు ప్రధాన కారణం మాలలుగానే చిత్రించి మాల మాదిగల అభ్యున్నతికి దోపిడీ వర్గాలుకాక, మాల మాదిగలే ప్రధాన అడ్డంకి అన్నంతగా కథాంశాన్ని నడుపుతాడు రచయిత.

ఇలా తీర్చిదిద్దటంలో రచయిత సమాజంలోని వైరుధ్యాల పాత్రను గుర్తించలేదనేది స్పష్టమైన విషయం. అనగా వ్యక్తి చైతన్యానికి, సామాజిక చైతన్యానికి వర్గ చైతన్యానికి మూలకారణమైన వైరుధ్యాల పాత్రను శాస్త్రీయ దృక్పథం లేనందువలన రచయిత విస్మరించాడనే నిర్ణయానికి మనం తప్పక రావలసి వుంటుంది.

ఈ నవలా చిత్రణలో హరిజనులందరూ తమలో ఒకడైన రామచంద్రుడ్ని నీచంగా పరిహసించడం, చావబాదటం, స్పృహ తప్పినవాని

మొకాన వుచ్చ బట్టి చల్లమనటం – ఇవ్వన్నీ మిత్ర వైరుధ్యాలస్థాయిని మించి శత్రు వైరుధ్యాల స్థాయికి చేరుకున్నవి.

అలానే దోపిడీ వర్గాలైన భూస్వాములకు, హరిజనులకు మధ్య వుండే శత్రు వైరుధ్యాన్ని చిత్రించటంలో రచయిత విఫలత చెందాడు. కేవలం రామచంద్రుడి లాంటి ఉద్రేకి, నిరక్షరుడు, మూర్తీభవించిన మొరటుతనం – అయిన పాత్ర నొకదానిని సృష్టించి ఒంటరిగా భూస్వామ్య వర్గంతో తలపడటం చూపించి, మిగిలిన హరిజనులందరినీ పెద్దరెడ్డికో, మునసబుకో వంతపాడే హరిజనులుగా చిత్రీకరించడం ద్వారా, హరిజనులలోని చైతన్యాంశ అంతా కేవలం ఉద్రేకం. మొరటుతనం అన్నట్లుగానే చిత్రించటం జరిగింది. చివరిగా రామచంద్రుని చైతన్యస్థాయికి గీటురాయా అన్నట్లుగా అర్జునరెడ్డిచే గుడిలోని దీపపు సెమ్మెలోని ఆముదం తెమ్మని చెప్పించి, అందుకు నిరాకరించిన రామచంద్రునిపై అర్జునరెడ్డిచే వుమ్మించటం పీడిత ప్రజలను అవమానించడంగానే తప్పక పరిగణించవలసి ఉంది.

పీడిత ప్రజలైన హరిజనులలో లోపాలుండవని కాదు– చాలా మందికి పాత భావాలు పోవు. దాస్య ప్రవృత్తి పోదు. వారు ఈ పాత భావాల బరువును దించేసుకొని, దాస్య శృంఖలాలను వదలించుకొని, తమ లోపాలను తామే సరిచేసుకొని ఐక్యంగా, చురుకుగా ముందుకు సాగేటట్లు తోడ్పడటానికి తగిన చైతన్యాన్ని అందించవలసిన బాధ్యత ప్రధానంగా పీడిత తాడిత ప్రజల పక్షం వహించే రచయితల గురుతర కర్తవ్యం. వారు ఇప్పటి వరకు జరిగిన వేలాది సంవత్సరాల పీడనలో, దోపిడిలో నిత్య జీవన సమరంలో సంస్కారం పొందటానికి ప్రయత్నిస్తున్నారు. పొందుతున్నారు. ఈ పరిణామాన్ని ముఖ్యంగా పీడిత ప్రజాపక్షపాత రచయితలు తప్పక చిత్రించాలి. వారి లోపాలను ప్రస్తావించి, తద్వారా వారిని అవహేళన చెయ్యటం తప్పు. హరిజనులలో అనేకులు నిరక్షరాస్యులు. పేదరికం అజ్ఞానం వారి సొత్తు. వారి జీవితం నిత్యసమరమే. వారిలోని సంఘర్షణాగ్ని నివురుగప్పి ఉంది.

దానికి ఆజ్యం పోయవలసిన ప్రధాన బాధ్యత పీడిత ప్రజ పక్షపాత రచయితలదే. వారి పక్షాన నిలబడే రచయితల రచనలు వారిని మేల్కొలిపి, ఉత్సాహం చేకూర్చి, వారు తమ వాతావరణాన్ని మార్చుకోవటానికి తోడ్పడాలి. అలా కాని నాడు ఆ రచనలవల్ల పీడిత ప్రజలకు ప్రయోజనం శూన్యం.

సహజంగా గ్రామీణ ప్రాంతాలలో పీడిత తాడిత ప్రజల మధ్య వున్న అంతర్గత వైరుధ్యాలను ఆసరాగా చేసుకొని భూస్వాములు తమ దోపిడీని కొనసాగిస్తుంటారు. ఈ నవలలో రామచంద్రునికి మిగిలిన మాలలకు మధ్యగల అంతర్గత వైరుధ్యాలను చిత్రించటంలో బలమైన కారణాలుగాని, ఈ అంతర్గత వైరుధ్యాలు పెంపొందిస్తూ భూస్వామ్య వర్గాలు కొనసాగించే దోపిడీ, హింసాత్మక చర్యలను బలంగా చిత్రించటంలోగాని రచయిత విఫలత చెందాడు.



మన సాహిత్యమూ కళలూ, ప్రజలకు సేవ చేయాలి. ముఖ్యంగా పీడిత, తాడిత ప్రజలకు సేవ చేయాలి. ప్రజలలోని మూఢ భావాలను, అశాస్త్రీయ భావజాలాన్ని తొలగించాలి. చైతన్యపరచాలి. వారి జీవితాలలో వెలుగు రేఖలను నింపాలి. అంతేకాని పాత భావాలకు బలం చేకూర్చటం పీడిత ప్రజలకు హాని చేయటమే. మచ్చుకు కొన్ని భావాలను పరిశీలిద్దాం.

“ఈ ఇంట్లోకి మారంగానే కిష్టుడికి మందూ మాకు లేకుండానే వొల్లు కుదురుకునింది. ఈ సంవత్సరంలో ఒకసారి గూడ మూర్ఛ కనబడలేదు. వానికి పట్టిన “కింక” లన్నీ వదిలి పోయినాయి”.

"నువ్వీ పొద్దు ఎడం పక్క నిర్దర్లేచినావురా, నా దగ్గర వొళ్ళు కాపాడుకోలేవు"

"జరిగేదంతా నొసట వ్రాసిన ప్రకారమే జరుగుతుంది"

''ఈ కలిగ్గంలో వుండే జన్మల్లోకంతా కనా కష్టమయినది మాల జన్మ. గొడ్డయి పుట్టవచ్చు. పందై పుట్టవచ్చు కాని మాలోడై పుట్టగూడదు".

''భూస్వామి దురాగతాలకు దేముడే బుద్ధి చెబుతాడు"

''పుణ్యం చేసుకోనుండాల. మొగుడు తాగుతా వుంటే చూస్తా కూర్చొనే పెండ్లాము దొరకాలంటే రెండు చేతులా పుణ్యం చేసుకోనుండాల".

"అది తెలుగుది కాని, అరవది కాని మరింకెవ్వరన్నా కాని ఎర్రగా బుర్రగా వుండే ఆడదాన్ని మాత్రము నమ్మకూడదు. నువ్వు నాగుబామును నమ్ము. చిఱతపులిని నమ్ము. ఒకనాడు గాకపోయిన ఇంకొక నాటికి బాగు పడతావు. కాని అందంగా ఉండే ఆడదాన్ని మాత్రం నమ్మొద్దు". "మొగోడు బాగుపడినా, బెస్టుపట్టిపోయినా ఆడదాని పేరు మీదనే"

"మాలోడు కాపురముండే ఇంటిని సుట్టితే సావికి కోపం రాకుండా వుంటుందా."

ఇలాంటి భావజాలాన్ని నవల పొడవునా రచయిత పొందుపరచటం జరిగింది. కాని ఆ భావజాలాన్ని శాస్త్రీయంగా ఎండగట్టటం జరిగి వుంటే రచనకు పరిపుష్టి కలిగేది. అలా జరగనందున ఆ ప్రజా వ్యతిరేక భావ జాలానికే పుష్టి కలిగింది.నవలలోని పాత్రల చిత్రీకరణలలో రైతుల పాత్రలోవున్న సమగ్రత మిగిలిన పాత్రల చిత్రీకరణలో లోపించింది.

– "సృజన" మాసపత్రిక (1980 ఆగష్టు & సెప్టెంబర్)

# 4. కళలు – సాహిత్యం ఎవరి కోసం ?

(మావోటున్, తదితర చైనా రచయితల వ్యాసాలు,

"సృజన" ప్రచురణ, హనుమకొండ, వరంగల్– 1)

చైనా విప్లవ గమనంలో 1919 మే 4 ఉద్యమం నుండి 1942 వరకు జరిగిన కళా సాహిత్య రంగాలలోని లోపాలోపాలను శాస్త్రీయంగా విమర్శించి, మౌలికమైన అవగాహనను కళా సాహిత్య రంగాలకు కలిగించి అప్పటి వరకు ఆ రంగాలలో ప్రచారంలో వున్న అనేక శ్రామిక వర్గేతర భావాలను, గందరగోళాలను గురించి స్పష్టం చేసిన మావో, "ఏనాన్" ప్రసంగాల పదవ వార్షిక సందర్భంలోనూ, 30వ వార్షిక సందర్భంలోనూ చైనా భాషలో వెలువడిన వ్యాసాల సంకలన అనువాదం ఈ చిన్న పుస్తకం.

గత దశాబ్దంలో కళా సాహిత్య రంగాలు మార్క్సిజం, లెనినిజంతో ఎలా సమన్వయం పొందిందీ, అప్పటి వరకు కేవలం విమర్శనాత్మక సృజనగా వుండి ప్రజలకు సేవ చేయలేని కళా సాహిత్య రంగాలు, ఆ తరువాత విప్లవ వాస్తవికతా దృష్టితో అభివృద్ధి చెందిన పూర్ణ మనస్కతతో ఎలా ప్రజలకు ముఖ్యంగా రైతులు, కార్మికులు, సైనికులకు, ఉపయోగపడేలా కృషి చేస్తున్నదీ, చేయవలసినదీ వివరించేది మొదటి వ్యాసం.

గత 30 సంవత్సరాలుగా మావో "ఏనాన్" ప్రసంగం కళా సాహిత్య రంగాలలోని అతివాద, మితవాద, అవకాశవాద పంథాలను శాస్త్రీయంగా ఎదుర్కొంటూ విప్లవోద్యమంలో అంతర్భాగంగా విప్లవ సంస్కృతిని పెంపొందించి రాజకీయ అధికారాన్ని హస్తగతం చేసుకోవటంలో, కార్మిక వర్గ

నియంతృత్వాన్ని పరిరక్షించుకోవడంలో ఎలా దోహద పడుతున్నదీ వివరించేది రెండవ వ్యాసం.

ప్రజాసేవకు అనుగుణంగా మన భావాలను మలచుకోవడానికి, వర్గ పోరాటంతో కూడిన సమాజ సారాన్ని అర్ధం చేసుకోవటానికి, సుసంపన్నమైన ప్రజా జీవితంలో, పోరాటాలతో మమేకం కావటం ద్వారా కళా సాహిత్య రంగాలు అభివృద్ధిచెంది శ్రామిక సంస్కృతిని పెంపొందించి నిలబెట్టటానికి "ప్రజల్లోకి వెళ్ళండి" అనే నినాదం ఎలా ప్రేరణ ఇచ్చింది వివరించేది మూడవ వ్యాసం.

సాంస్కృతిక రంగంలో పోరాటం మొత్తం విప్లవ పోరాటంలో అంతర్భాగమని, ప్రజలను సమైక్యం చేయటానికి, విజ్ఞానవంతులను చేయటానికి, శత్రువును ఎదుర్కొని నాశనం చేయటానికి విప్లవ పోరాటానికి బాగా సేవ చేయటానికి సాహిత్యం, కళలను శక్తివంతమైన ఆయుధాలుగా ఉపయోగించు కోవాలంటే పరిష్కరించుకోవలసిన వివిధ సమస్యలను "మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం" వెలుగులో విశదీకరించి రచయితల, కళాకారుల ప్రాపంచిక దృక్పథాన్ని సూచించేది చివరి వ్యాసం.

ఈ నాలుగు వ్యాసాల సంకలనం రచయితల, కళాకారుల సృజన

రీతులను పెంపొందింప జేయటానికి వెలువడిన 'సృజన' ప్రచురణ.

– "అరుణతార" (1981 ఫిబ్రవరి)

# 5. ప్రజలే చరిత్ర నిర్మాతలు

## ప్రజా పోరాట సాధనాలుగా కథ, నవల

నగ్జల్‌బరీ రైతాంగ పోరాటం భారతదేశ రాజకీయరంగంలో దోపిడీ రాజకీయాలకు, ప్రజా రాజకీయాలకు మధ్య గండికొట్టి పీడిత ప్రజలను దోపిడీ లేని, వర్గ రహిత సమాజ స్థాపన కోసం దీర్ఘకాల ప్రజా యుద్ధ పంథాకు దేశవ్యాపితంగా సమాయత్తపరచింది. ఈ మహత్తర పోరాటం అనివార్యంగా ప్రజాకళా సాహిత్య రంగాలలో ప్రతిబింబించి ప్రజా సంస్కృతి దినదినాభివృద్ధి చెందటానికి దోహదం చేస్తూవుంది. ఇది అభివృద్ధి చెందనిదే ప్రజలలో అనాదిగా జీర్ణించుకుపోయిన దోపిడీ సంస్కృతి కుట్రను నిర్మూలించడం అసాధ్యం. అట్టి ప్రజా సంస్కృతిని పెంపొందించటానికి, పీడిత ప్రజలను వర్గ పోరాటంలో దృఢంగా నిలబెట్టడానికి, వర్గ రహిత సమాజ స్థాపనకు సాధనంగా ఉపయోగపడటానికి నేడు మన కళా సాహిత్య రంగాలు శాస్త్రీయంగా పదునెక్కుతున్నాయి. మొత్తం శ్రామిక వర్గ ఉద్యమంలో అంతర్భాగంగా వాడీ వేడీ సంతరించుకుంటున్నాయి.

ఈ కల్లోల దశాబ్దిలో కళాసాహిత్య రంగాలు ప్రస్తుత చారిత్రక పరిస్థితులకు అన్వయించుకుంటూ గతి తార్కిక భౌతికవాద దృక్పథంతో ప్రజా పోరాట సాధనాలుగా రూపురేఖలు దిద్దుకుంటున్నాయి. ఈ కాలంలో ప్రజల పాట, ఆట పీడిత ప్రజా పోరాటాలతో భుజం భుజం కలిపి ప్రజా సంస్కృతిని పెంపొందిస్తూ తెలుగు నాట మారుమూల

గ్రామాలకు సైతం చేరిందనేదానికి నేడు వెల్లివిరుస్తున్న ప్రజా పోరాట చైతన్యమే నిదర్శనం. ఇదే సందర్భంలో "ఇప్పుడు వీస్తున్న గాలి" కథలు, "కొండగాలి" నవలతో మొదలైన కథా నవలా రంగాలు, మధ్యలో కాస్త నత్తనడక నడచినా, నేడు ప్రజా పోరాట సాధనాలుగా పదునెక్కుతున్న మాట వాస్తవం.

కాకమ్మ కథలో, పిచికమ్మ కథలో జబ్బుసత్తావుంటే రాయవచ్చు. దాంతో పాటు ఓపికుంటే నవలలూ రాయవచ్చు. కాని ప్రజా కథలు రాయటం కష్టం. ముఖ్యంగా పోరాట సాధనాలుగా కథని, నవలని తీర్చిదిద్దటం మరీ కష్టం. పోరాట పరిభాషలో చెప్పాలంటే ట్రిగ్గర్ నొక్కటం లేదా గ్రెనేడ్ విసరటం లాంటిదే. మన కథనంలో ఏ మాత్రం ప్రజా వ్యతిరేక భావాలు చోటుచేసుకున్నా, మన శాస్త్రీయ అవగాహనలో లోపమున్నా ప్రజా సమస్యలను ప్రతిబింబించటంలో, వర్గ వైరుధ్యాలను పరిశీలించటంలో, పరిష్కార మార్గాన్ని నిర్దేశించటంలో ఏ మాత్రం తప్పటడుగు వేసినా, ఎంతో హాని కలుగుతుంది. అంత మాత్రాన మనం ఒకేసారి వున్నతస్థాయి కథలను సృష్టించాలని కాదు. అది వీలయ్యేదీ కాదు. అందుకు మనం చేయవలసిందల్లా చుట్టూ సమాజాన్ని శాస్త్రీయంగా పరిశీలించటం, ప్రజా సమస్యల్ని సక్రమంగా అధ్యయనం చేయడం, ప్రజలలో నివురు కప్పిన నిప్పులా వున్న చైతన్యాంశను వెలికి తీయటం, దాన్ని వర్గ చైతన్యంగా పోరాట స్ఫూర్తిగా తీర్చి దిద్దటం. ఇందుకు ముందుగా మన సిద్ధాంత పరిజ్ఞానాన్ని పదునెక్కించుకోవలసి వుంది.

సిద్ధాంత జ్ఞానం అంటే మార్క్సిజం లెనినిజం మావో ఆలోచనా విధానం మాత్రమే. మార్క్సిజాన్ని చదవటం మన రచనలలో ఆ శాస్త్ర భావాలను వుపన్యాసాలను గుప్పించటానికి మాత్రం కాదు. సమాజాన్ని గతి తార్కిక భౌతిక దృష్టితో, చారిత్రక దృష్టితో పరిశీలించి అర్థం చేసుకోవటానికి మాత్రమే. అది ఆచరణకు దారి తియ్యాలి.

అందుకు పీడిత ప్రజలతో మమేకం కావటం మాత్రమే పరిష్కార మార్గం. అప్పుడే మనం ప్రజల భాషను, భావాన్ని, రూపాన్ని మన కథల్లో నవలలో సంతరించుకోగలం. పోరాట సాధనాలుగా అందించగలం. వాటిని మళ్ళీ సిద్ధాంత జ్ఞానంతో పదునెక్కించుకోగలం. ఇది నిరంతరం సాగిపోవలసినదే. కుంటుపడటానికి వీలు లేనిది.

ప్రజాభాష జీవనది. అందులోని సూటిదనం, వాడి, జీవిత వాస్తవాలు – మన కథా రచయితలు తప్పనిసరిగా స్వీకరించాలి.

మనం ప్రజల భాషను స్వీకరించకపోయినట్లయితే మన రచనలు ప్రజల విప్లవ భావాన్ని తీర్చిదిద్దటంలో విఫలమౌతాయి.

అలానే భాషను రూపాన్ని సంతరించుకొని ప్రజల భావాన్ని సంతరించుకొనక పోయినట్లయితే మన భాష, రూపం తెచ్చిపెట్టు కొన్నవిగా వుండి ప్రజల కుపకరించటంలో విఫలమై పైపెచ్చు విద్రోహ పూరితం కావటానికి వారి విప్లవ చైతన్యాన్ని ప్రక్కదోవ పట్టించటానికి మార్గాన్నిస్తాయి.– "అరుణతార" (1981 ఏప్రిల్ & మే)

# 6. మహిళలు లేకుండా నిజమైన ప్రజాఉద్యమం ఉండదు

ప్రపంచ వ్యాప్తంగా స్త్రీ పురోగతి నత్తనడక నడుస్తూనే వుంది. హిందూదేశంలో స్త్రీ పరిస్థితి మరీ అధ్వాన్నం. ఆస్తిహక్కు లేదు, ఆమె మరణంపై ఆమెకు హక్కు లేదు. ఇక సాంఘిక దురాచారాలకు అంతే లేదు. నిన్న మొన్నటి వరకూ జరుగుతూవుండిన సతీసహగమనం, కన్యాశుల్కం, బాల్యవివాహాలు తలచుకుంటే గుండెలు పగిలిపోతాయి. దేవదాసీలు, భోగంకులాలు, వేశ్యావృత్తిచూస్తే మనసు వికలమై పోతుంది. ఇక ప్రస్తుతం మహమ్మారిలా స్త్రీ లోకాన్ని సమాజాన్ని పట్టి పీడిస్తున్న వరకట్నం భయంకర రూపు దాల్చింది. ఇలా దేవుడు, మతం, నీతి, ఆచారం, పాతివ్రత్యం, కులం – ఇంకా ఎన్నెన్నో పేర్లతో స్త్రీ ఈ సమాజంలో అణగద్రొక్క బడింది. స్త్రీ కూడా మనిషేనన్న జ్ఞానం కూడా నశించి పోయింది. ఆమె కేవలం పిల్లల్నికనే యంత్రమై పోయింది. పురుషుడికి భోగవస్తువై పోయింది. వ్యక్తిత్వంలేని ఆటబొమ్మై పోయింది. పురుషుడు సమాజానికి, మతానికి బందీ అయితే స్త్రీ సమాజానికి, మతానికి, పురుషుడికి కూడా బందీ అయింది. ఆమె ఎంత మంది పిల్లల్ని కనాలోకూడా పురుషుడే నిర్ణయిస్తాడు.

మన సమాజంలో స్త్రీ పుట్టుకకు ముందే వివక్ష ప్రారంభమవుతుంది. గర్భస్థ శిశువు మగబిడ్డ కావాలని ఆశించడం జరుగుతుంది. పుట్టుకతోనే ఆడముండ పుట్టిందనే అంతరం ప్రారంభమవుతుంది. ఆమె జీవితాంతం పురుషుడికి, సమాజానికి అణగి మణిగి వుండాలనే "బ్రెయిన్ వాషింగ్" బ్రహ్మాండంగా జరుగుతుంది. ఆటపాటల్లో, చదువులో, పెళ్ళిలో ఉద్యోగ నిర్వహణలో మగవారికున్న స్వేచ్ఛ ఆడవారికుండదు.

గృహస్థ జీవితంలో పురుషాధిక్యత కొట్టవచ్చినట్లు కానవస్తుంది. ఎదిరించిన స్త్రీలను భర్తలు హింసించడమనేది ప్రపంచమంతటా సర్వసాధారణ విషయంగా సాగుతూనే వుంది. చాలా దేశాల్లో ఇలాంటి హింస తప్పనే భావంగూడా ప్రజలో వ్యాప్తి చెందలేదు. ఇలా హింసకు లోనయ్యే స్త్రీలలో అన్ని జీవితరంగాలకు చెందినవారూ వుంటారు. ధనిక, పేద అనే భేదం లేదు. అనేక మంది స్త్రీలకు ఈ హింసను తప్పించుకునే మార్గాంతరాలు తెలియవు. నిత్యం స్కూళ్ళలో, ఫ్యాక్టరీలలో, పొలాల్లో, గృహాల్లో లైంగిక వేధింపులకు, మానభంగాలకు తరచుగా గురి అవుతుంటారు. అనేక విషయాలు వెలుగులోకి రాకుండా వుంటాయి. ఈ లైంగిక వేధింపుకు సమాజంలో పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న అశ్లీల సాహిత్యం, సినిమాలు, స్త్రీ పట్ల వ్యవస్థీకృతమైన చిన్నచూపు ప్రధాన కారణాలు.

ఇలా తన ఆర్ధ శరీరమైన స్త్రీ పక్షపాతరోగంతో బాధపడుతుంటే ఈ సమాజం ఏమి ప్రగతి సాధించగలదు? పురుషులతోపాటు స్త్రీలు కూడా హక్కులు, బాధ్యతలు పొందిననాడు ఈ సమాజం సజీవంగా మనగలుగుతుంది. ఈ సత్యం గ్రహించిననాడే ఏ జాతైనా, దేశమైనా మార్పును సాధించగలదు. ఎలా? ఎప్పుడు? ఎవరు ఈ మార్పును సాధించేది? మార్గమేది? అని మనం ఆలోచిస్తే మనం మానవ సమాజ చరిత్రని అధ్యయనం చేయందే, అవలోకించందే వీటన్నింటికి మూల కారణాన్ని అన్వేషించి – దానికి విరుగుడు చేయకుండా ఏదో కాయకల్ప చికిత్స చేస్తే వచ్చేది కాదు ఈ మార్పు.

ఆ విరుగుడు సంస్కరణలతో జరగదు. అవి సమస్యను అపడానికి దాటవేసే సాధనాలు మాత్రమే –

సమాజంలో సగభాగమైన స్త్రీ విముక్తి పీడిత ప్రజానీకం విముక్తిలో భాగమే. అన్ని అసమానతలకు అవమానాలకు కారణమైన ఈ దోపిడీ వ్యవస్థ కూలిపోయిన రోజు మాత్రమే స్త్రీల సమస్యలకు పరిష్కారాలు దొరికేది. అందుకు స్త్రీ ముందుకు రావాలి. సుదీర్ఘ పోరాటంలో భాగం కావాలి. లెనిన్ అన్నట్లు “ప్రతి వంటకత్తె ఒక రాజకీయవేత్త కావాలి. ఎందుకంటే మహిళలు లేకుండా నిజమైన ప్రజా ఉద్యమం ఉండదు”.

**– “అల” బులిటెన్ (ప్రకాశం జిల్లా)**

"నేటి ప్రపంచంలో సమస్త సంస్కృతీ, సమస్త సాహిత్యమూ కళా
విస్పష్ట వర్గాలకు చెందిఉండి, విస్పష్టమైన
రాజకీయ పంథాలకు ముడిపడి వున్నాయి.
వాస్తవానికి కళ కోసమేనన్న కళా,
వర్గాలకు అతీతమైన కళా,
రాజకీయాలకు లోబడకుండా స్వతంత్రంగా ఉన్న కళా
ఎక్కడా లేవు.

**– మావో**



# 7.వలసవాద నీలినీడలో 'గ్లైనెస్'

"నీలినీడ" ఓ ఆస్ట్రేలియా ఆదివాసీ అమ్మాయి ఆత్మకథ. రెండు శతాబ్దాల క్రితం ఆస్ట్రేలియా బ్రిటీష్ వలసగా మారగానే ఆదివాసీ జీవితాల్లో అస్థిరత మొదలైంది. వాళ్ళకు మొదటిగా దూరమైంది వాళ్ళ భూమి. ప్రకృతి ఒడిలోని ఆదివాసీలు స్వాతంత్ర్యం, సంస్కృతి, ప్రజలమధ్య అనుబంధాలు కోల్పోవడం జరిగింది. వలసాధిపత్యం కింద బతకటానికి ఆదివాసీలు చాల కష్టాలను, బాధలను ఎదుర్కొవలసి వచ్చింది. వేలాది మంది ఆదివాసీలు క్రూరంగా చంపబడ్డారు. ఆదివాసీలకు మేలు చేస్తున్నామనుకున్న మిషనరీల తెల్లవాళ్ళు – ఆదివాసీ పిల్లల్ని పోషణ పేరుతో, సేవ పేరుతో, చదువుల పేరుతో తల్లిదండ్రుల నుండి దూరం చేశారు. అది అనేక మంది పిల్లల జీవితాలను వారి సంస్కృతి నుండి, ప్రకృతి సాన్నిహిత్యం నుండి వేరుచేసి యూరోపియన్ జీవిత శైలికి బలవంతంగా అలవాటు పడేటట్లు చేశారు. అలాంటి ఓ ఆదివాసీ అమ్మాయి "గ్లైనెస్ వార్డ్" ఆత్మకథే ఈ నీలినీడ. పసిపాపగా వున్నపుడే సెయింట్ జోసెఫ్స్ అనాధాశ్రమానికి చేర్చబడి, మూడేళ్ళ వయసప్పుడు జర్మన్ కాథలిక్ చర్చి ఆధ్వర్యంలో నడిచే "వాండరింగ్ మిషన్" అనే మిషనరీ సంస్థకు మార్చబడి పసిప్రాయంలోని అనుభూతులకు, తల్లిదండ్రుల ఆప్యాయతలకు దూరమై పదమూడు సంవత్సరాలు అక్కడే గడిపింది. ఆ పిల్ల జీవిత కథే ఈ నవలలో ఉన్నది.

ఆమె పదహారు సంవత్సరాల వయస్సులో హోమ్ వదలి తెల్లవాళ్ళ ఇంట్లో పనికి వెళ్ళాల్సి వచ్చింది. నన్స్ కు దూరం అవుతున్నందుకు బాధపడింది. ఎంతో వుద్వేగంతో స్నేహితురాళ్ళందరికి వీడ్కోలు చెప్పింది. జీవితంలో మొదటిసారిగా హోమ్ వదలి వెళ్ళబోతున్నది. జీవితంలో ఏం కోరుకుంటుందో తెలియదు. భయం. హోమ్ వదలి వెళ్ళాలని లేదు. కానీ మరో మార్గం లేదు.

మిషన్ జీవితం నుండి మరోకొత్త జీవితంలోకి వెళ్ళి వాళ్ళ ఇళ్ళలో పనిపిల్లగా “గ్లనైస్ వార్డ్" జీవితం మొదలవుతుంది. ఉదయం లేవగానే ఇంటి కాంపౌండ్ అంతా శుభ్రంగా ఊడవటం, తరువాత తోటకెళ్ళి నారింజకాయలు తెచ్చి రసంతీసి యజమానురాలికి ఇవ్వటం, వంటగది శుభ్రం చేయడం, వెండి, ఇత్తడి సామాన్లు మొహం కనపడేలా తోమటం, చెక్క వస్తువుల్ని మైనంతో పాలీష్ చేయడం, కిటికీలు, తివాచీలు, శుభ్రం చేయడం, గదులన్నీ శుభ్రంగా తుడవడం, వంటపనులు, కూరలు తరగడం, పాత్రలు కడగడం, వంటగది గోడలు మచ్చలు లేకుండా శుభ్రంగా వుంచడం, నేలను కడిగి శుభ్రం చేయడం – ఇలా వెట్టిచాకిరితో గ్లనైస్ వార్డ్ను యజమానురాలు మేయర్ బిగిలో కానరాని హింసకు గురి చేసేది. ఆదివాసీ పని పిల్లలంతా ఈ హింసకు గురయ్యేవారు. ఆదివాసీలను తెల్లవాళ్ళు మనుషులుగా గుర్తించేవారు కాదు. వాళ్ళు కేవలం ఇళ్ళలో పనిచేసే మానవ యంత్రాలుగా మార్చబడేవారు. ఆప్యాయత, సంతోషం, కడుపునిండా తిండి మృగ్యం. పని, పని. నిరంతరం శ్రమతో బాల్యం, యవ్వనాలు హరించుకుపోయేవి. ఇవన్నీ గ్లనైస్ వార్డ్ అనుభవించింది. చెప్పినట్లు వినకపోతే తిరిగి మిషన్కు – పంపుతానని బెదిరించేది యజమానురాలు.

యజమాని కొడుకు “రాబర్ట్'' మాత్రమే కాస్త ఈ నల్ల పనిపిల్లను మనిషిగా గుర్తించేవాడు. ఇంట్లో వాళ్ళందరూ ఒకోసారి టౌనుకు వెళ్ళేవాళ్ళు. అప్పుడు ఆనందంగా “గ్లనైస్ వార్డ్'' గదులన్నీ కలతిరిగేది. తనకు నచ్చిన పాటలు పాడుకొనేది. పియానో వాయించుకొనేది. ఇలా ఎప్పుడన్నా కలిసి వచ్చిన రోజులు ఆనందంగా గడిపేది.

యజమానురాలు తోటకు కాపలా వుండే “బిల్” తాతతో పరిచయం “గ్లనైస్”కు మనోధైర్యాన్ని, శాంతిని కలుగచేసింది. యజమానురాలు టౌన్కు వెళ్ళినప్పుడు వచ్చి పనిలో సాయపడేవాడు.

ఎప్పుడూ నవ్వుతూ వుండాలని, దేని గురించి బాధపడవద్దని చెప్పేవాడు. ఇద్దరు కలసి టీ తాగేవారు. క్రిస్మస్ వెళ్ళిన కొంత కాలానికి స్నేహితురాలు కేలిన్ నుండి వుత్తరం వచ్చింది గ్లెనైస్వార్డ్ కు. తనను రమ్మని రాసింది. తన కోసం ప్రతి వారం వచ్చే బస్సుకు ఎదురు చూస్తానని రాసింది కేలిన్. వేసవికాలం సెలవుల్లో హోమ్‌కు రెండు వారాలు శెలవు మీద వెళ్ళటానికి యజమానురాలు అవకాశం ఇచ్చింది. అలా మిషన్‌కు వెళ్తున్నానని చెప్పి గ్లెనైస్ తన స్నేహితురాలు “కేలిన్” వద్దకు వెళ్ళింది. అక్కడ హాస్పటల్లో ఓ చిన్న ఉద్యోగం సంపాదించింది. మిత్రురాలి సాయంతో ఓ మంచి వ్యక్తిని పెళ్ళిచేసుకొని జీవితం సంతోషంగా గడిపింది. భర్త వృత్తిరీత్యా హెయిర్ డ్రస్సర్. ఇద్దరు పిల్లలతో వారి జీవితం గౌరవప్రదంగా సాగిపోతుంది. ఇప్పుడు వారి పిల్లలు బానిసలు కాదు. జీవితంలో మంచి విద్య కోసం. ప్రతి అవకాశాన్ని వారికి ఇవ్వాలని భర్త ఛార్లీతో కలసి సాగిపోతుంది. తమ పిల్లలు ఈ సమాజంలో తమ స్థానాలను డాక్టర్లుగానో, లాయర్లుగానో ఇంకా ఇంకా పదిలపరచుకొని మానవజాతిలో సమానత్వాన్ని సాధించాలని ఆకాంక్షిస్తూ గ్లెనైస్వార్డ్ అందించిన ఆత్మకథ ఈ నీలినీడ.

వలసవాద దారుణాల నుండి, అనుభవాల నుండి వాటికి వ్యతిరేకంగా ఆదివాసీ వుద్యమాలలో భాగంగా వచ్చిందే ఈ ఆదివాసీ అమ్మాయి ఆత్మ కథ. తమ అనుభవాలను తమ వారితో పంచుకొనే ప్రయత్నం చేస్తూనే, మరోవైపు తెల్లవాళ్ళ వైఖరికి నిరసనను తెలియజేసే ప్రయత్నం కేంద్రంగా ఈ రచన సాగింది. ఆదివాసీ చరిత్రను ముఖ్యంగా స్త్రీలు, పిల్లలు చరిత్రలో అనుభవించిన వేదనలకు అద్దం పడుతున్న ఈ ఆత్మకథ హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ. “వాండరింగ్ గర్ల్” అనే ఇంగ్లీషు పుస్తకానికి కె. సునీతరాణి గారి అనువాదం పొందికగా వుంది. అభ్యుదయ కాముకులందరు చదవతగ్గ పుస్తకం.– “అరుణతార (2004 ఏప్రిల్)

★★★

"మన సాహిత్యమూ - కళా లక్షల కోట్ల సంఖ్యలో వుండే శ్రామికులకు సేవ చేయాలి." - లెనిన్

# 8. "రైతు కవిత"

"రైతు కవిత" వచన కవితా సంకలనం. ఈ మధ్య వచ్చిన కవితా సంకలనాలలో ఎంతో ప్రాముఖ్యత కలిగింది. 1985– 2000 మధ్య పత్రికలలో పుస్తకాలలో వచ్చిన 75 మంది వచన కవితా కృషీవలుల కవితలు ఇందులో చోటు చేసున్నాయి. అనుబంధంగా "తొలికాపు" రచయితలు వెలువరించిన 17 మంది రచనలు వున్నాయి. పదును పోకముందే అదునులో ఈ సంకలనం వెలువరించినందుకు మువ్వా చిన బాపిరెడ్డి ట్రస్టును, సంపాదకులను తప్పక అభినందించాలి. రైతు పక్షపాతం వున్న వాళ్ళంతా కొని చదవవలసిన మంచి సంకలనం ఇది.

వ్యవసాయం మన దేశంలో ప్రధాన వృత్తి. రైతే రాజన్నది ఏనాటిమాటో. రైతు వికాసం చరిత్రలో ఎలా జరిగిందో ఓ సుదీర్ఘ పరిచయం సంపాదకులలో ఒకరైన పాపినేని శివశంకర్ వ్రాసి "రైతు కవిత"కు ఓ అందమైన, ఆలోచనాత్మకమైన తలపాగా చుట్టారు.

వ్యవసాయం మానవ జీవిత చరిత్రలోనే సాటిలేని ఓ అద్భుతం. చరిత్రలో మొట్టమొదటి సృజనాత్మక కళాకారుడు రైతే. సాటిలేని వంచనకు గురయ్యిందీ రైతే. చరిత్రలోనే గాక సాహిత్య చరిత్రలోనూ రైతులకు తగిన స్థానం లభించలేదన్న వాస్తవాన్ని శివశంకర్ సోదాహరణంగా వివరించారు. 20వ శతాబ్దం ప్రారంభంలో మొగ్గ తొడిగిన కర్షక చైతన్యం "తొలికాపు"

రచయితలలో స్ఫూర్తిని, ఆర్తిని కలిగించి రైతు జీవన శోభను ఎత్తి పట్టింది. స్వరాజ్యానంతరం అన్ని రంగాలలో మెల్ల మెల్లగానైనా ప్రవేశించిన అభివృద్ధి ఆధునిక వ్యవసాయరంగంలో మృగ్యమయింది. నదీజలాలను ప్రణాళికాబద్ధంగా వుపయోగించుకోవడం చేతగాకపోవడంతో ఈ రంగాన్ని సస్యశ్యామలంగా చేయలేక పోయాయి. ఆధునిక వ్యవసాయ పరికరాలు అందుబాటులో లేవు. ప్రకృతి వైపరీత్యాలకు తట్టుకొనే విత్తనాల అభివృద్ధి శూన్యం. పంటల భీమా పథకం సముద్రంలో కాకిరెట్ట. పంటలకు గిట్టుబాటు ధర ఎండమావి. ఇలా రైతు జీవితం అమ్మబోతే అడవి కొనబోతే కొరివి అయ్యింది. వ్యాపార పంటల ప్రాబల్యంతో భూసారం క్షీణించింది. ప్రకృతి, ప్రభుత్వ దళారులు, నకిలీ విత్తనాలు, పురుగుమందులు, ఎరువులు, రైతును వంచించాయి. ఇలా ఆధునిక రైతు జూదంలో ఓడిన ధర్మరాజయ్యాడు. అప్పుల ఊబిలో కూరుకు పోయాడు. అరణ్యవాసమో, అజ్ఞాతవాసమో చేయలేక ఆత్మహత్యలకు నెలవు అయ్యాడు. వారి ఆర్తనాదాల్ని హృదయ స్పందనతో మన ముందుంచారు సంకలనంలోని రచయితలందరూ. గ్రామీణ జీవిత నేపథ్యం నుండి ఈ రచయితలు తమ తమ ప్రాంత గ్రామాల దైన్యాన్ని మన ముందుంచటానికి ప్రయత్నించారు. ఇవి రైతు జీవన విషాద గీతికలు.

విశ్వవ్యాప్తంగా రైతుగుండె పచ్చటి ఆకుమడి. ఎక్కడైతేనేం. ఇంటికొచ్చిన వాడికి అన్నం పెట్టి ఆశ్రయమిచ్చే మానవత్వం వాళ్ళు. వంచింపబడి సహనం కోల్పోతూ ఇప్పుడిప్పుడే రాజుకుంటున్నవాళ్ళు. పంటచేలో సూర్యులై వుదయిస్తున్న వాళ్ళు.

ఇక్కడి మట్టంతా మనిషి పరిమళం వేస్తూనే వుంది. తాతలు తండ్రులు ఇచ్చిన వారసత్వానికి ప్రతీకగా శ్రమసంస్కృతిని ఆత్మాభిమానపు పతాకగా ఎగురవేస్తున్నాడు రైతు. ప్రపంచానికంతా అన్నంపెట్టే రైతు జీవన వస్త్రం నేడు పోచలుగా రాలిపోతున్నది. వెన్నెముకను నాగలి చేసి దున్నటం ఒక్కటే తెలిసిన రైతు అప్పులపాలయ్యాడు. కన్నబిడ్డగా చూచుకొన్న పొలం తాకట్టులో వుంది. తెగనమ్ముదామంటే పొలంలో తరతరాల ఆత్మ నిక్షిప్తమై వుంది. దేశ గౌరవం గురించి నోటితో అరిచేవాళ్ళకు తాకట్టు పడుతున్న రైతన్న తలపులో రానన్నా రాడు. బతుకు అప్పులపాలై కండ్లబావుల్లోకి కన్నీరుబుకుతా ఉంది. ఎండిన చేల గుండెలే ఈ అక్రమాల్ని ఎండగట్టాలి. వడిసెల రాయి గురితప్పి పంట పొలాల మీద వలస పిట్టలు వాలాయి. నాగలిపట్టిన చేతులే ఈ దయ్యాల దండును తరిమి కొట్టాలి.

వేల వేల దుక్కుల్ని దున్నిన చేతులు, విత్తనాల మొదళ్ళని స్పృశించిన పాదాలు, ప్రకృతి పసిపాపలా పెంచిన వారసత్వం విధ్వంసమైపోతూవుంది. తల్లి వాసన వేసే పల్లె మట్టి యిప్పుడు టెర్మినేటర్ విత్తనం మింగి ఆత్మహత్యకు సిద్ధమవుతూ వుంది. దూదికంటే తేలికైపోయింది రైతు జీవితం. ఈ రాజ్యాంగమే రైతు మరణానికి మొదటి ముద్దాయి. కాటేసేదాకా తెలియదు. పురుగును చంపలేని మందులు రైతు ప్రాణం తీయగలిగినపుడు, మట్టిని నమ్ముకున్న బతుకు మట్టిలోనే పొలి అయినపుడు అది ఖచ్చితంగా హత్యేనని అందరికి తెల్సు. అయినా ఎవరూ ఇదేమిటని ప్రశ్నించరు. కాడెడ్లను కడిగే రైతులు, బర్రెతోకలు పట్టుకొని ఈతలు కొట్టే కుర్రకారు ఎండిన చెరువులకు జ్ఞాపకాలుగా మిగిలాయి. చేలో శ్రమించి తన నీడను విశ్రమించే శ్రమైక జీవన కథా నాయకుడేడని ఎవర్ని అడగాలి? భూమిని నమ్ముకున్నవాడ్ని

భూప్రపంచమంతా మోసం చేసింది. అందుకే నలువైపుల నుండి సమర నగారా మోగిస్తున్నాయి, తండ్రిని పోగొట్టుకొన్న పొలాలు.

కోస్తా ఆంధ్ర కంటే తెలంగాణా, రాయలసీమ రైతు ముఖచిత్రం మరింత విషాదం. కరువు పిలిస్తే పలుకుతుంది. మనిషిని మోడు చేసి కన్నీటిని పరమాన్నంగా వడ్డిస్తుంది. కరువు కోరల్లో జన జీవనం కర్కశంగా నలిగి పిప్పై ప్రాణాన్ని చిక్కబట్టుకొని జీవనభృతి కోసం వలసపక్షి ఎగిరిపోతుంది. కరువులిక్కడ అకాల వర్షాలతో రైతుతో జూదం ఆడుతాయి. మేసేందుకు మేతలేదు. తాగేందుకు గుక్కెడు నీళ్ళు లేవు. మైళ్ళకు మైళ్ళు మంచినీళ్ళ ప్రయాణం తప్పదు. బోరేస్తే చెమ్మ తగలడం లేదు. బోరుబావులు బావురుమంటున్నాయి. దాహంతో తపించే సీమకు ప్రతివాన చినుకు ఓ అమృత బిందువే. ఆకాశంకేసి దొరొగ్గి చూసిన చూపేగాని అదునుకు పడ్డ చినుకొక్కటీ అవుపడదు. జాలిలేని ఆకాశం చినుకు రాల్చదు. చినుకే బంగారమైన సీమలో మెతుకే వైభోగం. ఏ వెన్నెల తునకా అన్నం మెతుక్కు సాటిరాదు. ఏ అమావాస్యా ఆకలి రాత్రికి సాటిరాదు. ఇంతటి విషాదాన్ని మోస్తున్న రైతు ముఖచిత్రంలో తుఫాను పుట్టింది. యాభై ఐదేళ్ళ స్వాతంత్రం తర్వాత ఈ రైతాంగ రుగ్మతలకు పరిష్కారం రైతాంగ విప్లవమే. "ఏనాటికైనా ఒక దుక్కి దున్నిన చెయ్యి ఎర్రకోటపై జెండా ఎగరెయ్యాల్సిందే" నన్ ఈ సంకలన రచయితల ఆకాంక్షల సారాంశంతో ఏకీభవిద్దాం. రైతుకవిత పుస్తకంలోని ప్రతి పేజీలోనూ ఓ రైతు సామెతను పొందు పరచడం రైతు సంస్కృతికి అద్దం పడుతుంది. రైతుల ఆత్మహత్యల రుతువులో వచ్చిన ఈ సంకలనం రైతు సమస్యల పరిష్కారానికి ఏ మాత్రం సహకరించినా సంతోషించవలసిందే. – "అరుణతార" (2004 జూన్ & జులై)

# ౯. రవీంద్రుడు..పరిచయం



రవీంద్రుని పేరు వినగానే తరతరాల భారతీయ సంస్కృతికి, విజ్ఞానానికి ప్రతీకయైన రుషితుల్యమైన ఓ ఆకారం మన ముందు ప్రత్యక్షమవుతుంది.

ఆధునిక భారతీయ సాహిత్యాకాశంలో రవీంద్రుడు బహుముఖ ప్రజ్ఞాశాలి సకల విశారదుడు. వంగ సాహిత్యంలో ఆయన చేపట్టని ప్రక్రియ లేదు. రాశిలో, వాసిలో, వైవిధ్యంలో ఆయన సాహిత్యంతో పోల్చదగ్గది చరిత్రలో మరొకటి లేదు. ఆయన దాదాపు 200 గ్రంథాలు రాశాడు. 20వ శతాబ్దపు భారతీయ సాహిత్య ప్రక్రియలన్నింటిపైనా రవీంద్రనాధ టాగూర్ ప్రభావం విశేషంగా కనిపిస్తుంది. ఆయన రచనల్లో ఆర్ష సాంప్రదాయానికి భిన్నంకాని ఆధునికతతో, జాతీయతకు భిన్నం కాని అంతర్జాతీయతతో, సరిహద్దులు లేని విశ్వ ప్రేమతో విలసిల్లే మానవ సమాజాన్ని, హృదయాన్ని కాంక్షించాడు. విశ్వహితుడిగా, విశ్వమానవుడిగా, విశ్వయాత్రికుడిగా, విశ్వకవిగా ప్రపంచ సాహిత్య చరిత్రలోనే అజరామర కీర్తిని గడించాడు.

రవీంద్రునికి ప్రపంచ ప్రఖ్యాతినార్జించి పెట్టిన కవితా సంకలనం “గీతాంజలి”. దానికి 1913లో నోబుల్ బహుమతి వచ్చింది.

దేశదేశాల్లోని మేధావులు దీన్ని ప్రశంసించారు. అనువాదాల ద్వారా ఆయన సాహిత్యం విశ్వమంతటా విస్తరించడం మొదలయ్యింది. రవీంద్రుడు ప్రపంచ వ్యాపితంగా అనేక దేశాలు తిరిగి సర్వమానవాళి క్షేమం కోసం శాంతి, ప్రేమ, ఐక్యతా సందేశాన్ని అందించాడు.

రవీంద్రుడు తత్వవేత్తగా, కళారాధకుడిగా, దేశభక్తునిగా, విద్యావేత్తగా, కర్మయోగిగా అనేక రూపులతో దృగ్గోచరమవుతాడు. జీవించిన 80 సంవత్సరాల కాలంలో 65 సంవత్సరాలు తన రచనా వ్యాసంగంతో, గాన మాధుర్యంతో, నటనా కౌశలంతో, చిత్రకళానైపుణ్యంతో ఈ వసుధను అనంతకాంతులీనే సౌందర్య సౌధంగా తాను దర్శించి మనకు దర్శింపజేస్తాడు.

దాదాపు 2500 గీతాలు రచించి, సంగీతం కూర్చి, పాడి– నటించి 'రవీంద్ర సంగీతం' పేరుతో ఓ నూతన ఒరవడిని తీర్చిదిద్దాడు. ఆయన చరమాంకంలో చిత్రకళాప్రవేశం చేసినా "బెంగాల్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్"లో ఓ ప్రత్యేకమైన శైలిగా రవీంద్ర చిత్రకళ అభివృద్ధి చెందింది.

జీవితంలోని వెలుగునీడలు, కుటుంబాల్లోని సుఖదుఃఖాలు, జీవనంలోని సౌందర్యాలు, మృత్యువులోని మార్మికత, ప్రేమ, దయ, సేవ లాంటి విశ్వమానవ గుణాలను రవీంద్రుని సాహిత్యం ముందుకు తీసుకువచ్చింది. డిగ్రీలు లేని చదువయినా ఆయన రచనలు వంగ సాహిత్యాన్ని తీర్చిదిద్దాయి. వ్యవహారిక భాషలో రచనలు చేసి దానిని ఓ జీవభాషగా తీర్చిదిద్దాడు, రూపంలో, సారంలో గొప్ప మార్పును సాధించాడు. తరువాత రచయితలు అదే మార్గంలో పురోగమించారు.

రవీంద్రుని వంశీయులు పూర్వం నుండి స్వచ్ఛంద ప్రవృత్తికి ప్రసిద్ధి చెందినవారు. తాత ద్వారకానాథ్ టాగూర్ ''రామమోహనరాయ్''కు మిత్రుడు. బ్రహ్మసమాజకుడు. విదేశాలలో వ్యాపారాలు చేసి రాజాగా బతికి. ''ప్రిన్స్ ద్వారకానాథ్ టాగూర్''గా ప్రశంసలు పొందాడు. రవీంద్రుని తండ్రి దేవేంద్రనాథ్ టాగూర్ గొప్ప తాత్వికుడు. రామమోహనరాయ్ శిష్యుడు. ''తత్వబోధిని'' అనే పత్రికను నడిపాడు. బెంగాలు ప్రజలచే ''మహర్షి దేవేంద్రనాథ్''గా గౌరవింప బడ్డాడు. మహర్షి దేవేంద్రనాథ్ కు 14వ సంతానం రవీంద్రుడు. రవీంద్రుని అన్నలు విద్యాధికులు. పెద్దన్న ద్విజేంద్రనాథ్ గొప్ప కవి. రెండో అన్న సత్యేంద్రనాథ్ అపూర్వమేధావి, కవి. ICS ప్యాసయి ఉన్నత పదవులలో రాణించాడు. అయిదవ అన్న జోతిరేంద్రుడు గొప్ప అనువాదకుడు. నాట్యాచార్యుడు. సోదరి స్వర్ణకుమారీ దేవి పలురచనలు, పత్రికా సంపాదకత్వం కూడా వహించి ప్రసిద్ధి చెందింది.

ఇలా కుటుంబంలోని అనేకమంది కళా సాహిత్య రంగాలలో పనిచేసి బెంగాలీ సాహిత్యాన్ని పరిపుష్టం చేశారు.

మహర్షి దేవేంద్రనాథ్ టాగూర్ నిలయం బెంగాల్ సాహిత్య సాంస్కృతిక కేంద్రంగా నిత్యమూ శోభిల్లుతుండేది. దేశ విదేశాల నుండి వచ్చే సంగీతజ్ఞులు, కవులు, కళాకారులు, చిత్రకారులు, పండితులు, దేశనాయకులు, తాత్వికులతో గృహం ఎల్లప్పుడూ సందడిగా వుండేది.

రవీంద్రుని బాల్యం ఈ గృహవాతావరణంలో వర్ధిల్లింది. తరగతి గది చదువులంటే రవీంద్రునికి విముఖత. అందువల్ల ఇంటివద్దనే ఉపాధ్యాయుల శిక్షణలో రవీంద్రుని చదువు సాగింది. సంస్కృతం, ఇంగ్లీషు, జర్మన్ భాషలను అధ్యయనం చేశాడు.

14 వ సంవత్సరం తల్లి చనిపోయింది. ఆ కాస్త చదువూ అటకెక్కింది. అయితే చదవటం, రచనలు చేయడం రవీంద్రుని జీవితంలో విడదీయరాని బంధమైపోయింది. 17 సంవత్సరాల వయస్సులో అన్నగారి పిల్లలతో పాటు చదువు నిమిత్తం లండన్ వెళ్ళినా ఇంగ్లీషు ప్రావీణ్యం సంపాదించాడే గాని డిగ్రీలు పొందలేదు. రవీంద్రుని సాహిత్య సృజన నిత్య నూతనంగా విరాజిల్లుతూనే వుంది. గీతాలు, పాటలతో మొదలు పెట్టి నాటకాలు, నాటికలు, కథలు, నవలలు, వ్యాసాలు, బాలసాహిత్యం ఇలా అన్ని ప్రక్రియలలో సాగింది.

రవీంద్రుని వివాహం మృణాళినిదేవితో 22 సంవత్సరాల వయస్సులో జరిగింది. 28 సంవత్సరాల వయస్సులో రవీంద్రుడు ఆస్తి వ్యవహారాలు చూడవలసివచ్చింది. "సీల్దా" అనే గ్రామంలో వుండే పొలాలు పంటలు చూసుకోవలసి వచ్చింది. పద్మావతి నదిపై స్వంత పడవలో ప్రయాణం చేస్తూ తన ఎస్టేటులోని రైతుల బాగోగులు చూసివచ్చేవాడు. అలా రైతులతో ఏర్పడిన అనుబంధం తరువాత తను రాసిన అనంతమైన రచనలలో ప్రతిఫలిస్తుంది. విద్య పట్ల, విద్యా విధానం పట్ల రవీంద్రునికి నిశ్చితాభిప్రాయాలు వుండేవి. తరగతి గది చదువులంటే రవీంద్రునికి విముఖత. పిల్లలు మాతృభాషలో చదవాలని, స్వేచ్ఛగా విద్యాబోధన జరగాలని రవీంద్రుని ఆకాంక్ష. అందుకు అనుగుణంగా 1901లో "శాంతినికేతన్" స్కూలును పిల్లల కొరకు ప్రారంభించాడు. అదే తరువాత కాలంలో విశ్వభారతి విశ్వవిద్యాలయంగా విలసిల్లింది.

రైతుల అభివృద్ధికి "శ్రీనికేతన్" ఏర్పాటు చేసి రుణాలు, ఆధునిక వ్యవసాయ పద్ధతులు, చేతి వృత్తులు నేర్పించి ఆదాయవనరులను అభివృద్ధి

చేశాడు. చెరువులు, కుంటలు తవ్వించి వ్యవసాయానికి నీటి వసతి కల్పించాడు. వైద్య సదుపాయాలు, విద్యా సదుపాయాలు రైతులకు, రైతు కూలీల పిల్లలకు సమ కూర్చాడు.

## రవీంద్ర బాలసాహిత్యం:

రవీంద్రుడు బాలల కోసం దాదాపు 20 పుస్తకాలు రచించాడు. అందులో కథలు, గేయాలు, నాటికలు చోటు చేసుకొన్నాయి. తాను ఏర్పరచుకున్న తాత్విక దృక్పథాన్ని తన రచనల ద్వారా పిల్లలకు అందించటానికి రవీంద్రుడు ప్రయత్నించాడు. నిజాయితీ, నిబద్ధత, ప్రేమ, దయ, కారుణ్యం, సౌందర్యం వంటి గొప్ప మానవ విలువలను పిల్లల్లో పెంపొందించాలనే లక్ష్యంతో రవీంద్రుడు బాల సాహిత్యాన్ని సృజించాడు. ఆయన రచనలలో అభూత కల్పనలు, విలువల రాహిత్యం లేదు. రవీంద్రుడు కథ చెప్పటంలో గొప్ప నేర్పరి. ఆ నైపుణ్యం అన్ని వయస్సుల పిల్లలని ఎంతగానో ఆకట్టుకొనేది. పిల్లలని కేవలం సంతోష పరచటానికో లేదా తీరిక సమయాలలో కాలక్షేపం కోసం చదవడం కోసమో రవీంద్రుడు బాలసాహిత్యాన్ని రచించలేదు. రవీంద్రునికి ఓ లక్ష్యం వుంది. భవిష్యత్తు పట్ల ప్రేమవుంది. మానవ సమాజ అభివృద్ధిపై కాంక్ష వుంది. అందుకై బాలలను తీర్చిదిద్దాలనే నిర్ణయం వుంది. రవీంద్రుని సాహిత్యానికి కాలం చెల్లడం అంటూ వుండదు. అది బాల సాహిత్యానికి కూడా ముమ్మార్తులా వర్తిస్తుంది.

## గమనిక:

సాహిత్య అకాడమి – బెంగుళూరు వారు తెనాలిలో నిర్వహించిన ''రవీంద్రుడు – బాలసాహిత్య'' సభలో అధ్యక్షోపన్యాసం.

# 10. వీరగాథలు

## పల్నాటి వీరగాథలు – విశిష్టత :



ప్రపంచంలో ఏ జాతికయినా తమ చరిత్రలో పలుమార్లు తలుచుకొని గర్వించదగ్గ సంఘటనలు, విచారించదగ్గ సందర్భాలు అనేకం వుంటాయి. ప్రతి జాతి దాని అస్తిత్వాన్ని కాపాడుకోవటానికి, దాని ఉనికిని మరింత ఉన్నతీ–కరించుకోవటానికి తరచూ వాటిని నెమరు వేసుకుంటూ ఉంటుంది.

ప్రజలే చరిత్ర నిర్మాతలు అయినా ఆ ప్రజలకు నాయకత్వ స్థానంలోవుండి నడిపించే వీరుల గాథల్నీ, బాధల్నీ, విజయాల్నీ, అపజయాల్నీ విస్మరించలేం. అలా విస్మరించిన జాతి చరిత్ర హీనురాలవుతుంది.

ఆంధ్రులకు విస్తారమైన చరిత్ర ఉంది. ఎందరో వీరులు ఆ చరిత్రను సుసంపన్నం చేశారు. ఆ వీరుల కథలు మన ప్రాచీన సాహిత్యంలోనూ, ఆధునిక సాహిత్యంలోనూ ప్రముఖ స్థానాన్నే ఆక్రమించాయి. శిష్ట సాహిత్యంతోపాటు, మనకు అమూల్యమైన జానపద సాహిత్య సంపద ఉంది. శిష్ట సాహిత్యం ఏ కొద్దిమంది విద్యావంతులకీ మాత్రమే అందుబాటులోవుండే విషయం మనందరకు విదితమే. జానపద సాహిత్యంలో ఎక్కువభాగం గానయోగ్యమై సమాజంలోని అన్ని వర్గాలవారిని అలరించే విషయమూ

తెలిసిందే. ఈ జానపద సంపదలో వీరగాథలు విశిష్టమైనవి. ఈ వీరగాథల్ని కొన్ని కులాలవారు అనూచానంగా గానం చేస్తుంటారు.

ఈ వీరగాథల ఇతివృత్తాలను మనం స్థూలంగా పౌరాణిక ఇతివృత్తాలనీ, చారిత్రక ఇతివృత్తాలని విభజించుకోవచ్చు. పౌరాణిక ఇతివృత్తాలకు కేంద్రస్థానం భారత, రామాయణ, భాగవతాది గాథలు. జానపదులు ఈ పౌరాణిక ఇతివృత్తాలకు స్థానికతను జోడించి రసవత్తరంగా గానంచేస్తూ స్ఫూర్తిని కల్గిస్తుంటారు. స్థానికతను జోడించడం అంటే ఆయా ప్రజల ఆచార వ్యవహారాలు, సంస్కృతి, సంప్రదాయాలు ప్రధాన కథకు ఆటంకం లేకుండా చోటు చేసుకుంటాయి. అందువలన ఆ పాత్రలు సంఘటనలు ఆ సమాజానికి సమూహానికి దగ్గరై మరపురాని అనుభూతులను అందించి ఉత్తేజాన్ని కల్గిస్తాయి. మన సంస్కృతీ సుగంధాన్ని భవిష్యత్ తరాలకు అందిస్తాయి.

ఇక చారిత్రక ఇతివృత్తాల వీరగాథలు ఆ జాతి చరిత్రలో మైలురాళ్లుగా నిలిచి పోతాయి. ఆంధ్రుల చరిత్రలో పల్నాటియుద్ధం, బొబ్బిలియుద్ధం, కాటమరాజు కథ, దేశింగురాజు కథ, తిరుపతమ్మకథ, మొదలగు ప్రసిద్ధ కథలేకాక అల్లూరి సీతారామరాజు, కొమరం భీమ్, చిన్నపరెడ్డి, పల్నాటి వీరహనుమంతు, రేనాటి సూర్యచంద్రులు, సర్వాయిపాపడు మొదలగు వీరుల గాథలు గానం చేయబడు తున్నాయి.

## సాహిత్యంలో పల్నాటి యుద్ధగాథ

పల్నాటి యుద్ధం క్రీ.శ.1182లో జరిగిందని చరిత్రకారులు నిర్ణయం. అప్పటి నుండి జానపదులు మౌఖికంగా గానంచేస్తున్న కథాంశాల్ని 15వ

శతాబ్దంలో ఈ ప్రాంతంలో పర్యటించిన శ్రీనాథ మహాకవి విని మంజరీ ద్విపదలో మనకు అందించాడు. ఈ రచనలో కొన్ని భాగాలను మల్లయ్య, కొండయ్యలు పూరించారు. అప్పటి నుండి ఈ అయిదారు వందల సంవత్సరాలలో అనేకమంది ఈ పల్నాటి కథను విభిన్న సాహిత్య ప్రక్రియలలో వెలువరించడం జరిగింది. మరీ ముఖ్యంగా గత శతాబ్దంలో స్వాతంత్ర పోరాట స్ఫూర్తిని ప్రజలలో కలిగించడానికి, స్వాతంత్ర్యానంతరం సమాజ స్వరూప స్వభావాలకను నిర్దేశించుకోవటానికి అనేక ప్రక్రియలలో రచనలు వెలువడ్డాయి. నాటకాలు, పద్య కావ్యాలు, నవలలు, చరిత్రలు – ఇలా దాదాపు 80 రచనలకుపైగా సాహిత్యంలో చోటు చేసుకున్నాయి. మరీ ముఖ్యంగా 30కిపైగా నాటకాలు రచింపబడి ప్రదర్శింపబడ్డాయంటే ఈ కథాంశం మన సామాజిక జీవితాలతో ఎంతగా పెనవేసుకుపోయిందో గమనించవచ్చు.

విదేశీయులైన 'రాబర్ట్ సూయల్' పల్నాటి చరిత్రను 1879లో ఇంగ్లీషులో వెలువరిస్తే, జి. హెచ్. రోఘేర్ 'ది ఎపిక్ ఆఫ్ పల్నాడు' పేరుతో 1981లో వెలువరించారు. జానపాడు గ్రామ వాస్తవ్యులు అలిశెట్టి గాలెయ్యతో 30 రోజులు గానం చేయించి, రికార్డుచేసి ప్రముఖ సాహితీవేత్త వెల్చేరు నారాయణరావుగారి సహకారంతో 'రోఘేర్' ఈ రచన చేశారు.

## పల్నాటి భారతం ఎలా అయింది?

మహాభారత యుద్ధానికి, పల్నాటి యుద్ధానికి సంఘటనలతో, వ్యక్తులతో అనేక పోలికలను గమనించి ఈ గాథను "పల్నాటి భారతం"గా ప్రజలు పిలుచుకుంటారు. ఈ క్రింది కొన్ని పోలికలు మనం ప్రధానంగా గమనించవచ్చు.

| మహాభారతం | పల్నాటి భారతం |
| --- | --- |
| అన్నదమ్ముల బిడ్డల మధ్య జరిగిన యుద్ధం | అన్నదమ్ములమధ్య జరిగిన యుద్ధం |
| మాయా జూదం | కోడిపోరు |
| ఓడిన పాండవులు అరణ్య, అజ్ఞాతవాసాలు | మలిదేవాదుల ప్రవాసం |
| గోగ్రహణం | మందపోరు |
| కృష్ణ రాయబారం | అలరాజు రాయబారం |
| రాయబారి కృష్ణుడ్ని బంధించే ప్రయత్నం | అలరాజుకు విషమిచ్చి చంపడం |
| మాద్రి సహగమనం | మైలమాదేవి సహగమనం |
| కృష్ణుడు | బ్రహ్మనాయుడు |
| పాండవులు | మలిదేవాదులు |
| దుర్యోధనుడు | నలగాముడు |
| కర్ణుడు/ శకుని | నాగమ్మ |

ఇలా మహాభారతంలో అనేక పోలికలుండటం వలన కవులు, సాహిత్యకారులు, ప్రజలు– "పల్నాటి భారతం"గా వర్ణించడం జరిగింది.

## పల్నాడుకు ఆ పేరు ఎలా వచ్చింది ?

పాలరాయి ఎక్కువగా దొరుకుట వలన– పాలనాడు అని; పల్లపు ప్రదేశం కావున – పల్లనాడు అని; పలుగ్రామాలుండుట పలునాడు అని; పల్లవులు పాలించుటచే – పల్లవనాడు అని; బుద్ధుని ధాతువు (పన్ను అవశేషము) నిక్షిప్తంచేసి ఆరామాలు నిర్మించడం వలన – పల్లు (పన్ను) నాడు అని ఇలా ఈ పేర్లన్నీ జనవాడుకలో పల్నాడుగా మారాయని ఎవరికి తోచిన అభిప్రాయాలు వాళ్లు వెలువరించారు.

అలాగే ఈ ప్రాంతం రామాయణంలో ప్రస్తావనకు వచ్చే దండకారణ్యంలోనిదనీ, ఖరదూషణాది రాక్షసులు ఏలిన ప్రాంతమనీ ఖరుడు ఏలిన ప్రాంతం – కారంపూడి అని; దూషణుడు ఏలిన ప్రాంతం దుర్గి అని; మారీచుడు ఏలిన ప్రాంతం – మాచర్ల అని అంటున్నారని ఓ అభిప్రాయం. –

పూర్వం ఈ ప్రాంతాన్ని నాగులు పరిపాలించారని, అందువలన పల్నాడు ప్రాంతంలో ప్రవహించే నదికి 'నాగులేరు' పేరు వచ్చిందని అంటున్నారు.

ఇలా పల్నాడు ప్రాంతానికి, పట్టణాలకు అర్థాలను చెప్పుకొంటున్నారు. వాస్తవమేమిటో ఆ చెన్నకేశవునికే ఎరుక !

## పల్నాడు విశిష్టత

శతాబ్దాలుగా చారిత్రక ప్రాధాన్యతగల ప్రాంతం పల్నాడు. అపార ఖనిజ సంపదకు నిలయం. ప్రకృతి రమణీయతకు నాపరాయి, సున్నపురాయి, సిమెంట్ రాయి గనులున్నాయి. పరిశ్రమలున్నాయి. ప్రపంచ ప్రసిద్ధి చెందిన కోహినూర్ వజ్రం ఈ ప్రాంతంలోని 'కోళ్లూరు' గ్రామంలో దొరికిందనేది చరిత్ర. ఎత్తిపోతల జలపాతం, దైద బిలం, గుత్తికొండ బిలం గొప్ప ప్రకృతి వింతకు నిదర్శనాలు. 'దుర్గి' శిల్పకళకు ప్రసిద్ధి. ఈ ప్రాంతంలో దాదాపు రెండువేల సంవత్సరాలనాడే బౌద్ధం, జైనం పరిఢవిల్లాయి. బౌద్ధం అనగానే ఆచార్య నాగార్జునుడు బౌద్ధానికి చేసిన సేవ గుర్తొస్తుంది. బౌద్ధం, జైనం – ఆనవాళ్లు అనేక గ్రామాలలో చరిత్రకారులు కనుగొన్నారు. పల్నాటి కథాకాలం నాటికి వైష్ణవం, శైవం రంగం మీదకు వచ్చాయి. బ్రహ్మనాయుడు వైష్ణవ పక్షపాతి.

కులమతాలకు అతీతంగా 800 సంవత్సరాలనాడే చాపకూటి సిద్ధాంతాన్ని అమలు చేశాడు. అంటరానివాళ్లకు దేవాలయ ప్రవేశం కల్పించాడు. కడజాతి కన్నమదాసుకు సైన్యాధ్యక్ష పదవి కట్టబెట్టాడు. సైన్యంలో అన్ని కులాల వారిని చేర్చుకొని అభేదాన్ని పాటించాడు. నాగమ్మ శివభక్తురాలు. సాధారణ రైతుకుటుంబంలోపుట్టి, బాల వితంతువై, యుద్ధవిద్యలో ఆరితేరి మంత్రిత్వస్థాయికి ఎదిగి నలగామరాజును మెప్పించి, ఒప్పించి అనేక చెరువులు, బావులు, సత్రాలు నిర్మించి ప్రజల మెప్పుపొంది నాయకురాలై గణుతి కెక్కింది.

పల్నాడు ప్రాంతాన్ని శాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, చోళులు, కాకతీయులు, కొండవీటి రెడ్డి రాజులు – పాలించినట్లుగా సాక్ష్యాధారాలున్నాయి.

స్వాతంత్ర్యోద్యమ కాలంలో పుల్లరి వ్యతిరేక పోరాటంలో తెల్లదొరల నెదిరించి అసువులు బాసిన 'కన్నెగంటి హనుమంతు' ఈ ప్రాంతంవాడే. పల్నాటి పోతన బిరుదాంకితుడు, ప్రముఖ కవి, తపోనిధి 'చిరుమామిళ్ల సుబ్రహ్మణ్య కవి', ప్రముఖ పండితుడు, అవధాని, చిత్ర కవితా రచనా దురంధరుడు అయిన 'పోకూరు కాశీపతి' మాచర్ల ప్రాంతంవారే. ప్రముఖ మావోయిస్టు నాయకుడు రామకృష్ణ; ప్రముఖ చిత్రకారుడు, స్వాతంత్ర్యోద్యమ నాయకుడు గుర్రం మల్లయ్య; గాంధేయవాది స్వాతంత్ర్య సమరయోధుడు నాళం మట్టపల్లి, ప్రముఖ గాంధేయవాది వావిలాల గోపాలకృష్ణయ్య. ఇలా ఎందరో ప్రముఖులకు పల్నాడు ప్రసిద్ధి చెందింది.

## పల్నాటి యుద్ధం – వీరాచారాలు

పల్నాటి యుద్ధంలో మాచర్ల రాజ్యం పక్షాన పోరాడి మృతి చెందిన 66 మంది వీరులకు గుర్తుగా బ్రహ్మనాయుడు కారంపూడిలో వీరాచార పీఠాన్ని ఏర్పరిచాడని ప్రతీతి. ఈ పీఠానికి "పిడుగు" వంశంవారిని పీఠాధిపతులుగా బ్రహ్మనాయుడు నియమించాడని, ఆ వంశస్తులే గత 829 సంవత్సరాలుగా కారంపూడిలో ఉత్సవాలు నిర్వహిస్తున్నారని తెలుస్తుంది. ప్రపంచంలో ఇంత సుదీర్ఘ కాలంగా జరుగుతున్న వీరోత్సవాలు లేవేమో! రాష్ట్రవ్యాప్తంగా 14 జిల్లాలలో ఉన్న ఈ 66 మంది వీరుల వారసులైన దాదాపు 3000 మంది వీరాచారవంతులు ప్రతి సంవత్సరం కార్తీక పౌర్ణమి తరువాత వచ్చే అమావాస్య మొదలు 5 రోజులు ఈ ఉత్సవాలలో పాలుపంచుకుంటున్నారు.

ఈ ఉత్సవాలలో మొదటిరోజు – రాచగావు; రెండవరోజు రాయబారం; మూడవ రోజు– మందపోటు(రు); నాల్గవ రోజు – కోడిపోరు; అయిదవ రోజు – కల్లిపాడు పేరుతో ఈ వీరారాధన ఉత్సవాలు జరుగుతాయి.

అయితే ఈ 5 రోజుల ఉత్సవాల క్రమంలో కొంత తిరుగుడు ఉంది. అది ఎందుకు వచ్చిందో, ఎలా వచ్చిందో తెలియదు. వరుసక్రమంలో 'కోడిపోరు మందపోటు (రు) – రాయబారం' జరగాలి. కాని వీరాచారంలో 'రాయబారం – మందపోటు(రు) – కోడిపోరు' గా నిర్వహించడం ఎందుకో పీఠాధిపతులు చెప్పాల్సిందే.

## పల్నాటి వీరగాథలు – వైరుధ్యాలు

పల్నాటి వీరగాథ ఎక్కువ కాలం మౌఖికంగా ప్రచారమైన గాథ. వీరాచార పీఠం తరపున ఆచారవంతులు పాడే గాథలకు, శ్రీనాథ మహాకవి అనంతరం ఆయన రచన ఆధారంగా వ్రాసిన అనేక గాథలకు కొన్ని మౌలికమైన తేడాలు కనిపిస్తున్నాయి. మహాభారతంలాగా 'పల్నాటి భారతం' కూడా అనేక ఉపకథల సమాహారంగా ఉంది. ప్రధాన కథాంశాలలో ఎక్కువ వైరుధ్యాలు లేకపోయినా కొన్ని ముఖ్యమైన తేడాలు ఉన్నాయి. వీరాచారపీఠం ప్రకారం అనుగురాజుకు భార్యలు ఇద్దరనీ, కుమారులు అయిదుగురనీ, అనుగురాజు మహబూబ్ నగర్ జిల్లా నుంచి ఈ ప్రాంతం వలస వచ్చాడని అంటున్నారు. మహాకవి శ్రీనాథుని రచనద్వారా అనుగురాజుకు ముగ్గురు భార్యలనీ, ఎనిమిదిమంది కుమారులనీ, అనుగురాజు పాలమాచాపురం (జబల్పూర్), ఉత్తర హిందూ దేశం నుండి ఈ ప్రాంతం వచ్చాడని అంటున్నారు. వీర విద్యావంతులు గానంచేసే కథల్ని మాత్రమే వాస్తవమైనవని "పీఠము" వారు భావిస్తున్నారు. ఇలాంటి వైరుధ్యాలను తొలగించుకోవటానికి చరిత్రకారులు, సాహిత్యవేత్తలు తగిన ఆధారాలతో ఈ చరిత్రకు ఓ సమగ్రమైన రూపం ఇవ్వవలసి ఉంది. ఇందుకు ఆధారాలుగా సాహిత్య రచనలే గాకుండా శాసనాధారాల తోడ్పాటుకూడా తీసుకోవలసి ఉంది. మాచర్ల, సత్రశాల, గురజాల, కారంపూడి, కొదమగుండ్ల, పిన్నెల్లి, తేరాల, భృగుబండ, సోమశిల, త్రిపురాంతకం శాసనాలలో ఈ పల్నాటి యుద్ధానికి సంబంధించిన కొన్ని విషయాలు తెలుస్తున్నాయని చరిత్ర కారులు వ్రాస్తున్నారు. సరియగు చారిత్రక ఆధారాలు దొరకని రోజులలో కేవలం జానపదుల మౌఖిక గాథల ఆధారంగా వ్రాయబడిన రచనలు శ్రీనాథుని పలనాటి వీర చరిత్రము. సరియగు చారిత్రక శాసనాధారాలు లభించిన తరువాత కూడా ఆ ఇతివృత్తాలనే సమగ్రము,

నిర్దుష్టము అనుకొని మిన్నకుండరాదు. అలాగే ఆచారవంతులు గానంచేసే కథలలో బ్రహ్మనాయుడుకు దైవత్వం ఆపాదించి మహిమాన్వితునిగా చిత్రించటం, అభూత కల్పనలు, అతిశయోక్తులు కానవస్తాయి. ఇలాంటి ఈ పల్నాటి యుద్ధవీరుల చరిత్రను సాహిత్య రచనలతో, శాసనాధారాలతో నిగ్గుతేల్చి సమగ్రమైన చరిత్రను ప్రజలకు అందించవలసిన కర్తవ్యం మిగిలే ఉంది.

## ఫలశృతి

### చివరకు ఏం మిగిలింది?

ఈ వీరచరిత్రను వివిధ దృక్పథాలు గల రచయితలు వస్తువుగా స్వీకరించి రచనలు చేయడం గమనించవచ్చు. సంప్రదాయవాదులైన శ్రీనాథ మహాకవి, ముదిగొండ వీరభద్రకవి; హేతువాదులైన త్రిపురనేని రామస్వామి చౌదరి, త్రిపురనేని గోపీచంద్, ఏటుకూరి వెంకట నరసయ్య; గాంధేయవాదులైన ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు; కమ్యూనిస్టులైన పులుపుల శివయ్య, వేములపల్లి శ్రీకృష్ణ, మహాకవి శ్రీశ్రీలు తమతమ రచనలలో పల్నాటి వీరచరిత్రను వస్తువుగానో, ఆలంబనగానో చేసుకొని రచనలు చేశారు.

ఏది ఏమైనా తెలుగునాట జరిగిన యుద్ధాలలో పల్నాటియుద్ధం మొదటిదీ కాదు, చివరిదీ కాదు. చరిత్రలో ఇంతకన్నా భయంకరమైన యుద్ధాలు జరిగి ఎందరో వీరులు మరణించారు. పల్నాటి యుద్ధంలోకూడా చివరకు ఇరుపక్షాలు నాశనమయ్యాయి. బ్రహ్మనాయుడు, నాగమ్మ మాత్రమే మిగిలారని ఒక అభిప్రాయం.

అయితే వీరితోపాటు నలగాముడుకూడా మిగిలాడని మరో అభిప్రాయం. ఇలాంటి యుద్ధాలు ఏ పరమార్థాన్ని సాధించాయో మహాకవి శ్రీశ్రీ తన ప్రసిద్ధ కవిత 'దేశచరిత్రలు' లో ఈ విధంగా చెప్పారు.

ఏ దేశ చరిత్ర చూచినా – ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం – రణరక్త ప్రవాహసిక్తం
రణరంగం కానిచోట – భూస్థలమంతా వెదికిన దొరకదు
గతమంతా తడిసె రక్తమున కాకుంటే కన్నీళ్లతో
చారిత్రక విభాత సంధ్యల – మానవ వికాసమెట్టిది?
ఏ దేశంలో ఏ కాలంలో సాధించినదే పరమార్థం?

అందువలన ఎల్లలులేని, యుద్ధాలులేని, దోపిడీలేని మానవ ప్రపంచాన్ని కోరుకుందాం. ఆ ఆశయసాధన కొరకు తెలుగువీర లేవరా! దీక్షబూని సాగరా!

''సాహిత్య అకాడమీ– బెంగళూరు వారు 25– 12– 2011 నిర్వహించిన ''వీరగాధలు– సెమినారు''లో అధ్యక్షోపన్యాసం.



# రాహుల్జీ

రాహుల్ సాంకృత్యాయన్ 1893 ఏప్రిల్ 3న ఉత్తర ప్రదేశ్లోని 'అజమ్ఘర్' జిల్లాలోని ఓ చిన్న గ్రామంలో సనాతన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. ఆయన అసలు పేరు కేదార్నాథ్ పాండే. ఆయన చిన్న వయస్సులోనే జ్ఞానాన్ని అన్వేషిస్తూ ఇంట్లో నుంచి వెళ్ళి కాశీలో సంస్కృతం, అరబ్బీ, పారశీక భాషల్ని అధ్యయనం చేశారు.




- ఈ భాషలే గాక ఆయన దాదాపు ఇంకా 30 భాషల వరకు స్వయం కృషితో నేర్చుకున్నారు
- ఆయన హిందీ, సంస్కృతం, పాళి, భోజ్పురి, టిబెట్ వంటి 5 భాషలలో రచనలు చేశారు.
- ఆయన దాదాపు 125 గ్రంథాలకు పైగా రచించారు. ఆయన రచనలు అచ్చులో 50 వేల పేజీల వరకు పైగా విస్తరించివున్నాయి.
- ఆయన ఆ గ్రంథాలలో పరిశీలించిన విషయాలు చాలా విస్తృతమైనవి.
- తత్వశాస్త్రం, చరిత్ర, సామాజిక శాస్త్రం, విజ్ఞాన శాస్త్రం, పర్యటన, జీవితగాధలు, నవలలు, నాటకాలు, వ్యాసాలు, నిఘంటువులు, వ్యాకరణ గ్రంథాలు, బౌద్ధమతం, జానపద విజ్ఞానం, రాజకీయ పరిశీలనలు, ఇలా అనేక రంగాలకు ఆయన రచనలు వ్యాపించి వున్నాయి.
- రాహుల్ జీ బహుభాషావేత్త. దాదాపు 30 భాషల్లో ఆయనకు మంచి ప్రవేశం వుంది.
- ఆయన భావనా శక్తి అనన్య సామాన్యమైనది. ఆయన గొప్ప మానవతావాది. హేతువాదానికి అంకితమైన స్వేచ్ఛా ప్రవృత్తి ఆయనది.



- ఆయన అనేక దేశాలు పర్యటించారు.
- పాళి, సింహాళం, టిబెటన్ భాషలలోని బౌద్ధమత గ్రంథాలను అధ్యయనం చేసి ''త్రిపిటకాచార్య'' బిరుదును పొందారు.
- టిబెట్ నుండి వందల కొలదీ బౌద్ధసాహిత్య గ్రంథాలను తీసుకు వచ్చారు.
- సింహాళంలో, రష్యాలో బౌద్ధం, సంస్కృతం బోధించే ఆచార్యులుగా పనిచేశారు.
- ఆయన 1935లో రష్యాలో పర్యటించిన అనంతరం సోషలిస్టు అభిమానిగా మారారు.
- ఆయన 1939లో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడిగా చేరారు.
- ఆయన శ్రీలంక, నేపాల్, టిబెట్ లాంటి బౌద్ధదేశాలు అనేకసార్లు సందర్శించారు.
- ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లాండు, రష్యా, జపాన్, కొరియా, ఇరాక్, చైనా వంటి దేశాలు పర్యటించారు.
- 1907 నుండి 1963 వరకు ఆయన జీవితగాధ నిరంతర పర్యటనల గాధే ఆయన రాసిన యాత్రా గ్రంథం 'లోక సంచారి'గా తెలుగులోకి వచ్చింది.
- ఆయన రష్యాలో ''లోలా'' అనే మంగోలు విద్వాంసురాల్ని వివాహం చేసుకున్నారు.
- తరువాత నేపాల్ లోని భారతీయ మహిళ డా౹**కమలను** పెళ్ళి చేసుకున్నారు.

- ఆయన మొదట సనాతన హిందూ సమాజం కంటే ఆర్య సమాజంలో ఎక్కువ స్వాతంత్రం వుందని దానిలో ప్రవేశించారు. కొన్నాళ్ళు పర్సా మఠానికి అధిపతిగా వ్యవహరించారు. వేదాలు, ఉపనిషత్తులకు వ్యాఖ్యలు రాశారు. కాశీ పండితులచే "మహా పండిత" బిరుదు పొందారు.
- భారత యుద్ధం తరువాత భారత దేశంలో ఇద్దరే రుషులు జన్మించారు. ఒకరు బుద్ధుడు, రెండు దయానందుడు అని కొన్నాళ్ళు అభిప్రాయపడ్డారు. తరువాత తన అభిప్రాయాన్ని మార్చుకున్నారు.
- ఆయన బౌద్ధాన్ని ప్రగతిశీలంగా భావించారు. సింహళంలో బౌద్ధమతాన్ని స్వీకరించారు.
- అంతకు పూర్వం వైదిక సాహిత్యం గురించి సంస్కృతంలో ఎంత కృషి చేశారో తరువాత బౌద్ధ సాహిత్యాన్ని గురించి పాళీ భాషలో అంత కృషి చేశారు.
- సింహళంలోని బౌద్ధవిద్వాంసులు ఆయన బౌద్ధ పాండిత్యానికి మెచ్చి "త్రిపీటకాచార్య" అనే బిరుదును ప్రదానం చేశారు.
- బౌద్ధం లోని ప్రధాన గ్రంథాలను ఆయన పాళీ నుంచి హిందీలోకి అనువదించారు.
- ఆయన టిబెట్, నేపాల్ నుండి అనేక బౌద్ధ గ్రంథాలు సేకరించి ఇండియాలో తీసుకువచ్చాడు. కొన్ని సింహళంలో ఇచ్చాడు.
- రాహుల్జీ సింహళ విశ్వ విద్యాలయంలో కొంత కాలం పాళీ భాషకు, బౌద్ధానికి ఆచార్యుడు గా పనిచేశారు. రష్యాలో సంస్కృతం బోధించారు.
- బౌద్ధంలో కంటే కమ్యూనిజంలో ఎక్కువ స్వాతంత్రం వుందని కమ్యూనిస్టు పార్టీలో 1939లో చేరాడు. తాను భౌతిక వాదినని చెప్పుకోవడంలో ఎక్కువ గర్వపడేవాడు.
- భారత ప్రభుత్వంచే 1963లో పద్మభూషన్ పొందారు
- 1963లో ఆయన డార్జిలింగ్ లో కన్నుమూశారు.
- రాహుల్ జీవితం సనాతన పంథాలో ప్రారంభమై అధునాతన పంథాలోకి వికసించింది. ఆయన మార్గం నిరంతరం ప్రగతిమార్గం.

సంస్కృతంలో వేదాలు ఉపనిషత్తులతో ప్రారంభమై పెరిగిన ఆయన జీవితం మార్క్సిజంలోకి పరిణితి చెందింది. 19వ సంవత్సరంలో ''పండిత రామావతార్ శర్మ'' వుపన్యాసం విన్నప్పటి నుండి ఆయనలో హేతువాదంపై ఆసక్తి, అన్వేషణ ప్రారంభమయ్యాయి.

- ∝ 1940–42 సంవత్సరంలో ఆయన జైలు జీవితం గడుపుతూ ''దర్శన్ – దిగ్దర్శన్'' అనే గొప్ప గ్రంథాన్ని రాశారు. ఈ గ్రంధంలో ఆయన గ్రీకు, ఇస్లాం, ఐరోపా, భారతీయతత్వ శాస్త్రాలకు సంబంధించిన విషయాలను, మార్క్సిస్టు అవగాహనతో వివరణాత్మకంగా రచించారు.
- ∝ ఆయన దాదాపు 13 నవలలు రాశారు. అందులో 5 చారిత్రక నవలలు: (1) సింహసేనాపతి (2) జయయోధేయ (3) విస్మృత యాత్రికుడు (4) దివో ధాసు (5) మధుర స్వప్నం.
- ∝ ఆయన రాసిన ''దర్శన్ దిగ్దర్శన్'' 'భారతీయ దర్శనం', 'ప్రాక్పశ్చిమ దర్శనాలుగా' ఆలూరి భుజంగరావుగారు అనువదించారు.
- ∝ 'వైజ్ఞానిక భౌతికవాదం' – ఆలూరి, కవిని అనువదించారు.
- ∝ 'ఓల్గాసే గంగా' – ఇందులో వేద పూర్వకాలం నుండి 1944 వరకు సంబంధించిన 20 కథలు వున్నాయి. ఇది మానవ జాతి పరిణామ చరిత్రను కథల ద్వారా అందించిన గొప్ప గ్రంధం. ఆధునిక భారతీయ సాహిత్యంలోనే అమూల్య ఆభరణం ఈ గ్రంథం.

- ఆత్మకథ:– ఆయన ఆత్మకథ అయిదు సంపుటాలలో దాదాపు 2800 పేజీల గ్రంథం. అది గొప్ప విజ్ఞాన సర్వస్వం.
- జీవిత చరిత్రలు – ''నవ భారత్‌కు నయానేతా'' పేరుతో దాదాపు 50 మంది రాజకీయ ప్రముఖుల సంక్షిప్త జీవిత చరిత్రలు పరిచయం చేశారు.
- అలాగే ''మహామానవ బుద్ధ'' పేరుతో బుద్ధుని జీవిత గాథను మనకు అందించారు.
- మార్క్స, లెనిన్, స్టాలిన్ మావో – లాంటి మార్క్సిస్టు మహా మహుల జీవిత చరిత్రలను హిందీలో రాశారు.
- ఆయన అనేక దేశాలు సంచరించారు. ఆయా సంచారాలపై ఆయన 13 యాత్రా గ్రంథాలు రాశారు.

- ఆయన విలువైన ఇతర రచనలు:1.మధ్య ఆసియా చరిత్ర,2.ఋగ్వేద ఆర్యులు
- తత్వశాస్త్రం : (1) వైజ్ఞానిక భౌతిక వాద్ – 1942 (2) దర్శన్ దిగ్దర్శన్ – 1942 (3) బౌద్ధ దర్శన్ (1942)
- విజ్ఞాన శాస్త్రం – 1) విశ్వకా రూప్ రేఖా 1942
- సామాజిక శాస్త్రం – మానవ సమాజ్
- కథలు – ఓల్గాసే గంగా
- యాత్రా శాస్త్రం – ఘుమక్కర్ శాస్త్రం

పురస్కారాలు: ఆయన కాశీపండిత సభచే "మహాపండిత" బిరుదును, లంక బౌద్ధ సంఘంచే "త్రిపీటికాచార్య" బిరుదును, హిందీ సాహిత్య సమ్మేళన్ – అహమ్మదాబాద్ వారిచే "సాహిత్యవాచస్పతి" బిరుదును, భారత ప్రభుత్వంచే పద్మభూషన్ బిరుదును పొందారు.

ఆయన దార్శనికంగా – భౌతికవాది
మతరూపేణా – బౌద్ధుడు
రాజకీయంగా – సామ్యవాది

రాహుల్ జీ జీవితం బహుభాషా నిలయం
ఆయన జీవిత చరిత్ర ఓ పరిశోధనాలయం
ఆయన జీవితం మానవతా విలువల నిలయం
ఆయన జీవితం దేశభక్తి సమ్మేళనం
ఆయన జీవితం – బౌద్ధతాత్విక నిలయం
ఆయన జీవితం - ప్రపంచ యాత్రాస్థలి
జనావళికి వెలుగుబాట
మన తరానికి కాంతిరేఖ

సేకరణ: అన్నమయ్య ఆధ్యాత్మిక గ్రంథాలయం, గుంటూరు నుండి.

# సంస్కృతి

ఒకానొక సమాజంలోని అన్ని మానవ సంబంధాల సమాహారమే సంస్కృతి. సమాజ జీవితాన్నుండి పుట్టి, తిరిగి సమాజాన్ని ప్రభావితం చేసే జీవ లక్షణం సంస్కృతిది. సాహిత్యం, కళలు అన్నవి సృజనాత్మక సాంస్కృతిక రూపాలు. సాహిత్యం, కళలను ప్రజల నుంచి ప్రజలకు అందిచడం ద్వారా సంస్కృతి పరిఢవిల్లుతుంది. ప్రతిజాతికి, దేశానికి తనదైన జాతీయ సంస్కృతి వుంటుంది. చరిత్రకారులు మన సంస్కృతిని మిశ్ర సంస్కృతి అన్నారు. వేల సంవత్సరాల భారతీయ సంస్కృతి కొన్ని మహోన్నత విలువలను సంతరించుకుంది. ఆ విలువలు మన జాతీయ సంపద. మన సంస్కృతికి ఆత్మవంటిది.




మన సంస్కృతిని గురించి చెబుతూ భిన్నత్వంలో ఏకత్వం మన సంస్కృతి ప్రధాన లక్షణం అని చెబుతారు. మన దేశం అత్యంత ప్రాచీనమైనది. ప్రపంచ సంస్కృతులలో అత్యంత ప్రాచీనమైనది. చైనా, ఈజిప్టు, గ్రీకు, హిందూ సంస్కృతులు అత్యంత పురాతనమైనవి.

మనది ప్రధానంగా వ్యవసాయక దేశం. వ్యవసాయం, నూలు వడకటం, బట్టలు నేయడం, ప్రకృతి వనరులు వుపయోగించుకోవడం ఇవన్నీ మన పూర్వీకుల జీవన విధానంలో అవిభాజ్యమైనవి. ఇవి మన సామాజిక సంబంధాలలో కొన్ని విలువల్ని ప్రోదిచేశాయి. ప్రేమ, సహనం, సౌభ్రాతృత్వం, సేవ మొదలగునవి.

మన సంస్కృతిలో అనేక ప్రధాన లక్షణాలున్నాయి. 1) వివిధ జాతుల సమ్మేళనం (2) వివిధ మతాల సమ్మేళనం (3) అనేక కులాల సమ్మేళనం (4) అనేక భాషల సమ్మేళనం.

మనది వివిధ జాతుల సమ్మేళనం. ఆర్యులు, ద్రావిడులు, గ్రీకులు, హరుణులు, తరుష్కులు, పారశీకులు – ఇలా అనేక జాతులు ఈ దేశానికి వలస వచ్చి ఈ దేశంలో స్థిరపడి ఇక్కడ ఒక మిశ్రమ సంస్కృతిని పాదుచేశాయి. బ్రిటీష్ వాళ్ళు కొన్నాళ్ళు పాలించిపోయారు తప్ప మిగిలిన వారందరూ ఇక్కడ స్థిర నివాసమేర్పరుచుకున్న విషయం గమనార్హం. అయితే బ్రిటీష్ వాళ్ళు తమ ఇంగ్లీషు భాషను మనపై రుద్ది మాతృ భాషలను నిర్వీర్యం చేస్తున్నారు. మాతృభాషలో విద్యాభోధన అనేది రోజురోజుకు మృగ్యమై పోతున్నది.

అనేక భాషల సమ్మేళనం :– అధికార భాషగా 15 భాషలు గుర్తించ బడినా దాదాపు 200 భాషలు పైగా ఈ దేశంలో మాట్లాడే ప్రజలున్నారు.

వివిధ మతాల సమ్మేళనం – హిందూ మతం, జైన మతం, బౌద్ధమతం, మహమ్మదీయ మతం, సిక్కుమతం, క్రైస్తవం – ఇలా అనేక మతాచారాలు ఇక్కడి ప్రజలు అనుసరిస్తున్నారు.

ఇక్కడ కులాలు లెక్కలేనన్ని. ఏ దేశంలో లేని కుల విభజన మన దేశంలో వ్రేళ్ళూనుకొని అనేక సామాజిక జాడ్యాలతో నిండుకొని వుంది.

ఇలా అనేక జాతులూ, మతాలూ, కులాలు భాషలు మన సంస్కృతిలో అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నాయి. వీళ్ళందరూ ఈ దేశ ఐక్యత కోసం గట్టిగా ప్రయత్నించారు. భిన్నత్వంలో ఏకత్వాన్ని చవిచూచారు. వేదాలు, ఉపనిషత్తులు మన వారసత్వ సంపద అయింది. రామాయణం, భారతం మొదలగు కావ్యాలు సంస్కృతం నుండి అనేక భాషలలోనికి

అనువాదమయ్యాయి. ఈ కావ్యాలు భారతీయ సాంస్కృతిక విలువల్ని భావాల్నీ భారత దేశమంతా మరియు ప్రపంచమంతా ప్రచారం చేశాయి.

ఈ రోజు మనం చేయాల్సింది గతాన్ని పునరుద్ధరించడం కాదు. మనం ఎంత గొంతుచించుకున్నా అది జరిగే పని కాదు.

గత సంస్కృతి పునాదిపై నేటి సంస్కృతిని పెంపొందించుకొని ఓ మానవీయ సమాజంగా తీర్చిదిద్దుకోవాలి అందుకు ఎంతో శ్రమించాల్సిన పరిస్థితి మన కళ్ళు ముందుంది.




భారతీయసంస్కృతి అవిచ్ఛిన్నంగా కొనసాగుతుందని కొందరు వాదనలు చేస్తుంటారు. సృష్టి నిరంతర పరిణామం చెందుతుంది. ఈ పరిణామం అనేది సమాజ సంస్కృతి కూడా అందులో భాగమే. ఉదా॥. మన తాతల కాలం నాటి విలువలు, మన తండ్రుల కాలంలో లేవు. మన కాలంలో వుండవు. మన పిల్లల కాలంలో కానరావు. మనలో చాలమందికి హిందూ సంస్కృతే భారతీయ సంస్కృతి అనే భ్రమ వుంది. ప్రత్యేకంగా హిందూ సంస్కృతి అంటూ లేదు. భారతీయ సంస్కృతి అవిచ్ఛన్నంగా కొనసాగుతుందని కొందరి వువాచ. సంస్కృతిని గురించి తెలుసుకోవాలంటే చరిత్ర తెలుసుకోవాలి.

# విమర్శ

విమర్శ వలన తక్కువ కళాప్రమాణంగల కళ క్రమంగా ఉన్నత ప్రమాణాలు అందుకోవటానికి దోహదపడుతుంది. విస్తృత ప్రజానీకం సాగించే పోరాటపు అవసరాలు తీర్చలేని కళ తీర్చే కళగా రూపుదిద్దుకోవటానికి అవకాశం వుంది.

**ప్రజారచయితలు**: ప్రజారచయితలు, కళాకారులు రచ్చకు లాగేది ప్రజలను కాదు. వారిపై దౌర్జన్యము, దోపిడీ చేసి, హింసించే తమ దుష్ప్రభావాన్ని ప్రజలపై చూపే వారిని మాత్రమే. ప్రజలలో కూడా లోపాలుంటాయి. అవి విమర్శతోను, ఆత్మవిమర్శతోనూ పరిష్కారం కావాలి. విప్లవ విద్రోహులైన రచయితలూ, కళాకారులు మాత్రమే, ప్రజలను పుట్టు మూర్ఖులుగానూ చైతన్యరహితులుగాను చిత్రిస్తారు. ప్రజలలో లోపాలను విమర్శించటం అవసరమే. ఆ పని చేయటంలో మనం నిజంగా ప్రజల దృక్పథం అవలంభించాలి. వారిని రక్షించటానికి, బోధించటానికి, చైతన్యపరచటానికి హృదయపూర్వక ఆతురత కనబరచాలి.

ప్రజాబాహుళ్యానికి అపకారం చేసే దుష్టశక్తులన్నిటినీ బట్టబయలు చేయటానికి ప్రజారచయిత ప్రధానకర్తవ్యంగా ఉండాలి.

వర్గాలు మూలంగా సమాజంలో అనేక శత్రుసముదాయాలు ఏర్పడ్డాయి. వాటిని నాశనం చేసే దిశగా ప్రజారచయితల రచనలు వుండాలి. మన రచనలు నిరాశావాదాన్ని, చైతన్యానికి విముఖతనూ తొలగించాలి.

వామ పక్షాలు:- అంటరానివారు (మాల, మాదిగలు):

ఈ దేశంలో వేలాది సంవత్సరాల నుండి మాల మాదిగలు అట్టడుగు వర్గాల వారు – విజ్ఞాన సముపార్జన చేసే హక్కునూ, నైతిక భౌతిక ప్రగతిని నిరంకుశంగా, పాశవికంగా అణచి వేస్తూ వచ్చాయి. ఇక్కడ అగ్రవర్ణాలైన దోపిడీ వర్గాలు. అయితే నిరంతరంగా సాగిపోతున్న ఈ దారుణ దోపిడీకి, నిరంకుశ అధికారానికి వ్యతిరేకంగా అనేక పోరాటాలు జరిగాయి. జరుగుతున్నాయి. నేటి వరకు జరిగిన జరుగుతున్న విముక్తి పోరాటాలలో, గ్రామీణ ప్రాంతాలలో భూమి లేని నిరుపేద వర్గాలలో ప్రధానంగా వున్న మాల మాదిగల చారిత్రక పాత్రను భారతదేశ పరిస్థితులకు అన్వయించడంలో ఇక్కడి వామపక్షాలు విఫలమయ్యాయి. ఈ చారిత్రక సత్యం ధనస్వామ్య, భూస్వామ్య పాలక వర్గాలకు అనుకూలంగా పరిణమించింది. అదే పరిస్థితి నేటికి కొనసాగుతుంది. మాల మాదిగల సమస్యలను పరిష్కరించటంలోనూ, వారిలో రాజకీయ చైతన్యం పెంపొందించే విషయంలోనూ,

వారిమధ్య వున్న అంతర్గత వైరుధ్యాలను రూపుమాపి వారిని ఏకోన్ముఖంగా నడిపించే విషయంలోనూ వామపక్షాలు విఫలమయ్యాయి. అంబేద్కర్ వుద్యమం కూడా ఈ సమస్యను పరిష్కరించే విషయంలో ఇంకా ఆటుపోట్లకు గురవుతూనే వుంది.

పేరుకు లౌకిక రాజ్యంగా ప్రకటించుకున్నా ఆచరణలో కులమత వర్గ వ్యవస్తలను బాహాటంగా సమర్థిస్తున్నాయి. నేటి పాలక వర్గాలు. పార్టీలు. వెనుకబడిన వర్గాల సంక్షేమం, హరిజన గిరిజన సంక్షేమం పేరుతో వారి మధ్య తీవ్రవైరుధ్యాలను సృష్టిస్తూ తమ స్వప్రయోజనాన్ని కాపాడుకుంటున్నది. నేటి భూస్వామ్య దోపిడీ వర్గం. హరిజనోద్ధారణ పేరుతో అట్టడుగు వర్గాలకు కలిగిస్తున్న రాయితాలు ప్రభుత్వాలు దయతో పెడుతున్న ''బిక్ష''గా మిగిలింది. రాజ్యంగంలో నిర్దేశించబడిన హక్కులు, రాయితీలు ద్వారా హరిజనోద్ధరణ సంఘాలు, చర్మకార సంఘాలు స్థాపించటానికి, తద్వారా దళారీల జేబులు నిండటానికి పనికివచ్చాయి.

**ప్రజలు — రచయితలు:**

ప్రజాజీవితం గనిలాంటిది. ఆ గనిలో ముడి పదార్థం కొల్లగా దొరుకుతుంది. దానిని పోగుచేసి గుదిగుచ్చి తమ కలలాను ప్రజాచైతన్యాన్ని రికార్డు చేయడానికి వుపయోగించాలి. ప్రజల పక్షం వహించి, ప్రజలతో సంలీనమై, ప్రజల గుండె చప్పుడులను ప్రజల భాషలో, భావంలో పొదగడం జరగాలి.



మన సాహిత్యం కళాప్రజల కోసం. ప్రజల పోరాటాల్లో సాహిత్యం ప్రజల ఆయుధంగా వుపకరించాలి. సాహిత్య ప్రయోజనాన్ని, సాహితీ పరిమితుల్లోనే పరిశీలించడం అశాస్త్రీయం. నిర్దిష్ట చారిత్రక దశలోని పరిస్థితులతో కలపి అన్వయించాలి. శాస్త్రీయమైన సాహిత్య ప్రయోజనం పోరాట క్రమంలో అనుభవంలోకి వస్తుంది. కొంతమంది రచయితలు విద్యావంతుల భాషను వాడుతారు. ప్రజలు ఉపయోగించే సామాన్య భాషకు రచయితలు రాసే దానికి ఎక్కడా పొంతన కుదరదు. రచయితల భాషా, సాహిత్యం, శ్రామిక వర్గ ఉద్యమంలో భాగం కావాలి. అఖండమైన శ్రామిక వర్గ సంస్కృతిలో అంతర్భాగం కావాలి, ప్రజల అంధకారాన్ని మాత్రమే చిత్రించే రచనలు తప్పక పనికిమాలినవే.★



| | |
|---|---|
| రచయిత | : జాస్తి వుల్లయ్య |
| కలం పేరు | : సంగ్రామ్ |
| జననం | : 15 జూలై 1942, ఉన్నవ, గుంటూరు జిల్లా |
| తల్లిదండ్రులు | : జాస్తి రామకోటయ్య, అక్కమ్మ |
| విద్యాభ్యాసం | : ఉన్నవ, జగ్గాపురం, చీరాల కళాశాల, తిరుపతి |
| ఉద్యోగం | : వైద్య ఆరోగ్య శాఖలో 1964- 2000 వరకు అనంతపురం, ప. గోదావరి, , నెల్లూరు, ప్రకాశం, గుంటూరు పనిచేశారు |
| రచనలు | : వేదాంతభేరి, వాహిని , అరుణతార, సృజన, నూతన మున్నగు పత్రికలలో వచ్చాయి. |
| ఆలోచనలు | : ఆధ్యాత్మికత నుంచి మార్క్సిస్ట్ దృక్పథం వైపు మరలాయి. 1976 నుంచి విరసంలో సభ్యత్వం. |
| అర్ధాంగి | : దాక్షాయణి |
| సంతానం | : డాక్టర్ శివరామకృష్ణ,( పిహెచ్.డి.) యు.ఎస్., మామిళ్ళపల్లి వేదవాణి, |